# ఆంధ్రప్రదేశ్ ను గురించి...

| | |
|---|---|
| విస్తీర్ణం | 1,06,286 చ.మై. |
| జిల్లాలు | 20 |
| తాలూకాలు | 189 |
| గ్రామాలు | 28,997 |
| పట్టణాలు, నగరాలు | 212 |
| మొత్తం జనసంఖ్య (1961) | 359.83 లక్షలు |
| జనసాంద్రత (1961) | 339 చ. మై. కి. |
| అక్షరాస్యులు (1961) | 76.07 లక్షలు |
| షెడ్యూల్డు కులాలవారు (1961) | 49.64 లక్షలు |
| షెడ్యూల్డు తెగల వారు (1961) | 13.24 లక్షలు |
| నమోదైన కర్మాగారాలు | 3,928 |
| విశ్వవిద్యాలయాలు | 4 |
| పంచాయతీలు | 15,[illegible]66 |
| పంచాయతీ సమితులు | 321 |
| ఆంధ్రప్రదేశ్ నుండి పార్లమెంటు సభ్యులు | 61 |
| శాసన సభ సభ్యులు | 288 |
| శాసనమండలి సభ్యులు | 90 |

# ఆంధ్రప్రదేశ్



సంపుటి: 13] ఆగస్టు-సెప్టెంబరు 1969 [సంచికలు 10_11
శ్రావణం_ఆశ్వయుజం 1891 శా.శ

ప్రధాన సంపాదకులు
వి. వామనరావు

మొదటి అట్ట: మన రాష్ట్రపతి
(చిత్రకారుడు : సూరి)

నాలుగవ అట్ట: అగస్టు 15 న సికిందరాబాదులోని పెరేడు మైదానంలో ప్రసంగిస్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రి

వెల: 50 పైసలు

Regd. No. H. 133.

## ఈ సంచికలో....

పేజీ





18—1

## సంపాదకీయం

# ఐకమత్యమే బలం

మన దేశానికి సంబంధించినంతవరకు ఆగస్టు నెల చారిత్రాత్మకమైనది. అనేక గొప్ప సంఘటనలను సృష్టించిన నెల యిది. గాంధీజీ "క్విట్ ఇండియా" నినాదం 1942 ఆగస్టు నెలలోనే దశ దిశల మారుమ్రోగింది. "కరేంగే యా మరేంగే" అని ఆయన చేసిన గర్జన దేశ దేశాలలో ప్రతిధ్వనించింది. భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం సిద్ధించింది 1947 ఆగస్టు 15వ తేదీన. ఆగస్టు నెల చారిత్రిక స్మరణీయమని చెప్పడానికి యింకా అనేక గొప్ప సంఘటనలను ఉదాహరించవచ్చు. అపూర్వమైన రాజకీయ సంచలనం, చైతన్యం కలిగించిన ఎన్నికల వాతావరణంలో శ్రీ వి. వి గిరి యీ యేడు ఆగస్టు నెలలో రాష్ట్రపతిగా ఎన్నికయ్యారు.

ఈ మహోన్నత పదవిని అధిష్ఠించిన తెలుగువారిలో శ్రీ గిరి రెండవవారు. ఆయన భారతజాతికి పితృసమానులు. అనేక ముఖ్య పదవులు నిర్వహించి ప్రజాసేవలో కాకలుతీరిన యోధులు. బారిష్టరుగా, కార్మికనాయకులుగా, కేంద్ర శాసనసభ సభ్యులుగా, మంత్రిగా, రాజనీతివేత్తగా, రాయబారిగా, గవర్నరుగా, రాజ్యసభ అధ్యక్షులుగా, దేశ ఉపరాష్ట్రపతిగా వివిధరంగాలలో వివిధ పదవులను విజయవంతంగా నిర్వహించి నేడు రాష్ట్రపతి పదవిని అధిష్ఠించారు. ఇన్ని పదవులను ఇంత సమర్థంగా నిర్వహించిన మరొక భారతీయ నాయకుడు లేడంటే అతిశయోక్తి కాదు. డెబ్బైఅయిదు సంవత్సరాల వయస్సులో గూడా యౌవన చైతన్యం ఏమాత్రం సడలని శ్రీ గిరి ఎల్లప్పుడూ నూతనోత్తేజంతో వుంటారు. ఆయన భావనలో, ఆలోచనా రీతిలో సిద్ధాంత పరమైన మూఢ విశ్వాసానికి గానీ, సంకుచితత్వానికి గానీ, పక్షపాతానికి గానీ తావులేదు

రాష్ట్రపతులను వరించడంలో భారతదేశం నిజంగా అదృష్టవంతమైన దేశమని చెప్పవచ్చు. మొదటి రాష్ట్రపతి డా రాజేంద్రప్రసాద్ జగమెరిగిన పండితులు, ప్రఖ్యాత గాంధీ తత్వవేత్త; భారతజాతికి నిజమైన ప్రతినిధి. డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ ప్రపంచ విఖ్యాతి పొందిన తత్వవేత్త, మహా మహోపాధ్యాయుడు. సభికులను సమ్మోహపరచే శైలీ సంపదగల సాటిలేని మేటి వక్త. డాక్టర్ జాకిర్ హుసేన్ భారతదేశపు మతాతీత లౌకిక వ్యవస్థ అనే ఆదర్శ ఆకాశంలో ఉజ్వలంగా భాసించిన తార. మంచికీ, మర్యాదకూ, నీతికీ, నిగ్రహానికీ, రాజనీతి వేత్తృత్వానికి ప్రతినిధి. ఆయనలోని హుందాతనం ప్రజల హృదయాలను ఆకర్షించింది.

ఇటువంటి మహితాత్ములకు వారసుడుగా రాష్ట్రపతి పీఠమలంకరించిన శ్రీ గిరి ప్రతిభా శిఖరాగ్రాలు చేరుకున్న ప్రముఖ కార్మిక నాయకులు. తాను నమ్మినది నిజమని, సరియైనదనే విశ్వాసం వున్నంతవరకు, అడ్డంకులను లక్ష్య పెట్టకుండా ఆ మార్గంలో పయనించడానికి వెనుకంజ వేయని ధీశాలి శ్రీ గిరి.

బ్యాంకులను జాతీయంచేసి దేశానికి నూతన జవసత్వాలు ప్రసాదించిన ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ, శ్రీ గిరి విజయాన్ని వేనోళ్ళ ప్రశంసించారు ఆర్థికవిప్లవ పథంలో ప్రజలను పురోగమింప జేయడానికి కంకణంకట్టుకున్న ప్రధానమంత్రి విజయవంతంగా తన విధానాన్ను అమలు పరుస్తున్నారు. మతాతీత లౌకిక వ్యవస్థ, సోషలిజం, జాతీయ సమైక్యత—యివి మనజాతి అభ్యుదయ మహాసౌధానికి పునాదులు. మన రాష్ట్రంలోకూడా ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ఆ ఆదర్శాలను పురస్కరించుకునే సోషలిజం లేకుండా నిజమైన ప్రజాస్వామ్యం లేదనే అభిప్రాయం వెలిబుచ్చారు. రాష్ట్రంలో చిన్న రైతులకు సహకార రంగం ద్వారా పూర్తిగా పరపతి సౌకర్యాలు కలిగించడం మొదలగు అనేక ప్రయోజనకరమైన చర్యలు తీసుకుంటున్నారు. సామ్యవాద సమాజ సూత్రాలను మరింతగా అమలుపరచడానికి యిది నాంది అని చెప్పవచ్చు.

రాష్ట్రపతి శ్రీ గిరి పదవీ స్వీకారం చేసిన తరుణంలో దేశ ప్రజలకు యిచ్చిన సందేశంలో పేర్కొన్న విధంగా,

" అనైక్యతకు దారితీసే సంకుచితత్వాలను విడనాడి మనసులూ హృదయాలూ కలిసి పనిచేయ " గలిగినప్పుడే ఆర్థికాభివృద్ధి కార్యక్రమం విజయవంతం అవుతుంది. ఐక్యత ముఖ్యం. అదే జాతికి బలం.

—వి. వి. ఆర్.

# హృదయైక్యత భావైక్యత కావాలి

—రాష్ట్రపతి ఉద్బోధ



శ్రీ వి. వి. గిరి ఆగస్టు 24 వ తేదీన రాష్ట్రపతిగా పదవీ స్వీకారంచేసిన అనంతరం దేశ సేవకు తమనుతాము పునరంకితం చేసుకుంటూ ఆలోచనాత్మకమూ, గంభీరమూ అయిన ప్రసంగంచేశారు.

ఆ పవిత్ర సమయంలో వారు యిలా అన్నారు :—

"మన దేశ ఐక్యతను కాపాడడానికి నిరంతరం మనం అప్రమత్తులమై వుండాలి. అందుకు రాజకీయ ఐక్యత ఒక్కటే సరిపోదు. అనైక్యతకు త్రోవతీసే సంకుచితమైన కోర్కెలను విచ్ఛిన్నంచేయాలి. రాష్ట్రాల మధ్య ఏర్పడ్డ అగాధాలనూ, మతం పేరుతో నిర్మించిన అడ్డు గోడలనూ పటాపంచలు చేయగల హృదయైక్యత, భావైక్యత కావాలి. మన మత రహిత లౌకిక వ్యవస్థలో దేనిపట్లా వ్యతిరేకమైన భావనలేదు. అన్నివిశ్వాసాలను గౌరవించే నిర్మాణాత్మకమైన వ్యవస్థ అది. ప్రధానంగా అది మానవతా భావాల ప్రాతిపదికగల వ్యవస్థ. రాజ్యాంగంలోని అవతారికలో పౌరులందరికీ న్యాయం, స్వేచ్ఛ, సమత్వం కలిగించడం మన ప్రథమ కర్తవ్యం అని పేర్కొనబడింది. వ్యక్తిత్వ గౌరవం, జాతి ఐక్యతలను పరిపోషిస్తూ ప్రజల మధ్య సోదర భావాన్ని ప్రతిష్ఠించాలని వ్యక్తం చేయబడింది. అందుకే నేనీనాడు నా జీవితాన్ని భారత ప్రజల సేవకూ, వారి సంక్షేమానికి పునరంకితం చేస్తున్నాను."

# మన నూతన రాష్ట్రపతి

# శ్రీ వి. వి. గిరి

శ్రీ వరహగిరి వెంకటగిరి ఒరిస్సా రాష్ట్రంలోని గంజాం జిల్లాలో గల బరంపురంలో 1894 ఆగష్టు 10 వ తేదీన జన్మించారు. వీరి తండ్రిగారైన శ్రీ వి. వి. జోగయ్య పంతులుగారు ఆ వూళ్ళో బాగా పేరుమోసిన వకీలు. శ్రీ గిరి బరంపురంలోని కల్లికోట కళాశాలలో విద్యనభ్యసించారు. గ్రంథాలయోద్యమంలో పాల్గొని, ఆ ఉద్యమ వ్యాప్తికి విశేషించి కృషి చేశారు. తమ స్వగ్రామంలో మొదట్లో ఒక చిన్న గ్రంథాలయాన్ని నెలకొల్పి ఆ తర్వాత దానికి ఒక పెద్ద భవనాన్ని ఏర్పాటు చేశారు.

శ్రీ గిరి ఉన్నత విద్యాభ్యాసానికై ఐర్లండుకు వెళ్ళి 1916 లో న్యాయ శాస్త్రంలో బారిష్టరు అయ్యారు. అయితే 1916 జూన్‌లో వీరిని ఇంగ్లాండునించి భారత దేశానికి పంపించి వేయడంవల్ల బారిష్టరు పట్టాను తీసుకోలేక పోయారు. ఐర్లండ్ నేషనల్ యూనివర్సిటీలో శ్రీ గిరి విద్యాభ్యాసం చేస్తున్న రోజుల్లో సిన్ ఫైన్ ఉద్యమంలో పాల్గొని రాజకీయ కార్యకలాపాలలో ప్రముఖపాత్ర వహించారు.

శ్రీ గిరి 1916లో భారత దేశానికి తిరిగివచ్చిన వెంటనే కాంగ్రెసులో చేరి, ఆ రోజులలో రాజకీయరంగంలో ఒక గొప్ప సంచలనాన్ని కలిగించిన హోంరూల్ లీగ్‌లో ప్రవేశించారు. రెండేళ్ల తర్వాత గాంధీజీ సత్యాగ్రహోద్యమాన్ని ప్రారంభించినప్పుడు శ్రీ గిరి ఆయనతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకున్నారు. గాంధీజీ పిలుపునందుకుని గాంధీ ఉద్యమంలో మరింత ఎక్కువగా పాల్గొనడానికై ఆయన ఎంతో ఉజ్వలంగావున్న న్యాయవాద వృత్తిని సైతం 1921 లో వదులుకున్నారు.

శ్రీ గిరి భారత దేశంలోని ప్రముఖ కార్మిక నాయకుల్లో ఒకరు. ఈ రంగానికి ఆయన చేసిన సేవలు ఎంతో నిర్మాణాత్మకమూ, ప్రయోజనకరమైనవి. 1922 లోనే వీరు కార్మిక సంఘాలతో సన్నిహిత పరిచయం ఏర్పరచుకున్నారు. భారత దేశానికి కార్మికోద్యమానికి పితామహుడనదగిన శ్రీ ఎన్. ఎం. జోషికి వీరు కుడి భుజంలాగా వ్యవహరించారు. అఖిల భారత రైల్వే పనివారల సమాఖ్య వ్యవస్థాపకులలో శ్రీ గిరి ఒకరు. 1926 లోనూ 1942 లోనూ వీరు ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకు అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. సుప్రసిద్ధ కార్మిక నాయకుడుగా శ్రీ గిరి అనేక అంతర్జాతీయ సమావేశాలకు హాజరయ్యారు. 1927 లో జెనీవాలో జరిగిన అంతర్జాతీయ కార్మిక సమావేశానికి ప్రతినిధిగా హాజరయ్యారు. నాలుగేళ్ళ తర్వాత కార్మికుల ప్రతినిధిగా రెండవ రౌండ్ టేబిల్ సమావేశానికి కూడ వీరు హాజరయ్యారు.

శాసనోల్లంఘన ఉద్యమ సమయంలో శ్రీ గిరి బొంబాయి, మైసూరు మద్రాసుల్లో నిషేధపుటుత్తర్వులను అతిక్రమించారు. అయితే ప్రముఖ కార్మిక నాయకుడు కావడంచేత, వారిని దండిస్తే కార్మికులు ప్రతీకార చర్య తీసుకొనవచ్చునని అధికార్లు భయపడి, వారిమీద ఏ విధమైన చర్య తీసుకోలేదు.

1934–37 క్లిష్ట కాలంలో శ్రీ గిరి, కేంద్ర లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యులుగా వున్నారు. ఆనాడు సత్యమూర్తి, భులాభాయ్ దేశాయ్, జిన్నా, పంత్, మాలవ్యావంటి అతిరథమహారథులు కేంద్ర లెజిస్లేటివ్ సభ్యులుగా వుండేవారు. గంజాం—విశాఖపట్నం నియోజక వర్గంనించి శ్రీ గిరి కేంద్ర అసెంబ్లీకి ఎన్నికయ్యారు. శాసన సభలో చర్చకువచ్చే కార్మిక సమస్యలపై ఎప్పుడూ శ్రీ గిరి నిర్భయంగా, నిష్కల్మషంగా మాట్లాడేవారు.

1937 లో శ్రీ రాజాజీ నాయకత్వాన ఏర్పడిన ఉమ్మడి మద్రాసు రాష్ట్రం తొలి కాంగ్రెసు మంత్రి మండలిలో శ్రీ గిరి సభ్యులయ్యారు. కార్మిక విషయాలు, పరిశ్రమలు, సహకారం, వాణిజ్య శాఖలను వీరికి అప్పగించడం జరిగింది. కార్మిక విషయాలలో శ్రీ గిరి తమ అనుభవాన్నీ, అభ్యుదయ విధానాలనూ, నిర్మాణాత్మక దృక్పథాన్నీ ప్రవేశ పెట్టారు.

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో కొద్దికాలంపాటు అధికారంలో వున్న ప్రకాశంగారి మంత్రి మండలిలోకూడా వీరు అవే శాఖలను నిర్వహించారు. కార్మిక విషయాలను బాగా అవగాహన చేసుకున్న వ్యక్తి కావడంవల్ల శ్రీ గిరి, అటు కార్మిక ప్రయోజనాలనూ, యిటు యజమానుల న్యాయసమ్మతమైన ప్రయోజనాలనూ దృష్టిలో పెట్టుకొని వ్యవహరించి యీ యిరువర్గాలవారి ఆదరాభిమానాలను చూరగొన్నారు.

యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అధ్యక్షుడుగా శ్రీ గిరి రెండో ప్రపంచ సంగ్రామ కాలంలో కార్మిక శక్తి అండదండలతో పరాయిపాలకులకు వ్యతిరేకంగా ఆందోళనను లేవదీశారు.

నెహ్రూ ఆశీస్సులతో శ్రీ గిరి 1947 లో సింహళ రాయబారి అయి, ఆ పదవిలో నాలుగేళ్ళపాటు వున్నారు. ఆ సమయంలో భారత సింహళదేశాల మధ్య సుహృద్భావానికి గట్టి పునాదులను వేశారు. 1952 లో తొలి సాధారణ ఎన్నికల అనంతరం

కేంద్రంలో ఏర్పాటైన నెహూర్రు మంత్రిమండలిలో కార్మిక మంత్రిగా చేరి రెండేళ్ళపాటు సమర్థవంతంగా ఆ పదవిని నిర్వహించారు. అయితే బ్యాంకు తీర్పుకు సంబంధించిన విషయంపై ఆయన మంత్రి పదవికి రాజీనామాచేసి సభ్యుల మన్ననలను పొందారు.

శ్రీ గిరి మూడు రాష్ట్రాలలో గవర్నరు పదవులను నిర్వహించారు. 1957 జూన్ నుంచి 1960 జూన్ వరకు ఉత్తర ప్రదేశ్ గవర్నరుగా వున్నారు. ఆ కాలంలో వీరు ఉత్తర ప్రదేశ్ రాష్ట్రానికి పెద్ద అండగా నిలిచారు. కేరళ రాష్ట్ర గవర్నరుగా కూడా వీరు ప్రముఖమైన పాత్ర నిర్వహించారు. సామాన్య ప్రజలలో కలిసిపోయే వీరి తత్వం, లాంఛనరహితమైన నిరాడంబరత ప్రజలను విశేషంగా ఆకర్షించాయి.

1965 ఏప్రిల్‌లో వీరు మైసూరు గవర్నరుగా నియమింపబడారు 1967 మేలో భారత ఉపరాష్ట్రపతి పదవిని చేపట్టారు. 1969 మే నెలలో డా. జాకిర్ హుస్సేన్ మరణించినప్పుడు తాత్కాలిక రాష్ట్రపతి అయ్యారు. రాష్ట్రపతి ఎన్నికలలో పోటీ చేసే ఉద్దేశంతో వీరు జూలై 20 న ఉపరాష్ట్రపతి పదవికి రాజీనామా చేశారు.

ఉపాధ్యక్షులుగా, రాజ్యసభ అధ్యక్షులుగా శ్రీ గిరి ఆ యా కార్యక్రమాలను అతి హుందాగా నిర్వర్తించి అన్ని వర్గాల ప్రజల అభిమానాన్ని చూరగొన్నారు.

ప్రసిద్ధ కార్మిక నాయకుడుగా ప్రఖ్యాతికెక్కిన శ్రీ గిరి చాలా కాలం క్రితమే పార్టీ రాజకీయాలనుంచి దూరంగా తొలగి ఉన్నత లక్ష్యాలు, విశాల దృక్పథంగల విశిష్ట వ్యక్తిగా ప్రజలలో పని చేశారు. లౌకిక సమతావాదీ, ప్రజా స్వామ్యంలో గాఢమైన నమ్మకంగల వ్యక్తీ అయిన శ్రీ గిరి, సంకుచిత దృక్పథానికి అతీతులు. సమున్నత కీర్తి శిఖరాల నధిరోహించగల సమర్థులు. ఎంతటి త్యాగానికైనా వెనుదీయని పదవీ వ్యామోహ రహితులు. దయార్ద్ర హృదయులు. అభిమాన నిధి. అది వించి కూడా ప్రాంతీయ సంకుచితత్వానికి తావివ్వని విశాల దృక్పథం అలవరచుకున్న వ్యక్తి. ముప్పయ్ ఏళ్ళ క్రితమే ఒక సుప్రసిద్ధ పాత్రికేయుడు శ్రీగిరిని గురించి పేర్కొంటూ ఆయనను ప్రాంతీయ రాజకీయాలకు అతీతంగా విశాల భారతీయ దృక్పథం అలవరచుకున్న నాయకుడుగా అభివర్ణించారు. దాక్షిణాత్యుల పద్ధతితో బౌతరాహుల గుణగణాలతో మామూలు ఆంధ్రుల వేషధారణకు అతీతంగావుంటూ, కేవలం స్థానిక రాజకీయాలలోనే నిమగ్నంకాక రాష్ట్రీయ భావాతీతమైన మేధస్సంపదతో శ్రీ గిరి ఒక ప్రత్యేకతను ప్రదర్శించారని ఆయన పేర్కొన్నారు. "తనచుట్టూ ఎన్ని వాదోపవాదాలు ఘర్షణలు జరుగుతున్నా వాటిమధ్యలో నిశ్చింతగా వుండగల గంభీర స్వభావం ఆయన సొమ్ము." ఈ అభిప్రాయం యీనాటికి కూడా ముమ్మాటికీ ఆయన పట్ల వర్తిస్తుంది.

శ్రీ గిరి భారత దేశానికి నాల్గవ అధ్యక్షులు. ఈ అత్యున్నత స్థానాన్ని అధిష్ఠించిన తెలుగువారిలో వీరు రెండవవారు.

# స్వతంత్ర భారతదేశం సాధించిన విజయాలు

మనం సాధించినదేమిటి ?

ఎన్నో వున్నాయి.

పంజాబు, బెంగాలు, సింధ్ నుంచి వచ్చిన లక్షలాది కాందిశీకులకు, మరొక దేశం నుంచి కానీ, లేక అంతర్జాతీయ సంస్థ నుంచి కానీ సహాయాన్ని అర్థించకుండానే పునరావాసం కల్పించాము.

మన ఆయుఃప్రమాణాన్ని రెట్టింపు పైగా పెంచుకున్నాము.

మలేరియా, కలరా, ప్లేగు, మశూచి వంటి ప్రమాదకరమైన అంటు జాడ్యాల బెడదను తప్పించుకొని మరణాల సంఖ్యను తగ్గించుకున్నాము.

మనలో అక్షరాస్యుల సంఖ్య హెచ్చింది.

ఆహారంలోనూ, వస్త్రధారణలోనూ, జీవన పద్ధతిలోనూ మన పరిస్థితిని మెరుగుపరుచుకున్నాము.

మున్నెన్నడూ లేనంత ఎక్కువగా మనం ఆహారాన్ని వుత్పత్తి చేసుకుంటున్నాము.

సంపన్న దేశాలను అర్ధించడం త్వరలో నేమ నివేసే స్థితిలో వున్నాము.

ప్రపంచంలో ఏ దేశంలో కూడా స్త్రీలు నిర్వహించనట్టి ముఖ్యమైన పదవులను మన దేశ స్త్రీలు నిర్వహిస్తున్నారు.

పరిశ్రమల రంగంలో మనం గణనీయమైన అభివృద్ధి సాధించాము.

మనం విమానాలను, రైలింజన్లను, సున్నితమైన పరికరాలను తయారుచేస్తున్నాము. వాటిని ఏదేశాలలో విక్రయిస్తున్నాము.

అణుశక్తి అభివృద్ధి విషయంలో మనం అగ్రరాజ్యాల శ్రేణిలో వున్నాము.

**వీటన్నింటినీ మించిన విశేష మేమిటంటే మనం సాధించినదంతా, ప్రజలుగా మన స్వాతంత్ర్యంతో కానీ, జాతిగా మన సర్వసత్తాక ప్రతిపత్తితోకానీ ఏ విధంగానూ** రాజీపడకుండానే సాధించాము. ప్రపంచంలో మనది పెద్ద ప్రజాస్వామిక దేశం. మనం అరమరికలు లేకుండా మాట్లాడుతాము. మన ప్రచార సాధనాలు ప్రపంచం మొత్తం మీద మన పొరుగు దేశాల్లోగానీ ద్వితీయ ప్రపంచ సంగ్రామం తర్వాత స్వాతంత్ర్యం సాధించిన యితర దేశాల్లో గానీ లేనంత ఎక్కువగా స్వేచ్ఛను కలిగి వున్నాయి.

— శ్రీ కుష్వంత్ సింగ్,
(ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా).



# శాంతి భద్రతలను, సమైక్యతను పరిరక్షించండి

## —గవర్నరు ఉద్బోధ

రాష్ట్ర గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ ఆగస్టు 14 వ తేదీన ఉభయ సభల సంయుక్త సమావేశాన్ని ప్రారంభిస్తూ "తెలంగాణా ఆందోళనకు బాధ్యులైన వారందరూ ఏ ప్రజల శ్రేయస్సుకోసం పోరాడుతున్నామని చెబుతున్నారో ఆ ప్రజల ఉత్తమ శ్రేయస్సుకై వాస్తవంగా తాము పాటుపడుతున్నామా అనే విషయాన్ని గురించి వారు ఆలోచించుకోవలసిన సమయం వచ్చింది" అని అన్నారు. వారి ప్రసంగ పాఠం యిక్కడ యిస్తున్నాం.

గత పర్యాయం మనం కలుసుకొన్న తరువాత సంభవించిన అతి విషాదకరమైన సంఘటనను—అంటే మన రాష్ట్రపతి డా. జాకిర్ హుస్సేన్ అస్తమయాన్ని—స్మరణకు తెచ్చుకుంటూ శాసన మండలి ఉభయ సభల సంయుక్త సమావేశంలో నా ప్రసంగాన్ని మిక్కిలి విచారంతో ప్రారంభిస్తున్నాను. మహాత్ముని ఆదర్శాలు అనేకం మూర్తీభవించిన డా. జాకిర్ హుస్సేన్ నాయకత్వాన్ని, మార్గదర్శకత్వాన్ని మనం గాంధీ శతజయంతి సంవత్సరంలోనే కోల్పోవటం మన దురదృష్టం. మన రాజధానీ నగర సమిష్టి సంస్కృతిని గర్వకారణంగా భావించుకొంటున్న మనకు డా. జాకిర్ హుస్సేన్ నిర్యాణం మరింత బాధాకరమైనది. ఇందుకు కారణం ఆయన ఈ మహానగరంలో జన్మించడం మాత్రమే కాదు, ఆయన వ్యక్తిత్వం ఈ సమిష్టి సంస్కృతికి అత్యుత్తమ ఉదాహరణంగా భాసిల్లింది.

డా. జాకిర్ హుస్సేన్ వంటి మహావ్యక్తిని ప్రసాదించిన ఈ నగరమందు గాంధీ శత జయంతి జరుపుకొంటున్న ఈ సంవత్సరంలోనే సంకుచిత ప్రాంతీయతత్త్వం, పరస్పర ద్వేషభావం ఉద్రేక పూరితంగా ప్రచారం కావడం, తత్ఫలితంగా పలుతావులలో హింసాకాండ, కొనసాగడం అత్యంత విచారకరం. ఒకేభాష, ఒకే సంస్కృతి కలిగియుండి శతాబ్దాలపాటు సాగిన ఎడబాటు తరువాత ఏక రాష్ట్రంగా ఏర్పడిన ప్రజలమధ్య సంఘర్షణ చెలరేగడం మరింత విషాదకరం.

### నివాస నిబంధనల పొడిగింపు

తెలంగాణా ప్రాంతాన్ని అభివృద్ధి పరచడానికి, ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు చేసుకొన్న పెద్దమనుషుల ఒప్పందంలో సంకల్పించిన తెలంగాణా రక్షణలను అమలుపరచడానికి మన ప్రభుత్వం సర్వదా ఉత్సుకత చూపుతున్న సంగతి గౌరవ సభ్యులకు తెలిసినదే. నివాస నిబంధనలను మరో అయిదు సంవత్సరాల పాటు పొడిగించవలసిందిగా ప్రభుత్వం సిఫారసు చేసిందని, మూడవ ప్రణాళికా కాలంలో జమకూడిన మిగులు నిధులను నాల్గవ

ప్రణాళికలో తెలంగాణా ప్రాంతమందు ప్రత్యేకాభివృద్ధి పథకాల కోసం సమకూర్చడానికి ప్రభుత్వం పూనుకొన్నదని కూడా క్రిందటి సారి నేను ప్రసంగించినప్పుడు తెలియజేశాను.

తెలంగాణా ప్రాంతం ప్రజల భయసందేహాలను పోగొట్టే ఉద్దేశంతో 1969 జనవరి 19 వ తేదీన అఖిలపక్ష సమావేశం జరిపి, ఆ ప్రజల కష్టనిష్ఠురాలను తొలగించడానికి కొన్ని కార్యక్రమాలు రూపొందించడం జరిగింది. వాటిని అమలు పరచడానికి ప్రభుత్వం గట్టి చర్యలు తీసుకొన్నది. కాని 1959 ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వోద్యోగాల (నివాసార్హత) నియమావళి చెల్లనేరదని సుప్రీంకోర్టు తీర్పు చెప్పినందువల్ల ఉద్యోగావకాశాలకు సంబంధించిన నిబంధనల విషయంలో కొన్ని ఇబ్బందులు ఎదురయ్యాయి. ఐనప్పటికీ ఈ ప్రాంతంలో ఉద్యోగావకాశాల స్థాయిని కాపాడే నిమిత్తం వివిధ తరగతులకుచెందిన రెండువేలకు పైగా అదనపు పదవులను ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం వెంటనే పూనుకొన్నది. ఈపదవులనూ, ఇప్పుడున్న ఖాళీలనూ భర్తీ చేయడానికిగాను రెండు వేలకు పైబడి అభ్యర్థులను స్థానకముగా చేర్చుకోవడం జరిగింది.

## ప్రధాని అష్టసూత్ర ప్రణాళిక

ఏప్రిల్ మాసంలో ప్రధాన మంత్రి చొరవతీసుకొని వివిధ వర్గాల ప్రతినిధులతో చర్చలు జరిపారు."తెలంగాణాలో నివసిస్తున్న ప్రజల యథార్థమైన సమస్యలను పరిష్కరించే నిమిత్తం నిర్మాణాత్మకమైన చర్యలను రూపొందించేఉద్దేశంతోను;తెలంగాణాప్రాంతంలోని ప్రజల అవసరాలను తీర్చేందుకు తక్షణ మార్గాలను, దీర్ఘకాలిక మార్గాలను రూపొందించే ఆశయానికి దోహదం చేయగల అత్యవసరమూ, ఇదమిద్ధమూ అయిన పరిష్కారాలను అన్వేషించవలసిన ఆవశ్యకతను, ఆంధ్రప్రదేశ్ సమైక్యతను సమగ్రతను, కాపాడి పటిష్ఠం చేయవలసిన ఆవశ్యకతనూ దృష్టిలో వుంచుకొని "ఈచర్చలు జరుపబడ్డాయి. ఈ ఆశయసిద్ధికోసం తెలంగాణా ప్రాంతాన్ని అభివృద్ధి పరచడానికి, ఈ ప్రాంతం ప్రజలకు ప్రభుత్వోద్యోగాల విషయంలో సముచితమైన రాజ్యాంగ రక్షణలు రూపొందించడానికి, తెలంగాణాకు వర్తించే మిగులు నిధులను నిర్ణయించడానికి సంబంధించి ప్రధాని అష్టసూత్ర కార్యక్రమం ఒక దానిని ప్రకటించారు. తదనుగుణంగా, ఉద్యోగాల విషయంలో రాజ్యాంగ రక్షణలను సమకూర్చడం గురించి పరిశీలించేందుకు న్యాయవేత్తల సంఘాన్ని, మిగులు నిధులను నిర్ణయించేందుకు ఉన్నతాధికార సంఘాన్ని భారత ప్రభుత్వం నియమించింది. న్యాయవేత్తల సంఘం నివేదికను భారత ప్రభుత్వం పరిశీలిస్తున్నది. మిగులునిధుల సంఘం ఈ నెలాఖరులోపుగా నివేదికను సమర్పించ గలదని ఆశించబడుతున్నది.

## తెలంగాణా అభివృద్ధి సంఘం

రాష్ట్ర ప్రభుత్వంకూడా ఉన్నతాధికారాలుగల తెలంగాణా అభివృద్ధి సంఘాన్ని నియమించింది. ఈ సంఘానికి ముఖ్యమంత్రి అధ్యక్షులుగాను, ప్రణాళికా సంఘ సభ్యులు ఒకరు, ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గంలో తెలంగాణా ప్రాంతానికి చెందిన మంత్రులు, తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షులు సభ్యులుగాను వుంటారు. ఈ సంఘం మొదటి సమావేశం ఇదివరకే జరిగింది. ఈ సమావేశంలో తెలంగాణా అభివృద్ధికి సంబంధించిన ప్రత్యేక సమస్యలు పరిశీలించబడ్డాయి; తెలంగాణా ప్రాంతం విషయంలో, ప్రస్తుత సంవత్సరానికి వార్షిక ప్రణాళికకు తుది రూపమీయడంకూడా జరిగింది. ఈ ప్రణాళిక ప్రకారం తెలంగాణా ప్రాంతంలో వినియోగం రూ. 39.14 కోట్లు కాగలదు. ఈ మొత్తంలో ప్రత్యేక అభివృద్ధి పథకాలకు సంబంధించిన రూ. 9 కోట్లుకూడా చేరివుంది. కాగా రాష్ట్రం అంతటికి సంబంధించిన మొత్తం వినియోగం రూ. 87.5 కోట్లు. ప్రధానమంత్రి అష్టసూత్ర కార్యక్రమంలో ఉద్దేశించిన ప్రకారం ప్రభుత్వం అధికార స్థాయిలో ప్రణాళికా అమలు సంఘం ఒకదానినికూడా ఏర్పాటుచేసింది. ఈ సంఘానికి ప్రణాళికా సంఘం సలహాదారు అధ్యక్షులుగా వుంటారు. ఇందులో కేంద్ర ఆర్థిక, దేశ వ్యవహారాల మంత్రాంగశాఖ ప్రతినిధులు రాష్ట్రప్రభుత్వప్రతినిధులు సభ్యులుగా వుంటారు. ప్రణాళిక అమలుజరిగే పద్ధతినిగురించి సవివరంగా నియతకాలికమైన సమీక్ష జరపడం ఈసంఘం ఆశయం. రాష్ట్రాలపునర్వ్యవస్థీకరణ చట్టంలోని నిబంధనలననుసరించి సర్వీసులను ఏకీకృతం చేసేవిషయమై ఉద్యోగుల కష్టనిష్ఠురాలను తొలగించే ఉద్దేశంతో వారి విన్నపాలను పరిశీలించేందుకై ఆ చట్టం క్రింద ఏర్పాటు చేయబడిన కేంద్ర, రాష్ట్ర సలహా సంఘాల ప్రత్యేక సమావేశాలను ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ఈ సంఘాలు చేసిన సిఫారసులపై భారత ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాలను అమలు, పరిచేందుకు సత్వరమైన చర్య తీసుకొనబడుతున్నది.

తెలంగాణా ప్రజల న్యాయమైన హక్కులను కాపాడేందుకు ఆ ప్రాంతాన్ని అభివృద్ధి పరిచేందుకు ప్రభుత్వం ఎల్లప్పుడు చర్యలు తీసుకొంటూనే ఉన్నది. అయినప్పటికీ కొన్ని వర్గాలవారు తెలంగాణా ప్రాంతానికి ప్రత్యేక రాష్ట్ర ప్రతిపత్తి కోరుతూ ఆందోళన సాగిస్తున్నారు ఈ ఆందోళన తరుచు హింసాత్మక రూపం కూడా వహించింది. తత్ఫలితంగా ప్రాణనష్టం, ప్రభుత్వ, ప్రయివేటు ఆస్తుల నష్టం సంభవించింది. తరుచు "బంద్"లను నిర్వహించడం ఈ ఆందోళనలోని ఒక లక్షణం. ఈ "బంద్"ల కారణంగా పారిశ్రామిక, వాణిజ్యసంస్థలు ఇబ్బందికి గురిఅయినాయి. విద్యా సంస్థలను చాలా కాలంగా మూసివుంచనంతో విద్యార్థిలోకం బాగా నష్టపడటం జరిగింది. ప్రభుత్వోద్యోగులలో కొన్ని వర్గాల వారు ఆందోళనలో పాల్గొనడంవల్ల ప్రభుత్వ పరిపాలన దెబ్బ తిన్నది. ఆ ఉద్యోగులు ప్రస్తుతం పనిలో తిరిగి ప్రవేశించారు. వారి క్రమశిక్షణారాహిత్యంపట్ల ప్రభుత్వం ఉదార దృక్పథం వహించినప్పటికీ, ప్రభుత్వోద్యోగులు రాజకీయోద్యమాల్లో పాల్గొనడం మిక్కిలి విచారకరం కాగలదు.

ఈ ఆందోళన మూలంగా శాంతి భద్రతలకు వాటిల్లే ప్రమాదాన్ని ఎదుర్కొనేందుకుగాను ప్రభుత్వం గట్టి చర్యలు తీసుకోవలసి వచ్చింది. కొన్ని సందర్భాల్లో సైన్యాన్ని రప్పించడంకూడా జరిగింది. కొంతమంది అమాయకులు గాయపడడమో, ప్రాణాలను కోల్పోవడమో జరిగింది. ఇందుకు ప్రభుత్వం సంతాపం వ్యక్త

పరుస్తున్నది. గాయపడినవారికి, ప్రాణాలు కోల్పోయినవారి కుటుంబాలకు ప్రభుత్వం సహాయం అందజేసింది. ప్రభుత్వం తీసుకొంటున్న చర్యలవల్ల పరిస్థితి అదుపులోకి రాగలదని ప్రభుత్వం విశ్వసిస్తున్నది.

ఈ ఆందోళన కారణంగా తెలంగాణా ప్రాంతం ఆర్థిక వ్యవస్థ తీవ్రంగా దెబ్బతిన్నది. తెలంగాణా ప్రాంతంలో ముఖ్యముగా జంట నగరాల్లో వర్తకం, పరిశ్రమలు బాగా నష్టపడ్డాయి. పెట్టుబడిపెట్టి పరిశ్రమలను అభివృద్ధి పరచేందుకు ఇటీవల ఏర్పడిన అనుకూల వాతావరణం చెడిపోయింది.

అందుచేత ఈ ఆందోళనకు బాధ్యులైన వారందరూ ఏ ప్రజల శ్రేయస్సుకోసం పోరాడుతున్నామని చెబుతున్నారో, ఆ ప్రజల ఉత్తమ శ్రేయస్సుకై వాస్తవంగా తాము పాటుపడుతున్నామా అనే విషయాన్ని గురించి వారు ఆలోచించుకోవలసిన సమయం వచ్చింది.

## నక్సలైట్ల బెడద

అయితే రాష్ట్ర శాంతిభద్రతలకు మరింత అధికమైన బెడద నక్సలైట్లవల్ల కలిగింది. వారు ముఖ్యంగా శ్రీకాకుళం జిల్లాలో తమ కార్యకలాపాలను సాగిస్తున్నారు. వారు ఇటీవలే తమ కార్యకలాపాలను వరంగల్లు, ఖమ్మం, కరీంనగరు జిల్లాలకుకూడా విస్తరింపజేశారు. బలప్రయోగంద్వారా ప్రభుత్వాన్ని కూలద్రోయడమన్నదే వారి ప్రధాన ఆశయం. వారు మారుమూల ప్రదేశాలలో అధికారులను ఎత్తుకు పోతున్నారు. వారిపై దాడి సల్పుతున్నారు. పరిపాలనకు అంతరాయం కలిగిస్తున్నారు. ఈ నక్సలైట్లు గ్రామాలపై దాడిచేసి భయాందోళనలు కలిగించి దోపిడీలు, హత్యలు కూడా గావిస్తున్నారు. పోలీసులు వారితో పెక్కుసార్లు సాయుధ పోరాటాలు జరపవలసి వచ్చింది. 1948, ఆంధ్రప్రదేశ్ అల్లరుల అణచివేత చట్టంక్రింద శ్రీకాకుళం జిల్లాలోని కొన్ని ప్రదేశాలను అల్లర్లు జరుగుతున్న ప్రదేశాలుగా ప్రకటించడం జరిగింది. ఈ దాడులకు గురైన అన్ని ప్రాంతాలలోను పోలీసు ఏర్పాట్లు తీవ్రతరం చేయబడ్డాయి. నక్సలైట్ల కార్యకలాపాలను నానాటికీ అణచివేయడం జరుగుతున్నది.

ఒకవైపు తెలంగాణా ఆందోళనలతోనూ, మరోవైపు నక్సలైట్ల కార్యకలాపాలతోనూ నిరంతరం మన పోలీసుదళం అత్యంత శ్రమ ప్రయాసలకోర్చి పనిచేస్తున్నది. ఈ అసాధారణ పరిస్థితులలో పోలీసు అధికారులూ, సిబ్బందీ తమ విధి నిర్వహణపట్ల ప్రదర్శించిన శ్రద్ధాశక్తులను ప్రభుత్వం ఎంతగానో కొనియాడుతున్నది.

## తుఫాను నష్టాలు

గత సంవత్సరం తీవ్రమైన అనావృష్టివల్ల కలిగిన పరిస్థితులనుండి రాష్ట్రం పూర్తిగా తేరుకొనకముందే 1969 మే లో సంభవించిన పెనుతుఫాను మున్నెన్నడూ లేనంత తీవ్రరూపంలో గుంటూరు, కృష్ణా, ఖమ్మం, పశ్చిమగోదావరి జిల్లాలలోని పెక్కు ప్రాంతాలను బీభత్సం చేసింది. ఈ బీభత్సానికి 2,000 లకుపైగా గ్రామాలు, 50 లక్షలకుపైగా జనాభా గురిఅయ్యాయి. దాదాపు 800 మంది ప్రాణాలు కోల్పోయారు. సుమారు 2 లక్షల పశువులు చనిపోయాయి. రమారమి 2 లక్షల ఇళ్లు కూలిపోవడమో, దెబ్బతినడమో జరిగింది. 5 లక్షల ఎకరాలకుపైగా వరిపంట పూర్తిగా నాశనం కావడమో తీవ్రంగా దెబ్బతినడమో జరిగింది. కృష్ణా డెల్టాలో నీటిపారుదల సౌకర్యాలు, పెక్కుసాగునీటి చెరువులు విపరీతంగా దెబ్బతిన్నాయి.

## సహాయక కార్యక్రమం

ఇతరమైన వాటితోపాటు పునరావాసం నిమిత్తం తోడ్పడేందుకుగాను దెబ్బతిన్న ఇళ్ళ యజమానులకు నగదు గ్రాంట్లు ఇవ్వడం, భవన నిర్మాణ సామగ్రి అందచేయడం, బెస్తవారు, నేతపనివారు, పశువుల కాపరులు మున్నగువారికి నగదు రూపంలోనో, వస్తురూపంలోనో సహాయం అందజేయడం ద్వారా ప్రభుత్వం ఒక సమగ్రమైన సహాయ కార్యక్రమాన్ని మంజూరుచేసింది. ఖరీఫ్ పంటకు నీరు సరఫరా చేయగలిగేందుకు వీలుగా దెబ్బతిన్న నీటి పారుదల నిర్మాణాలకు అత్యవసర ప్రాతిపదికపై మరమ్మతులు చేపట్టబడ్డాయి. సుమారు రూ. 16 కోట్లు ఖర్చుకాగల ఈ సహాయక కార్యక్రమాలు, మరమ్మతు పనులు కేంద్ర ప్రభుత్వం అందజేసే ఆర్థిక సహాయంతో చేపట్టడం జరుగుతున్నది.

## కేంద్ర సహాయం

ప్రస్తుత సంవత్సరం డెల్టాప్రాంతాలో డ్రెయినేజి పథకాలను అమలుపరచే నిమిత్తం కేంద్ర ప్రభుత్వం రూ.3 కోట్ల మేరకు ప్రత్యేక ఋణాన్ని సయితం సమకూర్చనున్నది. తుఫాను వరదలకు గురైన ప్రాంతాలలో సహాయక చర్యలుచేపట్టే నిమిత్తం ఎంతో ఔదార్యంతో సకాలంలో సహాయం సమకూర్చినందుకుగాను కేంద్ర ప్రభుత్వానికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

వరద బాధితుల కష్టనష్టాలను తీర్చడంలో వివిధ అధికారేతర సంస్థలు సహాయ సహకారాలను అందజేసినందుకు వారికి ప్రభుత్వం కృతజ్ఞతలు తెలుపుతున్నది. జిల్లా కలెక్టర్లు, వివిధ శాఖల అధికారులు సహాయ కార్యక్రమాలను సత్వరంగాను, సమర్థవంతంగాను నిర్వహించినందుకు వారినికూడా ప్రభుత్వం ఎంతగానో శ్లాఘిస్తునది.

ప్రస్తుత ఆర్థిక సంవత్సరం మొదటి ఆరు నెలలలో వ్యయానికి గాను గత సమావేశంలో ఓట్ ఆన్ అకౌంటు తీసుకున్న సంగతి గౌరవ సభ్యులకు విదితమే. 1969–70 అంతిమ బడ్జెటు ఈ సమావేశంలో సమర్పించడం జరుగుతుంది.

ఇతర విషయాలతోపాటు దిగువ తెల్పినవాటితోసహా వివిధ శాసనాలను మీరు ఈ సమావేశంలో పరిశీలించగలరు:

1. 1968, పోలీసు (రాజ్య వ్యతిరేక ప్రేరేపణ) ఆంధ్రప్రదేశ్ సవరణ బిల్లు.
2. 1968, ఆంధ్రప్రదేశ్ పట్టణముల పీడల (సవరణ)బిల్లు.

3. 1968 ఆంధ్రప్రదేశ్ హోంగార్డుల బిల్లు.

4. 1968 ఆంధ్రప్రదేశ్ జూదం బిల్లు.

5. 1969 ఆంధ్రప్రదేశ్ విద్యుచ్ఛక్తి సరఫరా సంస్థల (అధిగ్రహణం) విస్తరణ, సవరణ బిల్లు.

6. 1969, ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర ప్రాంతపు) కౌలుదార్లు, రైతుల రక్షణ సవరణ బిల్లు.

7. 1894, ఆంధ్రపదేశ్ (ఆంధ్ర పాంతపు) యాజమాన్యపు ఎస్టేట్ల గ్రామ సర్వీసుల చట్టమును 1895, ఆంధ్రప్రదేశ్ (ఆంధ్రప్రాంతపు)వంశాగత గ్రామోద్యోగుల చట్టమును మరికొన్ని ఇతర శాసనములను రద్దుపరచుచు చేసిన 1969లోని 1వ ఆంధ్ర ప్రదేశ్ ఆర్డినెన్సు స్థానే ప్రవేశపెట్టు బిల్లు.

8. 1959, ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిపరిషత్తులచట్టమును సవరించు 1969లోని 3వ ఆంధ్రప్రదేశ్ ఆర్డినెన్సు స్థానే ప్రవేశపెట్టు బిల్లు.

9. 1955, హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషను చట్టమును సవరించు 1969లోని 2వ ఆంధ్రప్రదేశ్ ఆర్డినెన్సు స్థానే ప్రవేశ పెట్టు బిల్లు.

ఏ ప్రాంతం వారైనప్పటికి మన ప్రజల శ్రేయస్సు మన రాష్ట్ర ఆర్థిక వ్యవస్థయొక్క పురోభివృద్ధిపైననే సర్వదా ఆధారపడి వుంటుందనీ రాష్ట్ర సమైక్యతను, సమగ్రతను పరిరక్షించుకున్నప్పుడు మాత్రమే రాష్ట్ర సంపూర్ణ వికాసానికి దోహదం చేకూరుతుందనే విషయంలో గౌరవ సభ్యులు నాతో ఏకీభవించగలరని నమ్ముతున్నాను.

అందుచేత మహోన్నతమైన తెలుగు సంస్కృతికి, వారసత్వ సంపదకు ఉమ్మడిగావారసులైన గౌరవ సభ్యులందరూ రాష్ట్ర మంతటా మైత్రీ సుహృద్భావాలను తిరిగి నెలకొల్పడం ప్రప్రథమ కర్తవ్యంగా భావించుకోవాలని కోరుతున్నాను.

మీ సమాలోచనలు జయప్రదం కావాలని ఆకాంక్షిస్తున్నాను.

---

# హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా శ్రీ ఎన్. కుమరయ్య నియామకం



న్యాయమూర్తి శ్రీ ఎన్. కుమరయ్య 1969 ఆగస్టు 1వ తేదీన ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా పదవీ స్వీకారం చేశారు. రాజ్‌భవన్‌లో రాష్ట్రగవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ న్యాయమూర్తి శ్రీ కుమరయ్యచే పదవీప్రమాణం చేయించారు.

ఈ ప్రమాణస్వీకారోత్సవానికి ముఖ్యమంత్రి, ఉపముఖ్యమంత్రి, ఇతర మంత్రులు, శాసనమండలి అధ్యక్షుడు, ప్రభుత్వ ప్రధానకార్యదర్శి, హైకోర్టున్యాయమూర్తులు, న్యాయశాఖ అధికారులు, సీనియర్ అడ్వొకేట్లూ హాజరయ్యారు.

# ముఖ్యమంత్రి
# స్వాతంత్ర్య దినోత్సవ సందేశం



"ఇది సంకుచితమైన, విచ్ఛిన్నకరమైన విమర్శలు చేయవలసిన సమయంకాదు ఇతరులను ద్వేషించవలసిన, నిందించవలసిన సమయం కాదు. భారతమాత పుత్రులందరూ సుఖ సంతోషాలతో నివసించడానికి అనువైన స్వతంత్ర నవభారత సౌధాన్ని మనం నిర్మించాలి." అని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ఒక సందర్భంలో అన్నారు. వారి యీ మాటలు యీనాటికీ భారత దేశానికి అన్వయిస్తాయి.

ఇరవై రెండు సంవత్సరాల క్రితం మనకు స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచీ మనం కలలుకన్న భారత దేశాన్ని—అంటే విశ్వశాంతికి అంకితమై మన చరిత్ర, మన సంస్కృతిలోని ఉత్కృష్టమైన లక్షణాలన్నీ మూర్తీభవించిన నవభారతాన్ని— నిర్మించుకోవడానికి కృషిచేస్తున్నాము. భారత దేశమూ, అందలి రాష్ట్రాలూ ఉమ్మడి లక్ష్యాలతోనూ ఉన్నతాదర్శాలతోనూ, భావైక్యతతోనూ ప్రేరేపితమై దేశసర్వతోముఖాభివృద్ధికి నిరంతరాయంగా కృషి చేసినప్పుడే మనం దీనిని సాధించగలుగుతాము. ఈ దశలో మనం కలహాలకు, వేర్పాటుధోరణులకూ లొంగిపోయి హింసా చర్యలకూ, అరాజకానికీ తలొగ్గితే అభివృద్ధి కుంటుపడే అవకాశం ఉంది. సామాన్య మానవుని సంక్షేమానికి తోడ్పడే కొత్త లక్ష్యాల సాధనకు కృషి చేయడానికి అంకితమై, నిర్మాణ కార్యక్రమాలను చేపట్టడానికి నేడు ప్రాధాన్యం యివ్వాలి. ఏ ప్రాంతంలోనైనా అభివృద్ధిచెందుతున్న దేశాలలోనూ,— బడుగుదేశాలలోనూ, ప్రత్యేకంగా మన రాష్ట్రంలో—యిదే నేటి కర్తవ్యం.

ఇటీవల తలెత్తిన అపోహలను మరచిపోయి, సుసంపన్నమైన, పటిష్టమైన సమైక్య ఆంధ్రప్రదేశ్ భావి పురోగమనాభిలాషతో చేయిచేయి కలిపి కలిసికట్టుగా కృషిచేయాలని స్వాతంత్ర్య దినోత్సవ 22వ వార్షికోత్సవం సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ప్రజలందరికీ నేను విజ్ఞప్తి చేస్తున్నాను. సర్వతోముఖమైన ప్రగతి సాధన మార్గంలో వెనుకబడిపోకుండా ఉండేందుకు వీలుగా సంపూర్ణ ప్రశాంత పరిస్థితులు నెలకొల్పడానికి తమ శక్తి సామర్థ్యాలు వినియోగించాలని తెలంగాణా ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నాను.

రాష్ట్ర సత్వరాభివృద్ధికి వీలుగా, యిరుప్రాంతాల ప్రజలు "యిచ్చిపుచ్చుకునే ధోరణిలో" పరస్పరం అర్థంచేసుకొని కలిసికట్టుగా మెలగడానికి వీలుగా యీ స్వాతంత్ర్య దినోత్సవ 22వ వార్షికోత్సవం ఒక నవయుగానికి నాంది పలుకుతుందనడంలో నాకెట్టి సందేహం లేదు.

మన దేశాభివృద్ధికి, ముఖ్యంగా సామాన్య మానవుని అభివృద్ధికి కొత్త అవకాశాలు, రాబోవు సంవత్సరాలలో మనకు పుష్కలంగా లభిస్తాయి. ఈ అవకాశాలను సద్వినియోగ పరచుకునే వివేకమూ, శక్తీ మనకుగలదనే సత్యాన్ని మనమందరమూ నిరూపించుకోగలుగుతామనే నేను ఆశిస్తున్నాను.

* * * * * * * *

## అరాజకానికి తల ఒగ్గితే అభివృద్ధి కుంటుపడుతుంది

* * * * * * * * *

# "వేర్పాటు ధోరణులు, దౌర్జన్యాలు అభివృద్ధికి గొడ్డలి పెట్టు"



ముఖ్యమంత్రి ఆగస్టు 15న రిపబ్లిక్ దినోత్సవః వ్యాసంలో గౌరవవందనం స్వీకరిస్తున్న దృశ్యం

ప్రజలు వేర్పాటు ధోరణుల వలలోపడి దౌర్జన్యాలకు, అరాచకాలకు దిగితే దేశం సాధించిన అభివృద్ధి తీవ్రంగా దెబ్బ తింటుందని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి హెచ్చరించారు.

రాష్ట్రంలో అనేక ప్రాంతాలలో దుర్భిక్షం ఏర్పడడంవల్లా కొన్ని ప్రాంతాలలో తుఫాను సంభవించడంవల్లా, మిగిలిన ప్రాంతంలో తెలంగాణా ఆందోళన తలెత్తడంవల్లా రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకు పెద్ద విఘాతం ఏర్పడిందని అన్నారు.

సికిందరాబాదులోని పెరేడు మైదానంలో ఆగస్టు 15 వ తేదీన చేరిన వేలాది ప్రజలను ఉద్దేశించి ముఖ్యమంత్రి ప్రసంగించారు.

పెరేడు మైదానానికి ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి వచ్చినప్పుడు ఆయనకు ప్రభుత్వ ప్రధానకార్యదర్శి శ్రీ ఎం. టి రాజు స్వాగతం చెప్పారు.

కవాతు ప్రదర్శనను హుందాగా, చక్కగా జరిపినందుకు సైన్యాన్నీ, ఇతర సర్వీసులను ముఖ్యమంత్రి అభినందిస్తూ, వారు ప్రదర్శించిన క్రమశిక్షణ యువకులకు ఆదర్శప్రాయం కావాలని కోరారు. రాష్ట్రంలో శాంతి భద్రతలను కాపాడిన పోలీసులను, పరిపాలనా వ్యవస్థను, ఇతర శాఖలను ఆయన అభినందిస్తూ తుఫానుకు గురైన వారికి వారు సహాయం అందజేసినందుకు కృతజ్ఞతల్ని తెలియజేశారు.

అంతకుముందు శ్రీ బ్రహ్మానందరెడ్డి కవాతు దళాన్ని పరిశీలించి వందనం స్వీకరించారు. కవాతు దళానికి కల్నల్ వి. ఎం. గుప్త నాయకత్వం వహించారు.

సర్వశ్రీ బి. రామచంద్రా రెడ్డి, డి. ఎస్. పి; వై. అప్పలరాజు, ఇన్‌స్పెక్టర్; కె. హనుమంతరావు, ఎస్. ఐ; మహమ్మద్ ఇబ్రహీంగోరి ఎస్. ఐ; గార్లకు రాష్ట్రపతి పోలీసు పతకాలను ముఖ్యమంత్రి అందజేశారు.

సైన్యంలో గాయపడిన వారికై ఇంపీరియల్ టుబాకో సంస్థ యిచ్చిన మూడు "జై జవాన్" దుకాణాలకు కూడా ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

❁

## ఎన్నికలు, గృహవసతి విషయాలు సాధారణ పరిపాలనశాఖకు మార్పు

ప్రస్తుతం హోంశాఖ నిర్వహిస్తున్న "ఎన్నికలు" "గృహ వసతి" విషయాలను వెంటనే సాధారణ పరిపాలన శాఖకు బదిలీ చేయాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆదేశించింది. ప్రభుత్వ అదనపు ప్రధాన కార్యదర్శి శ్రీ ఎన్. ఎ. ఖాదరీ ఐ.ఎ.ఎస్. ఈ విషయాలపై అధ్వర్యం వహిస్తారు.

హోంశాఖలో డిప్యూటీ కార్యదర్శి (గృహ వసతి) నియామకాన్ని నిలిపి వుంచాలని, సాధారణ పరిపాలన శాఖలోని రద్దు చేయబడిన సంయుక్త కార్యదర్శి తాత్కాలిక పదవిని వెంటనే పునరుద్ధరించాలనీ ప్రభుత్వం ఆదేశించింది.

ఈ పరిస్థితి దృష్ట్యా దిగువ తెల్పిన నియామకాలు, బదిలీలు చేయటం జరిగింది.

హోంశాఖ డిప్యూటీ సెక్రెటరీ (గృహ వసతి) శ్రీ ఎన్. ఎ. అబ్బాసీ తిరిగి ప్రమోట్ చేయబడి, సాధారణ పరిపాలనశాఖ సంయుక్త కార్యదర్శిగా నియమించబడినారు.

ఒక అసిస్టెంటు సెక్రటరీ (గృహ వసతి) రెండు అసిస్టెంట్ సెక్రటరీ (ఎన్నికలు) పదవులను, ఆ పదవులలో పని చేస్తున్న వ్యక్తులతోసహా సాధారణ పరిపాలన శాఖకు బదిలీ చేశారు.

సాధారణ పరిపాలన శాఖనుండి హోంశాఖకు బదిలీచేయబడిన సెక్షన్ ఆఫీసర్లు, అసిస్టెంట్లు, ఎల్. డి. గుమస్తాలు, టైపిస్టులు, అటెండర్లు, బంట్రోతులు, యితరులను ఆ పదవులతో సహా తిరిగి సాధారణ పరిపాలన శాఖకు బదిలీచేశారు.

## అదనపు ప్రధాన కార్యదర్శి విధులు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాధారణ పరిపాలన శాఖలో కొత్తగా కల్పించిన ప్రభుత్వ అదనపు ప్రధాన కార్యదర్శి ఉద్యోగ విధులను ప్రభుత్వం నిర్ణయించింది. తెలంగాణా రక్షణలను అమలు పరచడం, తెలంగాణా ప్రాంతీయ సంఘం చేసిన తీర్మానాలను, సిఫారసులను శీఘ్రంగా అమలు పరిచేటట్లు చూడడం, వాటివిషయంలో తగు చర్యలను తీసుకోవడం, రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ చట్టం కారణంగా తలెత్తిన సర్వీసుల ఏకీకరణం, తత్తర విషయాలను చూడడం-యివి కూడా యీ ఉద్యోగ విధులలో చేరి వుంటాయి.

తెలంగాణా ప్రజల ప్రయోజనార్థం కల్పించిన ఏ ప్రత్యేక కేటాయింపు విషయంలోనైనా అమలుపరచబడే అన్ని పనులూ ప్రభుత్వ అదనపు ప్రధానకార్యదర్శి ఉద్యోగవిధుల క్రిందకేవస్తాయి.

సాధారణ పరిపాలన శాఖ ఉప కార్యదర్శి (సర్వీసులు) నిర్వహించే సర్వీసులకు సంబంధించిన అన్ని కేసులూ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి పంపించేటప్పుడు ప్రభుత్వ అదనపు ప్రధాన కార్యదర్శి ద్వారా వెళ్లవలసివుంటుందని కూడా ప్రభుత్వం ఆదేశించింది.

## తుఫాను బాధితులకు సహాయం: ఆదాయపు పన్ను మినహాయింపు

కోస్తా జిల్లాలలో ఇటీవల సంభవించిన తుపాను, వరదల వల్ల నష్టపోయిన వారికి సహాయం అందజేసే నిమిత్తం ఈ మధ్య అనేక సంస్థలు ముందుకువస్తున్నాయి. ఈ సందర్భంగా, తుఫాను బాధితుల సహాయార్థం అందజేయబడే విరాళాలపైన ఆదాయపు పన్ను మినహాయింపును అనుమతించి ఆ మేరకు ఉత్తర్వులు చేయ గోరుతూ రాష్ట్ర ప్రభుత్వానికి విన్నవించుకొనబడింది.

ఈ విషయంలో ఆదాయపు పన్నుశాఖ కమీషనరును సంప్రదించడం జరిగింది. దాతలు ఆదాయపుపన్ను మినహాయింపు కొరకు, 1961వ సం॥పు ఆదాయపున్ను చట్టం 88/80 జి సెక్షను క్రింద, తమ సంస్థ కేంద్ర కార్యాలయంవున్న రాష్ట్రంలోని ఆదాయపు పన్ను శాఖ కమీషనరుకు నేరుగా దరఖాస్తులు దాఖలుచేయవచ్చునని ఆయన సూచించారు.

## ఆర్జిత శలవుకు బదులుగా డబ్బు పొందడానికి ప్రభుత్వోద్యోగులకు సౌకర్యం

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వోద్యోగులకు, తాము ఆర్జించినశలవు (ఎరన్డ్‌లీవ్) లో ఎక్కువలోఎక్కువ ముప్పయి రోజులకాలానికి శలవుకు బదులుగా డబ్బుపొందడానికి అర్హతవుంటుంది అయితే కనీసం ముప్పై రోజులపాటు శలవుమీద వెళ్ళే పక్షంలోనే ఉద్యోగులకు ఈ సౌకర్యం లభిస్తుంది ఈ సంక్షేమ చర్యను అమలులోనికి తెస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది. ఉద్యోగి తాను డబ్బు పొందదలచిన శలవు రోజులకు లెక్కకట్టిన పైకాన్ని, ఆ ఉద్యోగి, శలవు మీద వెళ్లడానికిముందు అతనికి ప్రయాణఖర్చులు మొదలైన వాటికి ఉపయోగపడడానికి వీలుగా చెల్లిస్తారు.

## కొత్త తాలూకా

గజపతి నగరం తాలూకా పేరుతో కొత్తతాలూకా ఒకటి 1969 అక్టోబరు 2 నుంచి అమలులోకి రానున్నది. ఈ కొత్త తాలూకాలో విశాఖపట్నం, శ్రీ కాకుళం జిల్లాలకు చెందిన విజయనగరం, సాలూరు, బొబ్బిలి తాలూకాలనుంచి విడదీసిన 180 గ్రామాలు వుంటాయి.

## రిట్రెంచ్ చేసిన ఇంజనీర్లకు తిరిగి ఉద్యోగాలు

గత ఏడాది ఏప్రిల్ నెలకుముందు రిట్రెంచ్‌చేసిన అసిస్టెంట్ ఇంజనీర్లు, జూనియర్ ఇంజనీర్లు, సూపర్ వైజర్లు అందరినీ త్వరలోనే తిరిగి ఉద్యోగంలోకి తీసుకోవడం జరుగుతుందని ఉప ముఖ్యమంత్రి శ్రీ జె.వి. నరసింగరావు 1969 ఆగస్టు 16వ తేదీన శాసనమండలిలో తెలియజేశారు. ఒక కోటి రూపాయల ఖర్చుతో కొత్తగా చేపట్టనున్న డిపార్టుమెంటల్ పనులలో వీరిని చేర్చుకోవడమవుతుంది.

# "ప్రత్యేక తెలంగాణా": పరిష్కారమార్గం కాదు

జె. వి. నరసింగరావు

పంధొమ్మిదివందల యాభైయారు నవంబరు మొదటి తేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ జరిగినప్పటినుంచీ తెలంగాణా, రాయలసీమ, శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలవంటి వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికై పటిష్ఠమైన చర్యలు తీసుకోవడమే రాష్ట్ర ప్రభుత్వం విధానంగా వుంటున్నది. చారిత్రికకారణాలవల్ల రాష్ట్రం వివిధ అభివృద్ధి దశలలోనున్న ప్రాంతాలతోనూ, వేరువేరు పరిపాలనావ్యవస్థలనుండి వచ్చిన ప్రాంతాలతోనూ కూడుకొనివుంది. వెనుకబడిన ప్రాంతాల ప్రజల భయాందోళనలను తొలగించడానికి గాను ప్రత్యేక ఆంధ్రరాష్ట్రావతరణ సమయంలో ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాలకు మధ్య శ్రీ బాగ్ ఒడంబడిక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రనిర్మాణం సందర్భంలో ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల మధ్య పెద్దమనుషుల ఒప్పందం కుదుర్చుకొనబడినాయి.

## తెలంగాణా మిగులు నిధులు

తెలంగాణా మిగులు నిధులను ఆ ప్రాంతంలో మాత్రమే వినియోగించి దానిని అభివృద్ధిపరచాలనేది పెద్దమనుషుల ఒప్పందంలో ఒకటి. ఒక ప్రణాళికకు సంబంధించిన మిగులు నిధులను దాని తరువాతి ప్రణాళికా కాలంలో ఖర్చుపెట్టే విధానాన్ని రాష్ట్రప్రభుత్వం తెలంగాణా మిగులునిధుల విషయంలో అనుసరిసున్నది. "తెలంగాణా ప్రాంతీయ సంఘం పథకాలు" అనబడే రెండవ ప్రణాళిక మిగులు నిధులకు సంబంధించిన రూ. 22 కోట్ల ఖర్చుతోకూడిన పథకాలు తెలంగాణా ప్రాంతంలో మూడవప్రణాళిక కాలంలో అమలుపరచబడినవి. ఇదేవిధంగా, మూడవ ప్రణాళికా కాలంలో తేలిన మిగులు నిధులను నాలుగవ ప్రణాళికాకాలంలో ఖర్చుపెట్టడానికి కూడా అంగీకరించబడింది. ప్రస్తుత ఆందోళన ప్రారంభంకావడానికి చాలాకాలం పూర్వమే గవర్నరు 1968 నవంబరు 23వ తేదీన శాసనసభలో ప్రసంగించిన సందర్భంలో ఈ మేరకు స్పష్టంగా ఒక ప్రకటన చేశారుకూడా. మిగులు నిధులు రూ. 30.54 కోట్లు వున్నట్లు ఆయన పేర్కొన్నారు.

రాష్ట్రప్రభుత్వ అభ్యర్థనను పురస్కరించుకొని, భారత కంట్రోలర్-ఆడిటర్ జనరల్ తెలంగాణా మిగులు నిధులను నిర్ధారించే నిమిత్తం నియమించిన శ్రీ కుమార్ లలిత్ ఆమొత్తాన్ని రూ. 34.10 కోట్లకు లెక్కతేల్చారు. తెలంగాణామిగులు నిధులను నికరంగా తేల్చడంకొరకు, ప్రధానమంత్రి అష్టసూత్ర కార్యక్రమాన్ననుసరించి భారత ప్రభుత్వం సుప్రీంకోర్టు న్యాయమూర్తి శ్రీ వశిష్ట భార్గవా అధ్యక్షతన ఒక ఉన్నతాధికార సంఘాన్ని నియమించింది. ఈ సంఘంవారు రాష్ట్రరాజధానిలో 1969 మే రెండవ వారంలో తమ చర్చలు ముగించుకున్న తరువాత ప్రాంతీయ సంఘం అధ్యక్షుడు కొత్తగా కొన్ని అంశాలను లేవనెత్తినందువల్ల తమ నివేదికను సమర్పించడానికి గడువును పొడిగించ గోరారు.

## నియామకాలలో రిజర్వేషన్లు

ఉద్యోగ నియామకాలకై అభ్యర్థుల నివాసస్థలానికి సంబంధించిన నిబంధనను పాటించాలన్నది పెద్దమనుషుల ఒప్పందంలోని మరోఅంశం. తెలంగాణా ప్రాంతంలో భర్తీచేయబడే రు. 300 లు లేక అంతకు తక్కువ మూలవేతనం కలిగిన అన్ని ఉద్యోగాలనూ, నివాసస్థలానికి సంబంధించి నిర్దిష్టపరచబడిన అర్హతలు కలిగిన అభ్యర్థులకొరకు ప్రత్యేకించాలని నిబంధీకరిస్తూ పార్లమెంటు శాసనంచేసింది. అదే 1957వ సం. పు సర్వీసుల రిక్రూట్మెంటు (నివాసస్థలానికి సంబంధించిన నిబంధన)చట్టం. ఈఏర్పాటు మొదటి అయిదు సంవత్సరాలవరకు మాత్రమే చేయబడింది. కాని తరువాత దీనిని మరో అయిదు సంవత్సరాలపాటు పొడిగించారు. పొడిగించినగడువు 1969 మార్చితో ముగియవలసి వుండెను. ముల్కీ అర్హతలేని అభ్యర్థులను తెలంగాణా వారికోసం ప్రత్యేకించిన ఉద్యోగాలలో నియమించారనీ, ఇందువల్ల ముల్కీలైన అభ్యర్థులకు ఈ ఉద్యోగాలు లభించకుండా పోయాయనే ఫిర్యాదులు రావడంచేత రాష్ట్రప్రభుత్వం అటువంటి వారినందరినీ మూడునెలల కాలంలోగా తొలగించివేయాలని 1968 జూలై నెలలోనే ఉత్తర్వులు చేసింది. వివరాలను సిద్ధంచేయవలసిందిగా కోరడంజరిగింది.

నివాసస్థలానికి సంబంధించిన నిబంధనను పొడిగించాలని రాష్ట్రప్రభుత్వం తెలంగాణా ఆందోళన ప్రారంభంకావడానికి చాలాకాలం పూర్వమే 1968 అక్టోబరులో భారత ప్రభుత్వానికి సిఫార్సు చేసింది. 1969 జనవరి 19వ తేదీన జరిగిన అఖిలపక్ష సమావేశంలో కూడా తెలంగాణాలో పనిచేస్తున్న నాన్ ముల్కీలైన

ఉద్యోగులనందరినీ విడుదలచేసి ఆంధ్రప్రాంతంలో సూపర్ న్యూమరరీ ఉద్యోగాలలో నియమించాలని నిశ్చయించారు. ఈలోగా ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో ముల్కీ నిబంధనలను సవాలు చేయడం జరిగింది. ఈ నిబంధన రాజ్యాంగ విరుద్ధమైనదని హైకోర్టు సింగిల్ బెంచి తీర్పు చెప్పగా, డివిజను బెంచి ఈ నిబంధనను సమర్థిస్తూ తెలంగాణాలో యిదివరకే నియమించబడిన నాన్ ముల్కీలైన అభ్యర్థులను అలాగేవుంచివేయాలని తీర్పుచెప్పింది.

1969 మార్చి 28వ తేదీన సుప్రీంకోర్టు, ముల్కీ నిబంధన చెల్లనేరదని తీర్పుయిచ్చింది. ఈ తీర్పువల్ల కొత్తపరిస్థితి ఉత్పన్నమైంది. ఇందుకు రాష్ట్రప్రభుత్వాన్ని నిందించి ప్రయోజనం లేదు. సుప్రీంకోర్టు తీర్పు వచ్చిన వెంటనే రాష్ట్రప్రభుత్వం ఈ విషయంలో రాజ్యాంగబద్ధమైన రక్షణలు కల్పించవలసిందిగా భారత ప్రభుత్వాన్ని అభ్యర్థించింది. తెలంగాణా ప్రాంతంలో ఉద్యోగ నియామకాల విషయంలో రాజ్యాంగ బద్ధమైన రక్షణలు కల్పించడానికి సంబంధించిన అంశాన్ని పరిశీలించే నిమిత్తం 1969 ఏప్రియల్‌లో శ్రీ వాంఛూ అధ్యక్షతన న్యాయశాస్త్రవేత్తల సంఘం నియమించబడింది. ఈ సంఘం తన నివేదిక సమర్పించింది.

తెలంగాణా ప్రాంతంలో నాన్‌గెజిటెడ్ ఉద్యోగాల సంఖ్య సుమారు 1,07,000 వుండగా, గత పన్నెండు సంవత్సరాలలో నియమించబడిన నాన్‌ముల్కీలైన అభ్యర్థుల సంఖ్య దాదాపు 4,538 మాత్రం వుంది. వీరిలో సుమారు 1,600 మంది ఉపాధ్యాయులు, 1800 మంది నర్సులు, సహాయకనర్సులు, మంత్రసానులు 400 మంది స్టెనోగ్రాఫర్లు, మిగిలినవారు యితర రకాలకు చెందిన ఉద్యోగస్థులు. యిదికూడా జరిగివుండవలసింది కాకపోయినప్పటికీ ఇందుకు ప్రభుతానికి దురుద్దేశాన్ని అపాదించరాదు. తెలంగాణాలో శిక్షణపొందిన అభ్యర్థుల కొరత వుండడంవల్ల యిది జరిగింది. ఉపాధ్యాయులను ప్రభుత్వం కాక జిల్లా పరిషత్తులు నియమించాయి.

## తెలంగాణావారికి యితోధిక ఉద్యోగాలు

రాష్ట్రప్రభుత్వం తెలంగాణాప్రాంతంలో కొత్తగా 2,005 ఉద్యోగాలు కల్పించడానికి సత్వరచర్యలు తీసుకున్నది. ఈ ఉద్యోగాలు పబ్లిక్‌సర్వీసు కమీషన్ పరిధినుండి మినహాయించబడినాయి. తెలంగాణా అభ్యర్థులకు అదనపు ఉద్యోగావకాశాలు కల్పించడానికి జిల్లా స్థాయిలో యంత్రాంగాన్ని ప్రభుత్వం ఏర్పాటు చేసింది. అంతేగాక 1969 ఏప్రిల్ 1వ తేదీనాటికి తెలంగాణాలో 1,283 ఉద్యోగఖాళీలు ఉన్నాయి. ఇంతవరకు 2,136 ఉద్యోగాలను భర్తీ చేశారు. మిగతావాటిని కూడ త్వరలోనే భర్తీచేస్తారు.

## పారిశ్రామిక అభివృద్ధి

ఉద్యోగావకాశాలకు సంబంధించినంతవరకు ఏ దేశంలోనైనా ప్రభుత్వరంగంలో ఉద్యోగాలు లభించేశాతం చాలా తక్కువగా ఉంటుందనే విషయాన్ని గుర్తించాలి. పారిశ్రామికీకరణ విస్తృతంగా జరిగినప్పుడే ఉద్యోగ అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. 1956-68 సంవత్సరాలలో పారిశ్రామిక పెట్టుబడి ఎక్కువగా హైదరాబాదులోను, తెలంగాణా ప్రాంతంలోను పెట్టడం జరిగింది. కేంద్రం పెట్టుబడి తెలంగాణాలో రూ. 77.5 కోట్లు ఉండగా ఆంధ్రప్రాంతలో రూ. 18.5 కోట్లు వినియోగించబడింది. ప్రైవేటురంగం పెట్టుబడిని కూడ లెక్కలోకి తీసుకున్నప్పుడు తెలంగాణాలో రూ.150 కోట్లు ఉంటుంది. తద్వారా 30,000 మందికి ఉపాధిసౌకర్యం కల్పించబడింది. దీని వల్ల మూడు, నాలుగు పంచవర్ష ప్రణాళికల కాలంలో ఎక్కువ శాతం పారిశ్రామిక పెట్టుబడి హైదరాబాదు పరిసరప్రాంతాలలో వినియోగించబడినదని స్పష్టమవుతుంది.

## ఆర్థికరంగానికి దెబ్బ

గతకొలది నెలలలో తెలంగాణా ప్రాంతంలో ఆందోళన ఫలితంగా ప్రశాంతంగా బ్రతికే ప్రజలకు యిబ్బందులు కలిగి ప్రభుత్వ, ప్రైవేటు ఆస్తులకు అపారంగా నష్టం వాటిల్లడంతోపాటు ఆర్థికరంగం ఎక్కువగా కుంటుబడింది. హైదరాబాదు, పరిసర ప్రాంతాలలో రూ. 50 కోట్ల పెట్టుబడి వినియోగించి పరిశ్రమలు నెలకొల్పాలని ఉద్దేశించిన రాష్ట్రేతర పెట్టుబడిదారులు యిప్పుడు వెనుకంజవేస్తున్నారు. తెలంగాణాలో మున్ముందువచ్చే పెట్టుబడి, తద్వారా యితోధికంగా లభించే ఉద్యోగావకాశాలు యీ అల్లర్ల కారణంగా సన్నగిల్లినాయి. ఈ అలజడుల ఫలితంగా నగరాన్ని దర్శించే యాత్రికుల సంఖ్య బాగా తగ్గి, తద్వారా నగర ఆర్థిక వ్యవస్థ తీవ్రంగా దెబ్బతిన్నది. హోటల్ పరిశ్రమ, రవాణా దుకాణాలు, వ్యాపారం, బాగాదెబ్బతిన్నవి. ఆందోళన ఫలితంగా తెలంగాణాకు రూ. 50 కోట్లకు పైగా నష్టం వాటిల్లిందని చెప్పబడుతున్నది ఈ విషయంలో నికరమైన అంచనాలు యివ్వడం సాధ్యపడదు.

## ఆస్తినష్టం

పన్నులు చెల్లించేవారికి ఎంతనష్టం కలిగిందీ దిగువ తెలిపిన ఆస్తుల నష్టం లెక్కలద్వారా స్పష్టంగా తెలుస్తుంది. జూలై ఆఖరునాటికి 55 బస్సులను తగుల బెట్టారు. తత్ఫలితంగా, రు. 24 నుండి 25 లక్షల నష్టం కలిగింది. 130 బస్సులను ధ్వంసం చేసిన కారణంగా రు. 1.75 లక్షలు నష్టం వాటిల్లింది. రాష్ట్ర రోడ్డు రవాణా కార్పొరేషన్‌కు దాదాపు రు. 3 కోట్ల ఆదాయం తగ్గిపోయింది. హింసాచర్యలవల్ల 40 మంది సిబ్బంది సభ్యులు గాయపడ్డారు. కొంతకాలంపాటు కొత్తగూడెం థర్మలు యూనిట్లు మూసివేయ బడిన కారణంగానూ, ఆస్తులను ధ్వంసంచేసిన కారణంగానూ రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డుకు రు. 9 లక్షలకు పైగా నష్టం కలిగింది. హైదరాబాదు నగరంలో మూడు సంచారక టాంకు యూనిట్లు, ఒక అంబులెన్సు అగ్ని మాపకదళానికిచెందిన ఒకనీటి టాంకు ధ్వంసంచేయబడినాయి. ముగురు డ్రైవర్లు, ఒక అగ్ని మాపక దళ సభ్యుడు తీవ్రంగా గాయపడినారు. ఆదాయం తగ్గుదల

తోపాటు (యింకా అంచనా వేయలేదు) ఆస్తుల ధ్వంసం కారణంగా రైల్వేలకు రు 2 లక్షల నష్టం వాటిల్లింది. 6 రైలు బోగీలను, ఒక యింజన్ను దగ్ధంచేశారు. ఫిష్‌ప్లేట్లు, పట్టాలతొలగింపునకు సంబంధించిన 9 కేసులు, రైలుమార్గంపై అడ్డంకులు పెట్టడానికి సంబంధించిన 11 కేసులు నమోదు అయినాయి. 6 రైలు బ్రిడ్జీల పైన రైల్వేసిబ్బందిపైన దాడి జరిగింది. స్లీపర్లు దగ్ధంచేయడానికి సంబంధించిన 16 కేసులు, రైలు స్టేషనులపై రాళ్లు విసరడానికి సంబంధించి 12 కేసులు ఉన్నాయి. 20 సందర్భాలలో రైల్వే సిగ్నల్ పరికరాలు, కేబినులపై దాడిచేశారు. రైళ్లపై రాళ్లు విసిరారు. 50 సార్లు రైళ్లను ఆపుచేశారు. ఫోసుపైపులను తొలగించడానికి సంబంధించి 8 కేసులున్నాయి. టెలిగ్రాఫ్, పోస్టాఫీసులపై దాడి చేసినట్లు 88 కేసులున్నాయి విద్యుచ్ఛక్తి స్తంభాలను తొలగించారు. 92 ప్రైవేటు కార్లు, 48 హోటళ్లు, సినిమా హాళ్లపై దాడి జరిగింది. పూరిగుడిసెలు తగులబెట్టిన 43 కేసులు, వార్తాపత్రికలు, తగులబెట్టిన రెండు కేసులు ఉన్నాయి. ఇతరవ్యక్తులపై దాడిచేసిన 49 కేసులు నమోదు అయినాయి. 7 ద్రాక్షతోటలు ధ్వంసంచేయబడినాయి దుకాణాలు, గృహాలను దోపిడీచేసిన 55 కేసులు ఉన్నాయి. ఒక బ్యాంకుతోపాటు 3 పొగాకు బ్యారెనులు ఒక కోళ్ల పెంపకం క్షేత్రం, 4 పెట్రోలు బంకులపై దాడిజరిగింది. ప్రభుత్వ వాహనాలను తగులబెట్టిన 25 కేసులున్నాయి. పోలీసులపై రాళ్లు రువ్విన కేసులు 96 నమోదు అయినాయి. 65 పాఠశాలలు, 68 ప్రభుత్వ కార్యాలయాలపై దాడి చేశారు. పాలు సరఫరాచేసే వాహనాలను కూడ విడిచి పెట్టలేదు.

## కోల్పోయిన అవకాశాలు

తెలంగాణా ప్రాంతంలో పాఠశాలలు కళాశాలలు పని చేయడంలేదు. దీనివల్ల జాతికి తీవ్రంగా నష్టం వాటిల్లడమేగాక వ్యక్తిగతంగా విద్యార్థులకు తల్లి తండ్రులకు కూడ నష్టం కలుగుతున్నది. ఈ కాలమంతా ఉపాధ్యాయులకు, జీతాలు చెల్లించవలసిరావడంతో పన్నులు చెల్లించేవారిపై భారం పెరుగుతున్నది. విద్యార్థులకు ఒక విద్యా సంవత్సరం నష్టమైంది. ఆవిధంగా ఉద్యోగావకాశాలు కోల్పోయారు. వారు తమ స్వయంకృతంతో తెలంగాణా అభివృద్ధి గమనాన్ని ఒక సంవత్సరం వెనుక్కు నెట్టినారు. తల్లిదండ్రులు తమ పిల్లలకు పోషణభారంవహించడమేగాక ఫలితం లేకుండానే ఫీజులు చెల్లించాల్సివచ్చింది. తద్వారా ఆర్థికభారం మరింత పెరిగింది. దీనివల్ల విద్యార్థులు, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, ప్రజల ధైర్యస్థైర్యాలు సడలిపోయే ప్రమాదం కలిగింది.

గత కొద్ది మాసాలలో తెలంగాణా ఆందోళనకారణంగా సంభవించిన తీవ్రమైన నష్టాలను సింహావలోకనం చేసినప్పుడు సరియైన మార్గాన్ని అనుసరించలేదని మన అంతరాత్మకు అవగతమవుతుంది.

రాష్ట్ర పారిశ్రామిక విస్తరణకూ, ప్రగతి పథానికీ వేర్పాటు ధోరణి ఎంతో నష్టాన్ని కలుగజేసింది. సత్వర పారిశ్రామికీకరణ రాష్ట్ర ఆర్థిక వనరులనుసమీకరించడమే దీనికి పరిష్కారమార్గంకాని ఆత్మహత్యా సదృశ్యమైన వేర్పాటు కాదు తెలంగాణా ప్రాంతం అభివృద్ధిని తీవ్రతరంచేయడం, రాష్ట్రమంతటా ఆర్థిక ప్రగతిని శీఘ్రతరంచేసే లక్ష్యాలను సాధించడమనేవి ప్రశాంత పరిస్థితి నెలకొనడంమీదా, ప్రజల సహాయ సహకారాలు అందడంమీదా పరస్పర సదవగాహనలమీద ఆధారపడి ఉన్నాయి.

## తెలంగాణా మంత్రుల సమావేశం

తెలంగాణా ప్రాంతానికి సంబంధించిన సమస్యలను గురించి ప్రభుత్వం తీసుకోవలసిన చర్యల విషయమై చర్చించేందుకు జూలై 31 వ తేదీన ఉప ముఖ్యమంత్రి శ్రీ జె. వి. నరసింగరావు అధ్యక్షతన రాష్ట్ర మంత్రి మండలిలోని తెలంగాణా మంత్రులు హైదరాబాదులో సమావేశమయ్యారు.

రాష్ట్రాల పునరవ్యవస్థీకరణ చట్టంక్రింద గెజెటెడ్ ఆఫీసర్ల విషయాలను పరిశీలించేందుకు ఏర్పాటు చేయబడిన కేంద్ర సలహా సంఘం, యింతవరకు పరిష్కరింప బడకుండావున్న కేసుల పరిష్కారాన్ని త్వరితం చేసేందుకై యిక్కడ వరుసగా సమావేశమయ్యేట్లు కేంద్ర హోం మంత్రిత్వశాఖను కోరాలని తీర్మానించడం జరిగింది.

తెలంగాణా మిగులు నిధులకు సంబంధించిన భారవనివేదికను త్వరితగతిని అమలు పరచాలనికూడా ఈ సమావేశంలో తీర్మానించారు. తెలంగాణాలో వివిధ పథకాలకుగాను కోటిరూపాయల కేటాయింపు చేసే ప్రతిపాదనను గురించికూడా యీ మంత్రులు ప్రణాళికా శాఖ కార్యదర్శితో చర్చించారు.



# 1969-70
# రాష్ట్ర బడ్జెటు

**ఆంధ్ర ప్రదేశ్ శాసన సభలో, శాసన మండలిలో 1969-70 సంవత్సరపు పూర్తి బడ్జెటును సమర్పిస్తూ 1969 ఆగస్టు 23వ తేదీన ఆర్థిక మంత్రి శ్రీ కె. విజయ భాస్కర రెడ్డి చేసిన ప్రసంగం**

"1969–70 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ పూర్తి బడ్జెటును నివేదిస్తున్నాను.

గడచిన సమావేశంలో "ఓట్ ఆన్ అకౌంటు"ను ప్రతిపాదించినప్పుడు ఆర్థికసంఘపు తీర్పు ఈబడ్జెటు సమర్పణకుముందు లభ్యం కాగలదని, ప్రణాళిక యొక్క పరిమాణాన్ని నిశ్చయించటానికి వీలవుతుందనిఅనుకున్నాం. అలాగే, ఉభయప్రాంతాలమధ్య రాబడిని, ఖర్చును కేటాయించే సూత్రాలనుకూడా ఈ లోపు రూపొందించడం జరుగుతుందని కూడా ఆశించాం. కాని దురదృష్టవశాత్తు, ఈ ఆశలు నెరవేరలేదు, కాబట్టి1968–69 తొలి లెక్కల దృష్ట్యానూ, రాబడి, ఖర్చులు యిటీవలి అంచనాల దృష్ట్యానూ బడ్జెటులో అంచనాల సవరణలతో మనం తృప్తి చెందవలసిన పరిస్థితిలో ఉన్నాం. ఓట్ ఆన్ అకౌంట్ క్రింద జరిగిన ఖర్చును గురించిన విడివిడి ప్రతిపాదనలను గౌరవసభ్యులు చర్చించటానికి ఇప్పుడు అవకాశం వచ్చింది

## ఆర్థిక ధోరణుల సమీక్ష

1968–69లో వ్యవసాయరంగం అనేక విధాల దెబ్బతిన్నది. ఆ వ్యవసాయ సంవత్సరపు మొదటి మూడు నెలల్లో వర్షాలు పడకపోవటం వలన రాష్ట్రంలోని విస్తార ప్రాంతాల్లో ఖరీఫ్ విత్తనాలువేయటం, నాట్లు వేయటం దెబ్బతిన్నాయి. ఇక చిన్న రకం, మధ్యరకం నీటి సాగు వసతులు 1968 ఆగస్టు మాసాంతం వరకూ ఇంచుమించు ఎండిపోయి వున్నాయి. మరి 1968 అక్టోబరు, నవంబరు నెలల్లో తీవ్రమైన తుఫానులకు రాష్ట్రం గురైంది. ఇందుమూలంగా రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాల్లో, ముఖ్యంగా శ్రీకాకుళం, కృష్ణాజిల్లాల్లో నాట్లు దెబ్బతిన్నాయి. పొలాల్లో పైర్లూ నష్టపడినై. 1969 మే నెలలో,కనీవినీ ఎరుగని తుఫాను దాపరించింది. దీనిమూలంగా విస్తారంగా ప్రాణ నష్టం ఆస్తి నష్టం జరిగినై. 5 లక్షల ఎకరాలకు పైగా పైరు నాశనమయినై, పూర్తిగా దెబ్బతిన్నయ్. 1968–69 లోని ప్రతికూల వాతావరణ,

పరిస్థితుల మూలంగా, ఆహార ధాన్యాల ఉత్పత్తి 1967_68 తో, పోలిస్తే 15.04 లక్షల టన్నులు తగ్గింది. తుది అంచనాల ప్రకారం బియ్యపు ఉత్పత్తి, 1967_68తో పోలిస్తే, 27.3 శాతం తగ్గింది

వివిధ శాఖల కార్యక్రమాలను గురించి ఇప్పుడు క్లుప్తంగ సమీక్షిస్తాను.

## వ్యవసాయం

అధిక దిగుబడి రకాల కార్యక్రమాల వేగం హెచ్చింది. ఈ కార్యక్రమాన్ని ఏటా అదనంగా 10 లక్షల ఎకరాలకు వ్యాప్తి చేయాలని అనుకుంటున్నాం. రాబీ తరుణంలో, తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంతంలో, పి. 216 యఫ్. పత్తిని, లంకపత్తిని ప్రవేశ పెట్టటానికి నీటిసాగువున్న పత్తి ప్రాంతాల్లో ఒక పైలట్ ప్రాజెక్టును ప్రారంభించాలని అనుకుంటున్నాం. చీడలు, తెగుళ్లను అదుపులో పెట్టే చర్యలను తీవ్రతరం చేయటానికిగాను పతి జిల్లాకు మరొక సంచార రక్షణ దళాన్ని ఏర్పాటుచేయాలని కూడా ఉద్దేశిస్తున్నాం.

## సహకారం

1968లో ఏప్రిల్_నవంబరు నెలలమధ్య సహకార కేంద్ర బ్యాంకులు రూ. 25. 18 కోట్లను మంజూరుచేసినై. మరి పూర్వపు సంవత్సరకాలంలో ఇచ్చినమొత్తం అడ్వాన్సులన్నీ కలిపి రూ 19.47 కోట్లు మాత్రమే. సహకారభూమి తనఖా బ్యాంకులు అప్పులిచ్చే కార్యక్రమం మొత్తంమీద 1967_68 లో రూ 11.44 కోట్ల నుంచి 1968_69లో రూ. 17.31 కోట్లకు పెరిగింది.

భూమి అభివృద్ధికిగాను, ఇప్పటివరకు 66 ప్రాంతాభివృద్ధి పథకాలు రూపొందించబడినాయి. వీటి విషయంలో, 245 లక్షల ఎకరాల అభివృద్ధికిగాను భూమి తనఖా బ్యాంకులు రూ 33.93కోట్ల మేరకు సహాయము చేయగలవు. ఇందులో 90శాతాన్ని సమకూర్చ గల అగ్రికల్చరల్ రీఫైనాన్స్ కార్పొరేషన్ ఇప్పటికి 38 పథకాలను మంజూరు చేసింది. రూ. 14.41 కోట్ల వినియోగం ఉంటుంది. 1969_70 సంవత్సరంలో భూమి తనఖా బ్యాంకులు 2.20 లక్షల ఎకరాల అభివృద్ధికిగాను రూ. 25 కోట్లను అప్పులక్రింద ఇస్తాయి. ఇందులో రూ.15 కోట్లు మామూలు అభివృద్ధి పథకాలపై ఖర్చు అవుతుంది. ప్రాంతాభివృద్ధి పథకాలపై రూ. 7.50 కోట్లు, ఆయ కట్టు అభివృద్ధి పథకాలపై రూ 2.50 కోట్లు ఖర్చు అవుతాయి.

ధరలను అదుపులో పెట్టేందుకై, రాష్ట్రప్రభుత్వం కేంద్ర ప్రభుత్వఆర్థిక సహాయంతో ఎన్నో కార్యక్రమాలను ప్రారంభించింది నగరాల్లో, బస్తీల్లో, బస్తీ ప్రాంతాల్లో వినియోగదార్ల సహకార సంఘాలు ఏర్పాటు చేయబడినై. హైదరాబాద్ సికింద్రాబాద్ జంటనగరాల్లోనూ, విశాఖ పట్నం, కర్నూలులోనూ సూపర్ బజార్లు ఏర్పాటుచేయబడినాయి. ఇంకా గుంటూరు, రాజమండ్రి, వరంగల్, కాకినాడ నగరాల్లో కూడా వీటిని ఏర్పాటు చేయాలని భావిస్తున్నాం. రాష్ట్రంలో 27 సహకార కేంద్ర స్టోర్సు పనిచేస్తున్నాయి. ఇవీ, సూపర్ బజార్లు కలసి సాలుకు మొత్తం సుమారు రూ. 460 లక్షల వ్యాపారాన్ని నిర్వహిస్తున్నాయి.

1964 ఆంధ్రప్రదేశ్ సహకార సంఘాల చట్టం 1_8_1964న అమలులోకి వచ్చింది. మిగతా అంశాలతోపాటు దిగువ పేర్కొన్న అంశాలను పొందుపరచేందుకుగాను పై చట్టాన్ని సవరించాలని ప్రభుత్వం భావిస్తోంది:

1) ఎవరు కూడా సహకార సంఘాల రెండు నిర్వాహక సంఘాలలోకన్న ఎక్కువ సంఘాలలో సభ్యుడుగా ఉండకూడదు. వీటిలో ఒకటి మాత్రం ఓపెన్ స్లాటీగా వుండాలి.

2) ఎవరు కూడా ఏ సహకార సంఘ నిర్వాహక సంఘంలో వరుసగా రెండు దఫాలకన్న ఎక్కువగా సభ్యుడుగా ఉండకూడదు.

3) ప్రతి ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘం అప్పగా పొందే మొత్తంలో 90 శాతం చిన్న రైతాంగానికి తక్కువగడువు అప్పు కింద పంపిణీ చేయాలి. పైరు తరుణంలో, ఏ సభ్యునికిచ్చే తక్కువ గడువు అప్పు అయినా రూ. 1500 కు మించకూడదు.

ఈ సవరణ బిల్లులోనే సహకార బాకీలను వసూలు చేసే పద్ధతి సులభం చేయాలని 1961 డిపాజిటు ఇన్సూరెన్సు కార్పొరేషన్ చట్టపు నిబంధనలను సహకార సంఘాలకు వర్తింపచేయాలని ప్రతిపాదించబడింది.

## పశుగణ పోషణ

రాష్ట్రంలో సంకరజాతి అభివృద్ధి కార్యక్రమాన్ని బలపర చేందు కెలింకన్ షైర్ రైతులు రూ6 లక్షలు ఖరీదుచేసే 10మేలు జాతి రకం జెర్సీ ఆబోతులను ఉచితంగా యిచ్చారు. గన్నవరంవద్ద బేకన్ ఫ్యాక్టరీ పూర్తి అయింది. ఇప్పుడు ప్రయోగాత్మక కార్య క్రమాలు అమలు జరుగు తున్నాయి.

## విద్య

### 1969-70 సంవత్సరం నుంచి అమలులోకి వచ్చే రెండు సంవత్సరాల ఇంటర్మీడియట్ కోర్సును ప్రవేశ పెట్టటం

విద్యా (కొఠారి) సంఘం సిఫార్సు చేసిన కొత్త సెకండరీ విద్యా విధానం 1964_65 విద్యాసంవత్సరంనుంచే అమలులోకి వచ్చింది. సమీకృతమైన పాఠ్యావళిని తయారుచేసి ఆ సంవత్సరపు ఆరవ తరగతి నుంచి ప్రవేశపెట్టటం జరిగింది. కొత్త విధానం కిందకు వచ్చిన మొదటి విద్యార్థి బృందం 1968_69లో 10వ తరగతి పూర్తి చేశారు. ఈ పరీక్షలో ఉత్తీర్ణులైనవారు రెండు సంవత్సరాల ఇంటర్మీడియట్ కోర్సులో చేరుతారు. ఇప్పటి ఒక సంవత్సరపు పి. యు. సి. రెండేళ్ళ ఇంటర్మీడియట్ కోర్సులో మొదటి సంవత్సరం. 1969_70 లో సమంగా_ అనగా ఒకదానితో ఒకటి సమకాలంలో నడుస్తాయి. 1970_71 నుంచి ఒక సంవత్సరపు పి. యు. సి. ఉండదు. జూనియర్ కళాశాలలుగా మారటానికి అను మతింపబడనట్టి ఉన్నత సెకండరీ పాఠశాలలు, బహూకార్థ సాధక పాఠశాలలు అన్నీకూడా 1969_70 నుంచి హైస్కూళ్లుగా ఏర్పాటు అవుతాయి.

కొత్త విద్యావిధానపు కొన్ని అంశాలకు సంబంధించి, ఇంటర్మీడియట్ విద్యకుగాను ప్రత్యేకంగా ఒక సంస్థ ఏర్పాటుచేయబడింది. ఈ రెండేళ్ల కోర్సు పాఠ్యావళి అప్పుడే తయారు చేయబడింది

పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ డైరెక్టర్‌తో జరిపిన సంప్రదింపుల ఫలితంగానూ, విశ్వవిద్యాలయాల పరిశీలనసంఘాలనివేదికలను చూసిన తర్వాత, ప్రభుత్వం కొన్ని పాఠశాలలను జూనియర్ కళాశాలలుగా మార్చటానికి నిశ్చయించింది, 1969_70 నుంచి రెండేళ్ళ ఇంటర్మీడియట్ కోర్సును ప్రవేశపెట్టినందువలన, తమ ఇప్పటి కళాశాలల్లో కూడా ఒకటి, రెండు విభాగాలను ఏర్పాటుచేయవలసిందిగా విశ్వవిద్యాలయాలను కోరటమైంది.

జూనియర్ కళాశాలల్లో 1969_70 నుంచి బోధనాభాషగా తెలుగును ప్రవేశపెడుతూ ప్రభుత్వం ఉత్తరువులను జారీ చేసింది. వృత్తి కళాశాలల్లోనూ, పట్టభద్రానంతర విద్యలోనూ కొంత కాలం వరకూ ఆంగ్లభాష బోధనాభాషగా ఉంటూనే వుంటుంది. జూనియర్ కళాశాలలన్నిటిలోనూ తెలుగే బోధనా భాషగా వుంటుంది. ఇప్పటి డిగ్రీ కళాశాలల్లో, ఆంగ్లభాషతోపాటు, తెలుగు బోధనాభాషలో కనీసం ఒక విభాగమైనా వుంటుంది — క్రమంగా డిగ్రీ స్థాయిలో కూడా తెలుగు బోధనా భాషగా ప్రవేశ పెట్టబడుతుంది. కాబట్టి, ఏ కళాశాల అయినా మరే యితర బోధనాభాషను ప్రవేశపెట్టాలన్నా ముందుగా ప్రభుత్వ అనుమతి పొందాలి. కొన్ని నిర్దిష్ట సంస్థల్లో, ఇంటర్మీడియట్ స్థాయిలో ఉర్దూను బోధనా భాషగా ప్రవేశపెట్టాలనే ప్రతిపాదనకూడా ఒకటి ఉన్నది

ఉపాధ్యాయుల విషయంలో, యూనివర్సిటీ గ్రాంట్సు కమిషనూ, కేంద్ర ప్రభుత్వమూ సిఫార్సు చేసిన జీతాలను, సవరించిన జీతాల స్కేళ్ళను రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాల ఉపాధ్యాయులకు 1_4_1966 నుంచి వర్తింపజేయాలని ప్రభుత్వం ఇటీవలనే నిశ్చయించింది. పాఠశాల ఉపాధ్యాయుల విషయంలో విద్యా (కొఠారి) సంఘం చేసిన సిఫార్సులను అమలు జరిపే విషయంలో అదనంగా ఆర్థిక సహాయం అవసరం అని ప్రభుత్వం అయిదవ ఆర్థిక సంఘానికి నచ్చేటట్లుగా ప్రతిపాదించింది. రాష్ట్రపతికి నివేదింపబడిన తుది తీర్పులో, ఆర్థిక సంఘం దీనికి కానున్న ఖర్చును దృష్టిలో పెట్టుకొందని ఆశిస్తున్నాం. ఈ సంఘపు తుది తీర్పు ప్రకటింపబడిన తర్వాత, ఈ విషయంలో నిర్ణయానికి రాగలం.

## నీటి సాగు

### నాగార్జునసాగర్ ప్రాజెక్టు :

నాగార్జున సాగర్ ఆనకట్ట పని పూర్తి అవుతున్నట్లే. రాతి ఆనకట్ట నిర్మాణమూ, రోడ్డు వంతెన 26 స్పాన్సును కాంక్రీట్ చేయటం పూర్తి అయినాయి హాయిస్టు వంతెన పియర్లు కట్టేపని, గాంట్రీక్రేను ఏర్పాటు వగైరా నిర్మాణాలపని చురుగ్గా సాగుతోంది.

నాగార్జునసాగర్ కాల్వపనికూడా బాగా చురుగ్గా సాగుతోంది. 1968_69 లో ఒక లక్ష ఎకరాల నీటిసాగుకు కావలసిన ఏర్పాట్లు చేయబడినై—అంటే మొత్తం 7.5 లక్షల ఎకరాలకు అన్నమాట.

ఈ ప్రాజెక్టుకుగాను 1969 మార్చి 31వ తేదీ వరకు అయిన ఖర్చు రూ. 146.68 కోట్లు. 1969_70 లో ఖర్చుకు చేసిన కేటాయింపు రూ. 10.4 కోట్లు. ఇందులో రూ. 1 4 కోట్లు ఆనకట్టకు. కుడి కాల్వలకు రూ. 3.5 కోట్లు, ఎడమ కాల్వలకు రూ. 5.5 కోట్లు. 1969 నవంబరుకు అదనంగా 2 లక్షల ఎకరాలకు నీటి సాగు వసతులు యేర్పాటు కావచ్చు—అంటే మొత్తం 9.5 లక్షల ఎకరాల మేరకు అన్నమాట.

### పోచంపాడు ప్రాజెక్టు :

పోచంపాడు ఆనకట్ట, కాల్వపని బాగా చురుగ్గా సాగుతోంది.

పోచంపాడు ప్రాజెక్టుకయిన ఖర్చు ప్రారంభంనుంచి 1969 మార్చి 31 వ తేదీ వరకు రూ. 11 కోట్లు. 1969_70 లో ఈ ప్రాజెక్టు ఖర్చుకు కేటాయించబడిన ధనం రూ. 6 కోట్లు 1970 జూన్‌కు 40 వేల ఎకరాల మేరకు నీటి సాగు వసతిని కల్పించేందుకై తగిన పనులను పూర్తిచేయటానికిగాను, అదనంగా కేంద్ర సహాయాన్ని కోరాలనికూడా అనుకుంటున్నాం

### మిగతా పథకాలు :

పెద్దరకం, మధ్య రకం నీటిసాగు పథకాలకుగాను 1969_70 లో ప్రతిపాదించిన మొత్తం వినియోగం రూ 947 లక్షలు. తుంగభద్ర ప్రాజెక్టు ఎగువ కాలువ (రెండవదశ) విషయంలో, ఆంధ్ర ప్రాంతంలో రూ. 40 లక్షలు, తుంగభద్ర బోర్డు ప్రాంతం లోని పనుల నిమిత్తమై ఆంధ్ర వాటాకై రూ. 132 లక్షలు, మొత్తం రూ. 172 లక్షలు ఖర్చు పెట్టాలని వున్నది.

పథకాల పరిశీలనకుగాను రూ. 21.84 లక్షలు, వరద నివారణకు మురుగు పారుదల, సముద్రపు కోత నివారణకు రూ. 5 లక్షలు, ఇంజనీరింగు పరిశోధనకు రూ 5 లక్షలు బడ్జెటులో కేటాయించబడినై.

అదనంగా 61 వేల ఎకరాలకు నీటి సాగు కల్పించేందుకై చిన్న నీటి వనర్ల కార్యక్రమానికై 1969_70 లో రూ. 241 లక్షలు కేటాయించాలని ప్రతిపాదించబడింది ప్రత్యేక తెలంగాణా అభివృద్ధి పథకాల క్రింద చిన్న నీటి వనర్ల పనులకోసం అయ్యే రూ. 31 లక్షలు కూడా ఇందులో చేర్చబడినై.

ప్రస్తుత సంవత్సరంలో, వంశధారా ప్రాజెక్టు మొదటి దశ విషయమై పని ప్రారంభించాలని వుంది. చాలా కాలంగా వంశధారా ప్రాజెక్టు పరిశీలనలో వుంది. ఈ ప్రాజెక్టును రెండు దశల్లో నిర్వహించాలని అనుకుంటున్నాం. గొట్టా జలాశయం, ఎడమ వైపు కాలవ — వీటికి సంబంధించిన మొదటి దశకు చెందిన అంచనా తయారైంది. ఇక పని ప్రారంభం అవుతుంది, పరిశీలన పూర్తి అయాక, ప్రాజెక్టు రెండవ దశ విషయమై ఆలోచనలు జరుగుతాయి.

వెనుకబడిన రాయలసీమ ప్రాంతానికి ఉపయోగపడే పులివెందల పథకానికి ప్రాముఖ్యం ఇవ్వబడింది. అభివృద్ధి లేని

ముందుగా వసూలు చేసే కార్యక్రమం ప్రారంభించబడింది. 1955 ఆంధ్రప్రదేశ్ నీటిసాగు (అభివృద్ధి విరాళం, ముందుగానే అభివృద్ధి విరాళం) చట్టం ప్రకారం వసూలుకావలసిన అడ్వాన్సు అభివృద్ధి లెవీ మొదటి దఫా చెల్లింపులో అయిదింట మూడు వంతులు వసూలు కాగానే, పని మంజూరుఅవుతుంది పని ఈ సంవత్సరం ప్రారంభం అవుతుంది. గాజుల దిన్నె ప్రాజెక్టుకోసం కూడ కేటాయింపు చేయబడింది. ఇదికూడ వెనుకబడిన ప్రాంతంలోనిది. ఈ మధ్యరకం ప్రాజెక్టు పని ఈ సంవత్సరం ప్రారంభం అవుతుంది.

ప్రస్తుతపు ధవళేశ్వరం ఆనకట్ట నూరేళ్ళ క్రితం ఎప్పుడో కట్టినట్టిది. దాని స్థానే ఒక బ్యారేజిని నిర్మించవలసిన అవశ్యకత దృష్ట్యా, గోదావరి బ్యారేజ్‌కు ప్రాముఖ్యం హెచ్చింది. ఇంతకు ముందు ప్రస్తావించిన చట్టానికనుగుణంగా, ఈ పథకాన్ని గురించి కూడా ప్రకటన చేయడమైంది. అడ్వాన్సు అభివృద్ధి లెవీ మొదటి దఫాలో అయిదింట మూడు వంతులు మొత్తం వసూలు చేయబడింది పథకం మంజూరు చేయబడింది. ప్రస్తుత సంవత్సరం పని ప్రారంభం అవుతుంది.

నిజాంసాగర్ జలాశయపు ఆయకట్టులో నీటి సాగుకు తగినంతగా నీరు లభించకపోవటం వలన, చాలా ఇబ్బందిగా వుంది. ప్రస్తుత సంవత్సరంలో నిజాం సాగర్ పంట కాలవలను మరమ్మతు చేయాలనే ప్రతిపాదన వుంది. ఇందుమూలంగా ప్రస్తుతపు ఆయకట్టుకు తగిన నీరు లభించగలదు.

సోమశిల ప్రాజెక్టు విషయంలో రైతులు ఆసక్తి చూపుతున్నారు. ఇప్పటి పెన్నా డెల్టాకు మాత్రమేకాక, నెల్లూరు జిల్లాలోని కొత్త ప్రాంతాలకు కూడా ఇది ఉపయోగపడుతుంది. పథకానికి సంబంధించిన అంచనా తయారు అవుతోంది. ఇంతకు మునుపు ప్రస్తావించిన చట్టం ప్రకారం జరగవలసిన ప్రకటన, స్థానిక కార్యక్రమం ప్రస్తుత సంవత్సరం ప్రారంభించబడుతాయి. ఈ వివిధ కార్యక్రమాలు పూర్తి అవగానే, పని మంజూరు కాబడుతుంది. 1970_71 లో ప్రాజెక్టు పని ప్రారంభంకావచ్చు.

ఆంధ్రప్రదేశ్ (కృష్ణా, గోదావరి డెల్టాప్రాంతం) మురుగు సెస్సు చట్టం ప్రకారం రూ. 2 కోట్లు వసూలుకాగలవనే భావంతో, ఈ ప్రాంతాలలో మురుగు పారుదల పథకాలకని 1969_70 లో ప్రస్తుతానికి రూ.2 కోట్లు కేటాయించబడినై. కాని ఇటీవల తూఫాను మూలంగా, సెస్సు వసూలు మందగించింది. అయితే ఈ ఏడాది కొన్ని ముఖ్యమైన, అత్యవసరమైన మురుగు పారుదల పథకాలను కొన్నిటిని డెల్టా ప్రాంతంలో అమలు జరపటానికి గాను కేంద్ర ప్రభుత్వం రూ. 3 కోట్ల వరకు ఋణ సహాయం చేయటానికి అంగీకరించింది.

## విద్యుచ్ఛక్తి

రామగుండం థర్మల్ "బి" స్టేషన్, కొత్తగూడెం 3వ దశ, దిగువ సీలేరు జల విద్యుచ్ఛక్తి పథకం వీటి వినియోగం ద్వారా అధికంగా 482.5 మి. వాట్లతో స్థాపిత శక్తిని 4వ పంచవర్ష ప్రణాళిక కాలంలో పెంచాలని వుంది. 1968_69 అంనితాకి అందుబాటులో వుండే ఉత్పాదక శక్తి 580.4 మి. వాట్లు (లాభసాటి కాని థర్మల్, డీసెల్, గ్యాస్‌సెట్లు పోను, 645.5 మి. వాట్ల స్థాపిత శక్తి స్థానే).

ప్రస్తుతం 430.5 మి. వాట్ల పరిమాణంలో ఉన్న అవసరాలు 4వ ప్రణాళిక ముగింపు నాటికి 1107 మి. వాట్లకు పెరిగే అవకాశం వుంది.

గ్రామీణ విద్యుచ్ఛక్తికి ప్రభుత్వం ప్రాధాన్యం చూపుతూ వుండాలనే అనుకుంటోంది. 1969_70 లో కొత్తగా 1107 గ్రామాలకు, 40 వేల వ్యవసాయ పంపు సెట్లకు విద్యుచ్ఛక్తిని సమకూర్చాలని వుంది.

**శ్రీశైలం ప్రాజెక్టు :**

7 నుంచి 10 బ్లాకుల్లో పునాదుల తవ్వకం పని పూర్తి అయింది. నదిలోపల ఆనకట్ట పునాదులను పూడ్చేపని, రోడ్డు వంతెన నిర్మాణపు పని చురుగ్గా సాగుతున్నాయి.

ప్రారంభంనుంచి 1969 మార్చి నెలాఖరుకు ప్రాజెక్టుపైన అయిన మొత్తం ఖర్చు రూ. 22 కోట్లు. ఈ ప్రాజెక్టుకని 1969_70 లో రూ. 3.5 కోట్లు కేటాయించబడినై.

## పరిశ్రమలు

రాష్ట్ర మంతటా పారిశ్రామిక ప్రగతిని త్వరితం చేయటానికై, పరిశ్రమలను నెలకొల్పాలనుకొనే వారికి, చొరవకలవారికి వివిధ వసతులను, ప్రోత్సాహాన్ని కల్గించే సహాయాన్ని సమకూర్చాలని ప్రభుత్వం నిశ్చయించింది. ఇందుమూలంగా రాష్ట్రంలో పరిశ్రమలకు పెట్టుబడి విస్తారముగా లభించగలదని ఆశించుదాం.

రాష్ట్రంలో ముఖ్యమైన కేంద్రరంగపు ప్రాజెక్టులను ఏర్పాటు చేయటంద్వారా ప్రాంతీయ అసమానతను సరిదిద్దాలని రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి నచ్చచెప్పడానికి ప్రయత్నిస్తూనే వుంది. విశాఖపట్నంలో ఎరువుల కర్మాగారాన్ని నెలకొల్పేందుకై అమెరికాలోని ఆక్సిడెంటల్ పెట్రోలియం కంపెనీకి కేంద్ర ప్రభుత్వం "లెటర్ ఆఫ్ ఇంటెంటును" జారీ చేసింది మనకు బొగ్గు విస్తారంగావుంది. బొగ్గుఆధారంగావుండే యెరువుల కర్మాగారాన్ని ఏర్పాటు చేయవలసిందిగా కూడా కేంద్రప్రభుత్వాన్ని ఒత్తిడి చేస్తున్నాం.

విశాఖపట్నంలో జింక్ స్మెల్టర్ (పారిశుద్ధ్య) కేంద్రాన్ని నెలకొల్పాలని కేంద్ర ప్రభుత్వం 1964లో నిశ్చయించింది. అయితే పని మందకొడిగా సాగుతోంది కేంద్ర ప్రభుత్వం సూచన ప్రకారం, పోలిష్ సలహాదారులు హైదరాబాదు, విశాఖపట్నం వచ్చారు. రాష్ట్రప్రభుత్వ అధికార్లతో సంప్రదింపులు జరిపారు. ఈ ప్రాజెక్టు నాల్గవ ప్రణాళికలో చేర్చబడుతుందని, విశాఖపట్నంలో ఏర్పాటు చేయడానికి పని ప్రారంభం కాగలదని ఆశిస్తున్నాం

అయిదవ ఉక్కు కేంద్రాన్ని విశాఖపట్నంలో నెలకొల్పే విషయంలో త్వరిత నిర్ణయాన్ని తీసుకోవలసిందిగా రాష్ట్ర ప్రభు

త్వం కేంద్రప్రభుత్వాన్ని ఒత్తిడి చేస్తోంది కూడా—ఆంగ్లో—అమెరికన్ కాన్సోర్టియం సిఫార్సుల దృష్ట్యా.

రాష్ట్ర పబ్లిక్ రంగంలోని ఇండో—నిప్పన్ ప్రెసిషన్ బేరింగ్సు ప్రాజెక్టు పని స్థిరంగా సాగుతోంది. 1970 మార్చి, ఏప్రిల్ నెలలో ఉత్పత్తి ప్రారంభంకావచ్చు. రాష్ట్ర పబ్లిక్ రంగపు రిపబ్లిక్ ఫోర్జి కంపెనీ ఉత్పత్తి ఇటీవల ప్రారంభమైంది.

చిన్న పరిశ్రమల రంగంలో, జిల్లా పారిశ్రామిక గోష్ఠులను, ఉద్యమాలను ఏర్పాటు చేయటానికి ప్రయత్నాలు జరిగినై. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్ వగైరా ఆర్థిక సంస్థల సహకారంతో ఇవి జరుగుతున్నాయి. ఈ ప్రయత్నాల ఫలితంగా, ఒక్క స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, సంస్థయే 1968_69లో రూ. 12 కోట్ల మేరకు అనేక పరిశ్రమలకు వర్కింగ్ కేపిటల్‌కు గాను అడ్వాన్సులను మంజూరు చేసింది. 1967_68లో ఇచ్చిన మొత్తం. రూ. 6.67 కోట్లు మాత్రమే. ఇలాగే హైదరాబాద్ స్టేట్ బ్యాంక్ ప్రస్తుత సంవత్సరం రూ. 6.80 కోట్ల మేరకు అడ్వాన్సులను మంజూరు చేసింది_గత సంవత్సరపు మొత్తం రూ. 3.62 కోట్లు మాత్రమే

విశాఖపట్నంలోని పరిశ్రమలకు నీటి సప్లయి అధికం చేసేందుకై, ప్రభుత్వం పంపు గొట్టాలద్వారా గోదావరి నీటిని విశాఖపట్నానికి అందించే పథకపు పరిశీలనను ప్రభుత్వం మంజూరు చేసింది. అయితే దీనికి కొంతకాలం పట్టుతుంది. కాగా విశాఖపట్నంలో నీటి సప్లయి పరిస్థితిని వెంటనే అభివృద్ధి పరచవలసిన అవసరం వుంది. అందుకని మేహాద్రిగడ్డ జలాశయ పథకాన్ని ప్రభుత్వం మంజూరుచేసింది,

## వార్షిక ప్రణాళిక

మధ్యంతర బడ్జెటును నివేదించినప్పుడు, ముఖ్యమంత్రి మన నాల్గవ ప్రణాళిక స్వరూపం ఇంకా నిశ్చయించవలసివుంది అని అన్నారు. ఆ తర్వాత ముసాయిదా నాల్గవ ప్రణాళికను 1969 ఏప్రిలులో జాతీయ అభివృద్ధి మండలి వారు చర్చించారు. రాష్ట్రాల రంగానికి నిర్దేశించిన కేటాయింపు సరిపడగాలేదని, దాన్ని హెచ్చించాలని మొత్తంమీద అంగీకరించారు. ఆర్థికసంఘ నివేదిక ఆధారంగానూ, ప్రణాళికా కాలంలో అప్పుల చెల్లింపు విషయంలో రాష్ట్ర ప్రభుత్వాల బాధ్యతను తిరిగి నిర్దేశించాలి, లేదా క్రమబద్ధం చేయాలి అనే విషయాన్ని పరిశీలించటంవల్లనూ, ప్రణాళికా సమితి వసతుల గురించి తిరిగి నిర్ధారణ చేసుందని భావించబడింది. రాష్ట్ర ప్రభుత్వాలతోనూ, కేంద్ర మంత్రిత్వ శాఖలతోనూ మరికొన్ని సంప్రదింపులు జరిపిన తర్వాత, ప్రణాళికా సమితి జాతీయ అభివృద్ధి మండలికి తగు సిఫార్సులను చేస్తుందని కూడా నిశ్చయించబడింది. దీనిదృష్ట్యా, మన నాల్గవ ప్రణాళిక పరిమాణం ఇంకా నిర్ణయింపబడలేదు. అయినా ఈ లోపల, 1969_70 వార్షిక ప్రణాళిక కోసం రూ. 87.50 కోట్లను కేటాయించటమైనది — వివిధ రంగాల్లో మనకున్న తప్పనిసరి బాధ్యతలబట్టి, ఇందులో, తెలంగాణా పణాళికావ్యయం రూ. 39.14 కోట్లు. 'ఓట్ ఆన్ అక్కౌంట్'లో ప్రణాళికా వ్యయంకింద చూపించిన రూ. 84.87 కోట్లను ఇప్పటి రూ. 87.50 కోట్లకు పెంచటానికి కారణం_ప్రత్యేక తెలంగాణా అభివృద్ధి పథకాల నిధులను రూ. [illegible].45 కోట్లనుంచి రూ. 9 కోట్లకు పెంచటం.తెలంగాణా 9 జిల్లాలకు, ఒక్కొక్క జిల్లాకు కోటి రూపాయల చొప్పున రూ. 9 కోట్లు కేటాయించబడినై. ప్రాంతీయ సంఘానికి చెందినట్టి అభివృద్ధి ఉపసంఘం, ప్రణాళిక అడ్‌హాక్ సంఘం చేసిన సిఫార్సుల ప్రకారమూ, జిల్లాపరిషత్తులు చేసిన ప్రతి పాదనల ప్రకారమూ, ఈ కేటాయింపు పథకాలను నిర్ణయించటం జరిగింది. ఇది కాక పెద్దనీటిసాగు పథకాలక్రింద పోచంపాడు ప్రాజెక్టుకు రూ 6 కోట్ల మొత్తం కేటాయించబడింది. జంటనగరాలలో వసతుల అభివృద్ధికిగాను రూ. 40 లక్షలు, విశాఖపట్నంలో వసతుల అభివృద్ధికిగాను రూ. 10 లక్షలు కేటాయించబడినై.

## జీతాలు, అలవెన్సుల సవరింపు

ఏక సభ్యత్వంగల పే కమీషన్ సిఫార్సులను. పరిశీలించి, ప్రభుత్వానికి ప్రతిపాదనలను నివేదించటానికిగాను ప్రభుత్వప్రధాన కార్యదర్శి అధ్వర్యాన ఒక అధికారుల సంఘం యేర్పాటు చేయబడిన సంగతి గౌరవ సభ్యులకు తెలుసు. ప్రధానమైన ఉద్యోగ సంఘాల ప్రతినిధులతో జీతాల సవరింపు_ప్రతిపాదనల గురించి చర్చలు జరిపాక, అధికార్ల సంఘం ప్రభుత్వానికి తగిన ప్రతిపాదలను నివేదించింది. ఈ ప్రతిపాదనల దృష్ట్యా, ప్రభుత్వం ఉద్యోగుల ఇప్పటి జీతాలను సవరించినది. ఈ సవరింపు 19_3_69 అంటే ఈ తెలుగు ఉగాదినుంచి అమలులోకి వచ్చినది వీటికి చెందిన కొన్ని ముఖ్యాంశాలు :

(1) ఇప్పటి 143 జీతాల స్కేళ్ళను 26 స్కేళ్ళగా క్రమబద్ధం చేయటంజరిగింది.

(2) 20 వర్గీకరణల వరకు, సవరించిన కొత్త జీతాల స్కేళ్లలో ప్రతిదానికి సెలక్షన్ గ్రేడులను అనుమతించటం జరిగింది.

(3) సవరించిన జీతాలను పచ్చే ఉన్నతదశలో ఇప్పటి ఉద్యోగులు పొందవచ్చు_ఇందుకదనంగా, అయిదేళ్ల ఉద్యోగకాలానికి, ఇంకెక్కువకాలానికి ఒక "వైటేజ్" ఇంక్రిమెంట్ కూడా పొందవచ్చు.

ఉత్తమ సామర్థ్యం ఉన్నవారిని ఆకర్షించేందుకై జీతాలను సవరించినప్పటికీ, ఇప్పటి ఉద్యోగుల్లో ప్రతి ఒక్కరూ కూడా కొత్త జీతాల ప్రకారం, అదనపు లాభాన్ని పొందగలుగుతారు.

ఉపాధ్యాయులకు, స్థానిక సంస్థల ఉద్యోగులకు, జీతాలను సవరించే విషయంగురించి ప్రభుత్వం పరిశీలిస్తోంది. త్వరలో ఉత్తర్వులు జారీకాగలవు. రాష్ట్ర ప్రభుత్వం అయిదవ ఆర్థిక సంఘానికి ఈ అదనపు ఖర్చులు భర్తీ చేయ వలసిందని హేతుబద్ధంగా తెలియచేసింది. ఖర్చు యావత్తు ఈ సంఘపు తీర్పు ఫలితంగా భర్తీ కాగలదని ఆశిస్తున్నాం.

## 1967-68 లెక్కలు

1967_68 సంవత్సరపు రివిన్యూ వసూళ్లు, రివిన్యూ ఖర్చు వరుసగా రూ. 184.27 కోట్లు, రూ. 189.81 కోట్లు. తరుగు రూ. 5.54 కోట్లు. 1967_68 సంవత్సరపు పెట్టుబడి వ్యయం రూ. 27.33 కోట్లు. పబ్లిక్ ఋణం రూ. 40.08 కోట్లు పెరగ్గా, డిపాజిట్లు, ఋణాలు, అడ్వాన్సులు, మిగతా అప్పుపద్దులు, వీటి క్రింద ఆదాయవ్యయాలబట్టి, నికరవ్యయం రూ. 2.28 కోట్లు అని తేలింది. ఈ వ్యవహారాలన్నిటి ఫలితంగా ఆ ఏడాది 4.30 కోట్లు నిలువతో ముగిసింది_ప్రారంభంలో రూ. 63 లక్షల తరుగుకు బదులుగా.

## 1968-69 సవరించిన అంచనాలు

రివిన్యూ వసూళ్ల ఖాతాన రూ. 199 కోట్లు, మొదటి అంచనాసానే. 1968_69లో సవరించిన అంచనా రూ. 235.79 కోట్లు వున్నది, 1968_69 మొదటి అంచనాసానే, సవరించిన అంచనాలో రూ. 36.79 కోట్లు అభివృద్ధి వున్నది. ఇందులో రూ. 17.70 కోట్ల పెరుగుదలలో కేంద్ర పన్నులు, సుంకాలకింద వసూళ్లు_రూ. 5.30 కోట్లు, భూమి శిస్తుక్రింద రూ. 2.25 కోట్లు, స్టేట్ ఎక్సైజుకింద రూ. 1.43 కోట్లు; మోటారు బండ్లపై పన్ను క్రింద రూ. 2.27 కోట్లు, అమ్మకపు పన్నుకింద రూ. 5.85 కోట్లు; మిగతా వాటిక్రింద రూ. 60 లక్షలు, కేంద్ర ప్రతిపాదిత పథకాలకు సహాయం క్రింద రూ. 4.09 కోట్లు: 1966_67, 1968_69 మధ్య కాలపు మార్కెట్ ఋణాలవిషయంలో amortisation కేటాయింపు సానే ప్రత్యేక గ్రాంటుకింద రూ. 15 కోట్లు; అమాం బాపతు అభివృద్ధి ఋణాల ab initio మార్పిడిద్వారా ఈ మార్కెటు ఋణాలు చెల్లించ బడినై.

1968_69 బడ్జెటులోని రూ. 204.67 కోట్లునుంచి, రివిన్యూఖర్చు 1968_69 సవరించిన అంచనాలలోని రూ. 239.27 కోట్లకు పెరిగింది. రూ. 34.60 కోట్ల పెరుగుదల ప్రధానంగా ఈ దిగువ పద్దులకింద జరిగింది.

| | రూ. కోట్లు |
|---|---|
| వడ్డీ ... ... | 1.07 |
| జనరల్ అడ్మినిస్ట్రేషన్ ... | 1.52 |
| విద్య ... ... | 10.61 |
| వైద్యం ... ... | 1.06 |
| వ్యవసాయం ... ... | 1.04 |
| పబ్లిక్ వర్క్సు ... ... | 1.80 |
| క్షామ బాధితుల సహాయం ... | 13.30 |

మొత్తం రివిన్యూ ఖర్చు రూ 239.27 కోట్లలో రూ. 14.63 కోట్లు రాష్ట్ర ప్రణాళికకు, రూ. 5.75 కోట్లు కేంద్ర ప్రతిపాదిత పథకాలకు వర్తిస్తాయి. మిగతా రూ. 218.89 కోట్ల మొత్తం ప్రణాళికేతర ఖర్చుకు సంబంధించినట్టిది.

### పెట్టుబడి వినియోగం :

1968_69 బడ్జెటులో పెట్టుబడి వినియోగం క్రింద రూ. 33.68 కోట్లు కేటాయించబడినై. ఇప్పటి సవరించిన అంచనా ప్రకారం రూ. 38.87 కోట్లు. ఆ విధంగా రూ. 5.19 కోట్ల పెరుగుదల ఏర్పడింది.

### పబ్లిక్ ఋణం :

పబ్లిక్ ఋణంకింద వసూళ్ళు, పంపకాల ఫలితంగా నికరం పెరుగుదల రూ. 24.66 కోట్లు.

ఈ పై వ్యవహారాల దృష్ట్యా, ఋణాలు, అడ్వాన్సులు, డిపాజిట్లు వగైరా వ్యవహారాల దృష్ట్యా ఆ సంవత్సరం రూ. 97 లక్షల తరుగు రొక్కపునిల్వతో ముగియవచ్చు.

## 1969-70 బడ్జెటు అంచనాలు

### రివిన్యూ వసూళ్ళు :

1969_70 బడ్జెటు అంచనాల ప్రకారం, మొత్తం రివిన్యూ రూ. 254.79 కోట్లు వుంటుంది. 1968_69 సవరించిన అంచనాల ప్రకారం మొత్తం రివిన్యూ రూ. 235.79 కోట్లు. ఆ విధంగా పెరుగుదల రూ. 19.00 కోట్లు (ఆర్థిక సంఘపు మధ్యంతర తీర్పు) అదనపు సహాయపు గ్రాంట్లకింద, యూనియన్ ఎక్సైజు సుంకం, మోటారుబండ్లపై పన్నులు, అమ్మకపు పన్ను, వడ్డీ వగైరాలకింద ఈ పెరుగుదల సమకూరింది_ ప్రధానంగా.

ప్రణాళికా పథకాలకై కేంద్ర నుంచిలభించే రూ. 66.87 కోట్లనుంచి, మొత్తం వ్యయంలో 30 శాతం గ్రాంటుక్రింద లభిసుంది. ఈ కేంద్ర సహాయంలోఇప్పుడు అనుకొన్న రూ. 25 కోట్లు చేరివున్నాయి. 30 శాతం పోను మిగతా మొత్తం ఋణం కింద వుంటుంది. ఈ ఆర్థిక సంవత్సరం నుంచీ ప్రణాళికా సమితి సహాయ విధానం ఈ విధంగా వుంటుంది.

### రివిన్యూ ఖర్చు :

రివిన్యూ ఖాతాకింద ఖర్చు బడ్జెటు రూ. 267.36 కోట్లను సూచిస్తోంది. 1968_69 సవరించిన అంచనాల ప్రకారం రూ. 239.27 కోట్లు సూచింపబడినై. అంటే పెరుగుదల రూ. 28.09 కోట్లు, ఈ పెరుగుదల ప్రధానంగా యీలా జరిగింది.

(1) 1968_69 అంతానికి పూర్తిచేసిన ప్రణాళిక పథకాలకు కేటాయింపు ;

(2) జీతాల స్కేళ్ళు, అలవెన్సుల సవరింపుకు కేటాయింపు :

(3) 1969 ఫిబ్రవరిలో మంజూరైన అధిక కరువు భత్యం రేట్ల కేటాయింపు ;

(4) గ్రేడ్ యింక్రిమెంటు వగైరాల మూలంగా ఖర్చులో మామూలుగా జరిగే పెరుగుదలకు కేటాయింపు.

మొత్తం రూ. 267.36 కోట్ల ఖర్చులో రాష్ట్ర ప్రణాళిక ఖర్చు రూ. 15.97 కోట్లు అని అంచనా వేయబడింది. కేంద్ర ప్రతిపాదిత పథకాలకై ఖర్చు రూ. 10.73 కోట్లు, మిగతా రూ. 240.66 కోట్లు ప్రణాళికేతర ఖర్చుకు సంబంధించినట్టిది. ఇందులో తుఫాను బాధితుల సహాయ కార్యక్రమాలకుగాను నిర్దేశించిన రూ. 13.83 కోట్లుకూడా ఇమిడివుంది. ప్రణాళికకు వర్తించని కొత్తగా ఖర్చు అయ్యే పథకాలేవీ బడ్జెటులో చేర్చబడలేదు.

## పెట్టుబడి వినియోగం :

ప్రణాళిక, ప్రణాళికేతర పథకాలపై పెట్టుబడి వినియోగం రూ. 39.74 కోట్లు వుంటుంది. వినియోగంలోని ముఖ్యఅంశాలు :

| | రూ. కోట్లు |
|---|---|
| నాగార్జునసాగర్ ప్రాజెక్టు ... | 10.40 |
| పోచంపాడు ప్రాజెక్టు .... | 6.00 |
| తుంగభద్ర ఎగువకాలవ రెండవదశ | 1.72 |
| చిన్నసీటి వనర్ల కార్యక్రమం ... | 1.91 |
| శ్రీశైలం జలవిద్యుచ్ఛక్తి పథకం... | 3.50 |
| బలిమెల ఆనకట్ట ... | 1.00 |
| ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక అభివృద్ధి కార్పొరేషన్ ... | 0.50 |
| ఎగ్రో-ఇండస్ట్రీస్ కార్పొరేషన్ ... | 1.00 |
| డిబెంచర్ భాగస్వామ్యం (ఆంధ్రప్రదేశ్ కేంద్ర సహకార భూమి తనఖా బ్యాంకు ... | 3.00 |
| రాజమండ్రి వద్ద రోడ్డు-రైల్వే వంతెన | 0.80 |

## అప్పులు :

అప్పులు మొత్తంమీద రూ. 125.58 కోట్లు వుండవచ్చు. ఇందులో రూ. 90.31 కోట్లు పాతఋణాల చెల్లింపులకు వినియోగం కావాలని ప్రతిపాదించబడింది. మిగతా రూ. 35.27 కోట్లు పెట్టుబడి కార్యక్రమానికై వినియోగం అవుతుంది. తాత్కాలిక వేస్ అండ్ మీన్స్ అడ్వాన్సులు, వాటి చెల్లింపుకూడా ఈ మొత్తంలో చేర్చబడింది.

## డిపాజిట్లు వగైరా :

1969-70 లో కంటింజెన్సీ నిధితోసహా డిపాజిట్లు, అడ్వాన్సుల ఫలితంగా, రూ. 16.50 కోట్లు నికరంగా సమకూరవచ్చు.

## రొక్కపు నిల్వ :

ఈ పై వ్యవహారాల ఫలితంగానూ, ఋణాలు, అడ్వాన్సుల వ్యవహారాల ఫలితంగానూ, ఈ సంవత్సరం రూ. 20.82 కోట్ల తరుగు నిలవతో ముగియవచ్చును.

---



### ఉప ముఖ్యమంత్రిచే

## దెందుకూరు స్టేషనుకు ప్రారంభోత్సవం

దోర్నకల్-విజయవాడ విభాగంలో మధిర, తొండల గోపవరం స్టేషన్ల మధ్య కొత్తగా ఏర్పాటుచేసిన దెందుకూరు రైలు స్టేషనుకు ఆగస్టు 13వ తేదీన రాష్ట్ర ఉపముఖ్యమంత్రి శ్రీ జె.వి. నరసింగరావు ప్రారంభోత్సవం చేశారు. స్టేషను ప్లాటుఫారంను శ్రమదానంతో నిర్మించిన దెందుకూరు గ్రామప్రజలను ఉద్దేశించి ఉపముఖ్యమంత్రి మాట్లాడుతూ యిటీవల సంభవించిన తుఫాను వరదల్లో తొండల గోపవరం స్టేషనులో చిక్కుపడిపోయిన రైలుప్రయాణీకులకు దెందుకూరుప్రజలు సహాయంచేసి రాష్ట్ర గౌరవాన్ని యినుమడింపజేశారనీ, వారిని చూసి గర్వపడవలసి వున్నదనీ అన్నారు. ప్రభుత్వఆస్తులను, రైల్వేఆస్తులను ఇచ్ఛాపూర్వకంగా ధ్వంసంచేయడాన్ని గూర్చి మాట్లాడుతూ యివి ప్రభుత్వ ఆస్తులను పాడుచేయడం కాదనీ, తమ స్వంత ఆస్తులను తామే పాడుచేసుకోవడం అనీ అన్నారు. ఈవిషయాన్ని ప్రజలు గుర్తించాలని ఉపముఖ్యమంత్రి విజ్ఞప్తి చేశారు.

# 'సమైక్య విశాల రాష్ట్రంలోనే ప్రజలకు మేలు జరుగుతుంది'

—అక్కిరాజు వాసుదేవరావు

విదేశీపాలనలో విడదీయబడి, ఉపేక్షించబడిన తెలుగు ప్రజలందరూ, 1956 సంవత్సరంలో సమైక్య ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తిరిగి ఒకటిగా కలుసుకున్నారు. దురదృష్టవశాత్తు గత కొన్ని నెలలుగా ఆంధ్రప్రదేశ్ తనచరిత్రలో క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొంటున్నది. తెలంగాణా ప్రాంతానికి యిచ్చిన రక్షణలను సంపూర్ణంగానూ, సక్రమంగానూ అమలుపరచడం కొరకు ప్రారంభమైన ఆందోళన బాధాకరమైన సంఘటనల పరంపరతో అవివేకమైన ప్రత్యేక తెలంగాణా అలజడిగా రూపొందింది. ఉద్రేకాలను రెచ్చగొట్టడం, అసాంఘిక శక్తులు దౌర్జన్యచర్యలు సాగించడం జరిగింది. మూలసమస్యకూ, మధ్యలో వుత్పన్నమైనదానికీ మధ్య భేదాన్ని తెలుసుకోక పోవడం ఈ ఉద్యమానికి సంబంధించిన విచారకరమైన అంశం సువిశాలమైన సమైక్య రాష్ట్రంలోనే తెలుగు ప్రజలకు శ్రేయస్సు వున్నదన్న సత్యాన్ని సక్రమంగా ఆలోచించేవారందరూ గుర్తించాలి.

## తెలుగు ప్రజల ఐక్యత

తెలుగు ప్రజల చరిత్రను పరిశీలించినట్లయితే వారు మొత్తం మీద ఒకే ఒక పరిపాలనావ్యవస్థ క్రింద వున్నట్లుగానూ, ఎల్లప్పుడూ కలిసివున్నట్లుగానూ వెల్లడవుతుంది. ఆంధ్రజాతినిగురించి ప్రప్రథమంగా 3,000 సంవత్సరాల క్రితం ప్రస్తావించ బడింది. వారిసామ్రాజ్యం భారత దేశంలోఎక్కువ భాగంలోవిస్తరించివుంది. ఆంధ్రశాతవాహనులు నాలుగున్నర శతాబ్దాలపాటు పరిపాలించారు. వారి పరిపాలనావిధానం చాలా అభివృద్ధిజెందినట్టిది. వారి అనంతరం ఇక్ష్వాకులు విజయపురిని తమ రాజధానిగా చేసుకొని కృష్ణా, గోదావరి లోయ ప్రదేశాలను పరిపాలించారు. ఆనాటి విజయపురి వద్దనే ఈనాడు నాగార్జున సాగర్ ఆనకట్ట వుంది. వారి తరువాత చాళుక్యరాజులు, ఆ తరువాత పన్నెండవ శతాబ్దంలో కాకతీయులు వచ్చారు. కాకతీయ ప్రభువులు ఓరుగల్లును తమ రాజధానిగా చేసుకొని తమ రాజ్యాన్ని నెల్లూరు, కడప జిల్లాల వరకూ విస్తరింపజేశారు. కాకతీయుల పతనానంతరం దక్కన్ ప్రాంతంలో బహమనీ, విజయనగర్ సామ్రాజ్యాలు అవతరించాయి.

బహమనీ పాలన అంతరించిన తరువాత గోల్కొండకు చెందిన కుతుబ్‌షాహి సుల్తానులు తమ పాలన క్రింద ఆంధ్ర ప్రాంతంలోని శ్రీకాకుళం మొదలుకొని తెలంగాణా ప్రాంతంలోని గోల్కొండ వరకు గల తెలుగు మాట్లాడే ప్రాంతాలన్నింటినీ సమీకరించారు. తరువాత అసఫ్‌జాహి నవాబుల హయాములో సైతం తెలుగు మాట్లాడే ప్రాంతాలు ఒకే పరిపాలన క్రింద వున్నాయి. ఈ విధంగా హైదరాబాదు వరంగల్లు నగరాలు తెలంగాణా ప్రాంతం ఆంధ్ర దేశానికి ప్రధాన కేంద్రాలుగా వుంటూ వచ్చాయి.

శ్రీకాకుళం నుండి కృష్ణా నది వరకు గల ఉత్తర సర్కార్లు పదిహేడవ శతాబ్దంఆరంభంలో ఫ్రెంచి వారికి యిచ్చివేయడం జరిగింది. తరువాత 1761 లో రాబర్టుక్లైవ్ ఉత్తర సర్కార్లను ఫ్రెంచి వారి నుంచి వశపర్చుకున్నాడు. 1799 లో టిప్పుసుల్తాన్ పతనం తరువాత బళ్లారి, కర్నూలు, అనంతపురం, కడప (చిత్తూరుతో సహా) హైదరాబాదునిజాం వాటాకు లభించగా వాటిని ఆయన 1800 లో ఫోర్ట్ సెయింట్‌జార్జి బ్రిటిష్ ప్రభుత్వానికి దత్తం చేశాడు.

ఈ విధంగా విదేశ పాలకుల హయాములో మాత్రమే చారిత్రక సంఘటనల కారణంగా తెలుగు మాట్లాడే ప్రజలు కృత్రిమంగా విడదీయబడినారు. అందుచేతనే స్వాతంత్ర్య పోరాటంతో పాటుగా, తెలుగు మాట్లాడే ప్రాంతాల కలయికకై తెలుగు ప్రజల పోరాటం కూడా సాగింది. రాజకీయ చరిత్రలో ఎన్ని మార్పులు వచ్చినప్పటికీ తెలుగు ప్రజలు తమ సాంస్కృతిక సమైక్యతను నిరంతరాయంగా సంరక్షించుకున్నారనే విషయం అందరికీ తెలిసిందే. ప్రత్యేకించి ప్రజాస్వామిక పరిపాలనలో భాష, సంస్కృతి పటిష్టవంతమైన సమైక్యతా సాధనలనే అంశాన్ని స్వాతంత్ర్యోద్యమపు తొలిరోజుల్లోనే అందరూ గుర్తించడం జరిగింది. హైదరాబాదు రాష్ట్రాన్ని విభజించి, అందలి మూడు భాషా ప్రాంతాలను, పునర్నిర్మించబడినట్టి ఆయా రాష్ట్రాలలో చేర్చడంతో తెలుగు భాష మాట్లాడే ప్రజల స్వాభావికమైన కలయిక తిరిగి సంభవించింది.

## ఆంధ్రప్రదేశ్

తెలుగు భాషా రాష్ట్రమైన ఆంధ్రప్రదేశ్ ప్రధానంగా కోస్తా ఆంధ్ర (ఏడు జిల్లాలు) రాయలసీమ (నాలుగు జిల్లాలు) తెలంగాణా (తొమ్మిది జిల్లాలు) అనే మూడు ప్రాంతాలతో కూడుకొనివుంది. 1961వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం మొత్తం రాష్ట్ర జనాభాలో 35.3 శాతం జనాభా తెలంగాణాలో వుంది. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలకు ప్రకృతి ప్రసాదించిన

వనరులలో కూడా అపూర్వమైన సమన్వయభావం ప్రదర్శితమవుతూవున్నది. రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల అభివృద్ధికై రాష్ట్ర సమైక్యతయొక్క ఆవశ్యకతను యివి వెల్లడిస్తున్నాయి. సుదీర్ఘమైన కోస్తాతీరం, విస్తృతమైన సేద్యపు నీటి పారుదల పద్ధతి, సమృద్ధమైన ఆహారోత్పత్తి, అపారమైన అటవీసంపద, ఖనిజ సంపత్తి, బ్రహ్మాండమైన నదులు, అద్వితీయమైన ఉమ్మడి సంస్కృతి ఇవన్నీ ఆంధ్రప్రదేశ్ అంతటా విస్తరించివున్న కారణంగాఈరాష్ట్రం అన్నివిధాల మేటిరాష్ట్రంగా అలరారుతున్నది.

## వివిధ ప్రాంతాలమధ్య ఇబ్బందులు :

వివిధ అభివృద్ధి దశలలోనున్న ప్రాంతాలతోనూ, వేరు వేరు పరిపాలనావ్యవస్థలనుండి వచ్చిన ప్రాంతాలతోనూ కూడిన రాష్ట్రాలలో ఆ రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలమధ్య సమస్యలు వుండడం అనివార్యం. కొన్ని విషయాలలో రాష్ట్రంలోని ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలమధ్య హెచ్చువ్యత్యాసం వుంది. కొత్త రాష్ట్రాలు ఏర్పడడంతో ఎదుర్కొనవలసివచ్చే ప్రత్యేక సమస్యలను గురించి అవగాహన కలిగింది. ఈ సమస్యలను పరిష్కరించడానికి తొలి చర్యగా, నూతన రాష్ట్రావతరణ సందర్భంలో "పెద్ద మనుషుల ఒప్పందం" అనే ఒడంబడిక కుదుర్చుకొనబడింది. ఈ రెండు ప్రాంతాల ఏకీకరణ వల్ల వుత్పన్నం కాగల కొన్ని ఇబ్బందులను గురించి ఆలోచించి తెలంగాణా ప్రజలకు కొన్ని "రక్షణలు" కల్పించబడినవి. ఈ రక్షణలను దిగువవిధంగా వర్గీకరించవచ్చు. (అ) మంత్రివర్గ నిర్మాణానికి సంబంధించిన రాజకీయ సంబంధమైన రక్షణలు, (ఆ) తెలంగాణాలో వచ్చే ఆదాయాన్ని వినియోగించే విధానాన్ని నిర్దిష్టపరిచే ఆర్థిక సంబంధమైన రక్షణలు, (ఇ) తెలంగాణా ప్రాంతంలో నివాసస్థలానికి సంబంధించిన యోగ్యతలు కలిగివున్నవారికి ఉద్యోగాలను ప్రత్యేకించడానికి ఉద్దేశించిన పరిపాలనా సంబంధమైన రక్షణలు, (ఈ) తెలంగాణా ప్రాంతంలో నివాసస్థలానికి సంబంధించిన యోగ్యతలు కలిగివున్న వారికి విద్యావకాశాలను ప్రత్యేకించడానికి ఉద్దేశించిన విద్యావిషయకమైన రక్షణలు, తెలంగాణా ప్రాంతం సర్వతోముఖావృద్ధి కొరకు, తెలంగాణా ప్రాంతానికి చెందిన వ్యక్తులతో ప్రాంతీయమండలిని నెలకొల్పాలనికూడా ఈ ఒప్పందంలో నిర్దిష్టపరచడం జరిగింది. ఇది అమలుపరుచబడింది.

## (అ) రాజకీయ సంబంధమైన రక్షణలు:

రాష్ట్రం ఏర్పడినప్పటి నుండి, ఎప్పుడో ఒకప్పుడు కేబినెట్ మంత్రులుగా కానీ, సహాయ మంత్రులుగా కానీ పనిచేసిన వారి సంఖ్య 43 వుండగా వీరిలో తెలంగాణాకు చెందినవారు 18 మంది, ఆంధ్ర ప్రాంతానికి చెందినవారు 25 మందివున్నారు. సుమారు రెండు సంవత్సరాలపాటు తెలంగాణాకు చెందిన ఒకవ్యక్తి ఉపముఖ్యమంత్రిగా వ్యవహరించారు. 1969 జూలై 19వ తేదీన రాష్ట్రంలో విస్తృతప్రాతిపదికపై ఏర్పర్చబడిన మంత్రివర్గంలో ముఖ్యమంత్రితోసహా మొత్తం 28 మంది సభ్యులువున్నారు. వీరిలో 17 మంది కేబినెట్ మంత్రులు మిగిలిన 11 మంది సహాయమంత్రులు. తెలంగాణాకు చెందిన శ్రీ జె. వి. నరసింగరావుగారు ఉపముఖ్యమంత్రిగా నియమించబడినారు. మంత్రివర్గంలో ఒక ముస్లిము సభ్యుడు వున్నారు.

గతంలో, హోం, ఆర్థిక, రెవెన్యూ, వాణిజ్యం, పరిశ్రమలు, ప్రణాళికలు, వంటి శాఖలను కూడా తెలంగాణాకు చెందిన వారు నిర్వహించారు. విస్తృత ప్రాతిపదికపై ఏర్పర్చబడిన ప్రస్తుత మంత్రివర్గంలో ప్రణాళిక, సేద్యపు నీటివనరులు, హోం, విద్య, రవాణా, ఆరోగ్య శాఖలవంటి అతిముఖ్యమైన శాఖలను తెలంగాణాకు చెందిన మంత్రులు నిర్వహిస్తున్నారు.

## (ఆ) ఆర్థికరంగం

సెంట్రల్–సాధారణ పరిపాలనకు అయ్యే ఖర్చును ఉభయ ప్రాంతాలు వారి వారి నిష్పత్తుల్లో భరించాలనీ, తెలంగాణా ఆదాయంలోని మిగులును తెలంగాణాప్రాంతం అభివృద్ధికి వినియోగించాలనీ రాష్ట్ర అవతరణకు ముందు అంగీకరించారు. ఐదు సంవత్సరాల తర్వాత యీ ఏర్పాటును పరిశీలించాల్సి ఉంది. ఆ తర్వాత తెలంగాణా శాసనసభ్యులు కోరిన పక్షంలో యీ ఏర్పాటును మరో ఐదు సంవత్సరాలపాటు కొనసాగించవచ్చు.

ఆంధ్ర ప్రాంతంలో ఖర్చు యెపుడూ రాబడిని మించి ఉంటుండగా(ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నిర్మాణంతో సంబంధం లేదు.) తెలంగాణాలో ఆదాయం దాదాపు ఖర్చును మించి ఉంటున్నది. తత్ఫలితంగా యిక్కడ ప్రతి సంవత్సరం మిగులు ఆదాయం పెరుగుతున్నది. దీనికి కారణం, పూర్వపు హైద్రాబాదు సంప్రదాయం కొనసాగుతూ తెలంగాణాలో రెవిన్యూ ఖర్చులు, పరిపాలనా ఖర్చుల స్థాయి తగ్గుదలలో ఉన్నది. మిగులు నిధులు ఉండడం, దానితోపాటు వెనుకబడినతనం ఉండడం వల్ల ఒక విచిత్రమైన పరిస్థితి ఏర్పడింది. బడుగు తనం కారణంగా మిగులు నిధులను వియోగించుకునే అవకాశం లేకపోయింది. మద్యనిషేధం లేని కారణంగా మిగులు నిధులు ఏర్పడ్డాయి.

కేంద్రప్రభుత్వం శ్రీ జస్టిస్‌భార్గవా అధ్యక్షతన ఉన్నతాధికార సంఘాన్ని నియమించింది. తెలంగాణా ప్రాంతం అభివృద్ధికి వినియోగించడానికి సంబంధించిన మిగులు నిధులను నిర్ధారించే పనిని యీ సంఘం చేపట్టుతుంది. ఈ సంఘం రాష్ట్రాన్ని సందర్శించి అన్ని వర్గాల వారి అభిప్రాయాలను సేకరించింది.

## (ఇ) పరిపాలనా విషయాలు :

తెలంగాణా ప్రాంతంలో దామాషా పద్ధతిపై ఉద్యోగాలలో నియామకాలు జరగడానికి వీలుగా పెద్ద మనుష్యుల ఒప్పందంలో "ఒక విధమైన నివాస నిబంధన"ను నిర్దేశించారు. దీనిని పురస్కరించుకుని తెలంగాణాలో రూ. 300 లు, అంతకు తక్కువ ప్రాతిపదిక జీతంగల ఉద్యోగాలల్లో నివాసార్హతగల వ్యక్తులను నియమించడానికి వీలుగా పార్లమెంటు, 1957వ సం॥లో ఉద్యోగ నియామకాల నివాసార్హత గలవారి నియామక చట్టాన్ని చేసింది. ఈ సౌకర్యాన్ని మొదట 5 సంవత్సరాలకు పరిమితంచేశారు. ఆ తర్వాత మరో ఐదు సంవత్సరాలకు పొడిగించారు. ఇది 1969 మార్చితో ఆఖరు కావల్సివుంది.

తెలంగాణా ఉద్యోగాలలో నివాసార్హతలు లేని వ్యక్తులను నియమిస్తున్నట్లు, తాద్వారా ముల్కీ అభ్యర్థులకు యీ ఉద్యోగాలు లభించడంలేదనీ గత కొంతకాలంగా ప్రాంతీయసంఘం, ఇతర సంస్థలు, వ్యక్తులు ప్రభుత్వానికి అనేక ఫిర్యాదులు అందజేశారు. ఇటువంటి వ్యక్తులందరినీ మూడు మాసాలలోగా తీసివేయాలని ప్రభుత్వం 1968 జూలైలో ఉత్తర్వులు జారిచేసింది. తెలంగాణాకు సంబంధించి ఉద్యోగ నియామకాల రిజర్వేషన్ అంశానికి చెందిన చట్టాన్ని మరో ఐదు సంవత్సరాలకు పొడిగించాల్సిందిగా రాష్ట్ర ప్రభుత్వం కేంద్రానికి సిఫార్సు చేసింది. ఈలోగా తెలంగాణా ప్రాంతానికి వర్తించే యీ చట్టం రాజ్యాంగ విరుద్ధమని సవాల్ చేస్తూ ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో రిట్ దాఖలు చేశారు. ఈ చట్టం రాజ్యాంగ విరుద్ధమని హైకోర్టు సింగిల్ బెంచి తీర్పు యివ్వగా, డివిజన్ బెంచి దానిని త్రోసిపుచ్చుతూ, తెలంగాణాలో యిదివరకే నియమించబడిన నాన్ ముల్కీ వ్యక్తులకు సంబంధించి కొన్ని సూచనలను చేసింది. ఈలోగా యిదేవిషయంపై సుప్రీంకోర్టులో అనేక రిట్ దరఖాస్తులను దాఖలు చేశారు. సుప్రీంకోర్టు 1969 మార్చి 23 వ తేదీన యిచ్చిన తమ తీర్పులో ఉద్యోగ నియామకాల చట్టంలోని రిజర్వేషన్ అంశం రాజ్యాంగ విరుద్ధమని అంతిమంగా నిర్ణయించింది.

సుప్రీంకోర్టు తీర్పు ఫలితంగా సమస్యలు మరింతగా క్లిష్టమైనాయి. అయితే రాష్ట్ర ప్రభుత్వానికి బాధ్యతను అంటగట్టలేము. నాన్ ముల్కీలను తొలగించాలని ప్రభుత్వంలోగడ జారీచేసిన ఉత్తర్వులను యిప్పుడు అమలు పర్చలేని పరిస్థితి ఏర్పడింది. అయితే తెలంగాణాకు ముల్కీ నిబంధనలు వర్తించే విధంగా రాజ్యాంగ సంబంధమైన, శాసన సంబంధమైన తగుచర్యలు వెంటనే తీసుకోవల్సిందిగా రాష్ట్ర ప్రభుత్వం కేంద్రాన్ని కోరింది. తత్ఫలితంగా 1969 ఏప్రిల్ 19 వ తేదీన శ్రీ కె. యస్. వాంచూ అధ్యక్షతన ఉన్నతాధికార సంఘాన్ని ఏర్పాటు చేశారు. ఈ సంఘం, ముల్కీ నిబంధనల వివరాలు సేకరించి పరిశీలించి తమ నివేదికను సమర్పించింది. ఈ నివేదిక ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వ పరిశీలనలో ఉంది.

తెలంగాణా ప్రాంతంలో సాధ్యమైనన్ని ఉద్యోగాలను కల్పించాలని ప్రభుత్వం చిత్తశుద్ధితో కృషిచేస్తున్నది. తక్షణ చర్యగా 1969 మార్చిలో 2,005 ఉద్యోగాలను ఏర్పాటుచేస్తూ ముఖ్యమంత్రి ప్రకటించారు తద్వారా తెలంగాణా అభ్యర్థులకు అదనంగా ఉద్యోగ అవకాశాలు కల్పించారు. ఈ ఉద్యోగాలలో నియామకాలు సంతృప్తికరంగా కొనసాగుతున్నవి. తెలంగాణాలో ఖాళీగా ఉన్న 1,283 ఉద్యోగాలను భర్తీచేయడం జరుగుతున్నది.

## ఒప్పందాల అమలు

పరిపాలనాపరంగా జరిగే లోపాలవలెగాక భావ సమైక్యతా దృష్టితో ఒప్పందాలను అమలు జరపనప్పుడు, ప్రాంతీయ ఉద్రేకాలు పెరిగే ప్రమాదంఉంది. తత్కారణంగానే రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు యిప్పుడు యీ అంశానికి ఎక్కువ ప్రాధాన్యం యిస్తున్నాయి. రక్షణ అమలుకు సంబంధించి పరిశీలించడంలో ప్రధానమంత్రి ప్రత్యక్షంగా సంబంధం కలిగిఉన్నారు. అందువల్ల యికనుండి ఎటువంటి లోపాలు జరగవని ఆశించబడుతున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో భాగంగా యీ 12 సంవత్సరాలలో వ్యవసాయం, పట్టణాలు, గ్రామాల విద్యుదీకరణ, విద్యాసంస్థలు మొదలైన రంగాలలో సాధించిన అపూర్వమైన అభివృద్ధిలో తెలంగాణా గర్వకారణమైన పాత్ర నిర్వహించిందనే వాస్తవాన్ని ప్రస్తుత అందోళన మరుగుపరుస్తున్నది. ముఖ్యమైన ఉద్యోగాలలో నియామకం చేయడంలో ఎటువంటి విచక్షణ చూడబడలేదు.

తెలంగాణా మిగులు నిధులను యింకా నిర్ధారణ చేయాల్సి ఉన్నప్పటికీ రాష్ట్రప్రభుత్వం 1969-70 లో తెలంగాణా ప్రాంతంలోని ప్రతీ జిల్లాకు కోటి రూపాయలు చొప్పున రూ. 9 కోట్లు అదనంగా కేటాయించింది. ఇందులో రూ. 3.60 కోట్లు గ్రామీణ విద్యుదీకరణకు ప్రత్యేకించారు. లోక్‌సభలో ప్రధాన మంత్రి చేసిన ప్రకటనను అనుసరించి నియమించబడిన ఉన్నతాధికార తెలంగాణా అభివృద్ధి సంఘం, యిటీవల సమావేశమయి తెలంగాణా ప్రాంతంలో పోచంపాడు ప్రాజెక్టునిర్మాణం శీఘ్రగతిని అమలు జరపాల్సిన విషయాన్ని గూర్చి కొన్ని సిఫార్సులు చేసింది.

ఆంధ్ర ప్రాంతం వారితోనేగాక మిగతా భారత దేశం వారితోకూడ మనం భావ సమైక్యతను పెంపొందించుకోవడం ద్వారా తెలంగాణాలో సాధారణ పరిస్థితులను నెలకొల్పగలుగుతామని ఆశించబడుతున్నది. ఈ సంపూర్ణ భావ సమైక్యతతోనే ఫ్యూడల్‌వర్గాల, ప్రత్యేక రాష్ట్రవాదుల ధోరణులను రూపుమాపగలుగుతాము. తద్వారా తెలంగాణా ప్రాంతం భవిష్యత్తులో మరింతగా పురోభివృద్ధిచెంద గలుగుతుంది.

# సమైక్యతద్వారానే పరిపూర్ణ వికాసం

# అయిదవ ఆర్థిక విచారణా సంఘం సిఫారసులు

# ఆంధ్రప్రదేశ్‌కు రూ. 339.28 కోట్లు

అయిదవ ఆర్థిక విచారణాసంఘం సూచనప్రకారం 1969_70 నుండి 1973_74 వరకుగల అయిదేళ్ళ కాలానికి 275(1) అంశం క్రింద పన్నులు, డ్యూటీలు, గ్రాంట్లురూపంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి దానివాటాక్రింద రావలసిన నిధులమొత్తం రూ. 339.28.కోట్లు. దీనికి భారత ప్రభుత్వ అంగీకారంకూడా లభించింది. అయిదవ ఆర్థిక విచారణాసంఘం కడపటి నివేదిక ఆగస్టు 26న పార్లమెంటు ఉభయసభల ఎదుట వుంచడం జరిగింది.

ఈ విచారణాసంఘం చేసిన సిఫారసులను చాలావాటిని భారతప్రభుత్వం అంగీకరించింది. ఈ సంఘం సిఫారసులు 1969 ఏప్రిల్ 1వ తేదీనుంచి అయిదు సంవత్సరాలకాలానికి వర్తిస్తాయి.

ఎస్టేట్ పన్నును, రైలుప్రయాణీకుల ఛార్జీలపై పన్నును రద్దుచేసినందుకు బదులుగా గ్రాంటును రాష్ట్రాల మధ్య పంపిణీ చేసే విషయంలోకూడా గత అక్టోబరు నెలలో అందచేసిన మధ్యంతర నివేదికలో యీ సంఘం సిఫారసులు చేసింది. 1969_70 సంవత్సరానికి గ్రాంటులు పంపిణీ విషయంలో కూడా యీసంఘం మధ్యంతర సిఫారసులను చేసింది. ఆదాయపు పన్ను కేంద్ర ఎక్సైజు పన్నులను పంచుకోవడం, రాజ్యాంగంలోని 275 (1) అంశం క్రింద సహాయక గ్రాంటుల చెల్లింపు, అదనపు ఎక్సైజు పన్నుల పంపిణీలతో పాటు ఈ సంఘం తన కడపటి నివేదికలో, తనకు నివేదించిన మరో రెండు విషయాలలో కూడా_ అంటే_రాజ్యాంగంలోని 269 ఆర్టికల్ ఉదాహరించబడి ప్రస్తుతం అంశంలో విధించబడని పన్నులు డ్యూటీల నుండి ఆదాయాన్ని పెంచడానికి మార్గాల విషయంలోనూ వివిధ రాష్ట్రప్రభుత్వాలు అదనంగా ఆదాయాన్ని పెంచుకోవడానికి మార్గాల విషయంలోను సిఫారసు చేసింది.

## ఆదాయపు పన్ను

ఆదాయపు పన్నుల ద్వారావచ్చే నికరరాబడి మొత్తంలో ప్రస్తుతం రాష్ట్రాల వాటా 75 శాతం, కేంద్రపాలిత ప్రాంతాలవాటా 2½శాతం చొప్పున వుంది. ఒకొక్కరాష్ట్రానికి ఈ రాష్ట్రాల వాటా మొత్తంలో 80 శాతం జనాభాప్రాతిపదికమీదా, 20 శాతం ఆ రాష్ట్రంలో వసూలయిన మొత్తం మీదా ఆధారపడి లభిస్తూవుండేది. ఆదాయపుపన్ను ద్వారావచ్చే నికరరాబడిలో రాష్ట్రాలవాటా 75 శాతాన్ని అలాగే వుంచి వేయాలని ఆర్థిక విచారణాసంఘం సిఫారసు చేసింది. అయితే ఒకొక్కరాష్ట్రానికి ఆమొత్తాన్ని పంపిణీ చేసేవిషయంలో 90 శాతం జనాభా ప్రాతిపదికమీదా, 10శాతం రాష్ట్రంలో వసూలు చేసిన మొత్తం ప్రాతిపదిక మీదా అందజేయా

లని ఈసంఘం సిఫారసుచేసింది. కేంద్ర ప్రాంతాలకు లభించే వాటా 2.5 శాతంనించి 2.6 శాతానికి పెంచడం జరిగింది.

## ఎక్సైజు పన్నులు

ఎక్సైజుపన్నుల రూపంలో వసూలయిన మొత్తంలో రాష్ట్రాలవాటా 20శాతం చొప్పున ప్రస్తుతం వుంటున్నది. దీనిలో ఆయారాష్ట్రాలకు లభించే వాటా 80 శాతం ఆరాష్ట్ర జనాభా మీదా, 20శాతం దాని ఆర్థికపరమైన వెనుకబడినతనం మీదా ఆధారపడి పంపిణీ అవుతూ వచ్చింది. ప్రస్తుత నివేదికలో యీ సంఘం రాష్ట్రాలవాటాను 20 శాతంగానే వుంచివేసింది. అయితే 1972–73, 1973–74 సంవత్సరాలకు మాత్రం స్పెషల్ ఎక్సైజు పన్నుల ఆదాయంలో కూడా రాష్ట్రాలకు వాటా యివ్వాలని యీ సంఘం సిఫారసు చేసింది. ఇంతవరకూ దీనిని పంచడానికి ఉద్దేశించిన మొత్తం నించి విడిగా ఉంచడం జరిగింది. 80 శాతం జనాభా ప్రాతిపదికమీదా, 20 శాతం సాంఘిక, ఆర్థిక వెనుకబడినతనం మీదా ఆధారపడి పంపిణీ అవుతున్న ప్రస్తుత పంపిణీవిధానాన్ని యీ సంఘం అలాగేవుంచాలని సూచించింది.

వెనుకబడిన తనం ప్రాతిపదికగా యిచ్చే 20 శాతంలోనూ మూడింట రెండు వంతుల మొత్తాన్ని, రాష్ట్రాల సగటు తలసరి ఆదాయంకన్న తక్కువ ఆదాయంగల రాష్ట్రాలమధ్య పంపిణీ చేయడం జరుగుతుంది. మిగతా ఒకవంతు భాగాన్నీ వెనుకబడిన తనానికి సంబంధించిన సమీకృత సూచీ పట్టిక ప్రకారం అన్ని రాష్ట్రాలకూ పంపిణీ చేస్తారు. ఈ రాష్ట్రాల వెనుకబడినతనాన్ని ఒక క్రమంలో నిర్ణయించేటప్పుడు అక్కడి షెడ్యూలు జాతుల జనాభా, ఫ్యాక్టరీ కార్మికుల సంఖ్య, సేద్యపు నీటి సౌకర్యంగల ప్రాంతం విస్తీర్ణం, రైలుమార్గం, రోడ్డుమార్గ విడివి, పాఠశాలలకు వెళ్ళే పిల్లలసంఖ్య, ఆసుపత్రి పడకల సంఖ్యలను లెక్కలోకి తీసుకుంటారు.

ఎక్సైజ్ పన్నులవలన వచ్చిన ఆదాయంలో ఆంధ్రప్రదేశ్‌కు రూ. 7.15 శాతం లభిస్తుంది. వెనక చక్కెర, వస్త్రాలు, పొగాకులపై రాష్ట్రాలు అమ్మకంపన్ను విధించేవి. కాని ఆ హక్కును రాష్ట్రాలు వదలుకుని వాటిపై అదనపు ఎక్సైజ్ పన్నులను విధించే అధికారం కేంద్రానికి యిచ్చాయి. అయితే యీవస్తువులపై అమ్మకం పన్ను విధించే అధికారాన్ని తిరిగి తమకు సంక్రమింపజేయాలని రాష్ట్రాలు కోరుతున్నందున యీ విషయంలో కేంద్రం రాష్ట్రాలతో ఒక ఒప్పందానికి రావాలనీ, ఆవిధంగా ఒప్పందం కుదరకపోతే పై వస్తువులపై కేంద్రం అదనపు సుంకాలను విధించే అధికారాన్ని వదులుకోవాలనీ ఆర్థిక విచారణాసంఘం సూచించింది. ఈ ఒప్పందం సాధ్యమైనంత త్వరలో జరగాలనికూడా సూచించింది. ఈ విషయాన్ని జాతీయ అభివృద్ధిమండలి ముందు వుంచడానికి కేంద్రప్రభుత్వం నిశ్చయించింది.

## గ్రాంట్లు

వచ్చే అయిదు సంవత్సరాలలో పది రాష్ట్రాలకు గ్రాంట్లను మంజూరు చేయ్యాలని ఆర్థిక విచారణా సంఘం సూచించింది. ఈ మొత్తంరూ. 637.85 కోట్లు వుంటుంది. ఇందులో ఆంధ్రప్రదేశ్‌కు రూ. 65.01 కోట్లు లభిస్తాయి. వివిధ రాష్ట్రాలకు మంజూరు చేయవలసిన గ్రాంట్ల మొత్తాలను నిర్ణయించడంలో, ఆయా రాష్ట్రాలలో రైలుప్రయాణీకుల ఛార్జీలవల్ల వసూలయిన మొత్తాలను, కేంద్రం అదనపు ఎక్సైజ్ పన్నులు విధించడంవలన రాష్ట్రాలు అమ్మకం పన్నుల వసూళ్ళలో కోల్పోయిన మొత్తాన్ని యీ విచారణాసంఘం దృష్టిలో పెట్టుకుంది.

రాజ్యాంగంలోని 269వ అంశం క్రింద విధించే వివిధరకాల పన్నులలో ఒక్క వార్తాపత్రికలలో ప్రకటనలపై పన్ను మినహా మిగిలిన పన్నులను విధించే అవకాశం ప్రస్తుత పరిస్థితులలో ఏమీ లేదని విచారణా సంఘం భావించింది. ఈ పన్నువిధించేవిషయంలో అవసరమైన వివరాలన్నింటిని ప్రభుత్వం పరిశీలించాలని ఈ విచారణాసంఘం సూచించింది.

రాష్ట్రాలు తమ ఆర్థిక వనరులను, ఆదాయాలను పెంచుకొనే విషయంలో విచారణాసంఘం కొన్ని సూచనలు చేసింది. ఈ సూచనలను కేంద్ర ప్రభుత్వం పరిశీలించి వివిధ రాష్ట్రాలతో దీనిపై సంప్రదింపులు జరుపుతుంది.

కేంద్రం విధించే పన్నులలో రాష్ట్రాలకు లభించే వాటా నాలుగవ ఆర్థిక విచారణా సంఘం నివేదిక ప్రకారం రూ. 2183 కోట్లు కాగా, అయిదవ ఆర్థిక విచారణా సంఘం నివేదిక ప్రకారం యీ మొత్తం రూ. 3628 కోట్లు వుంది. కేంద్ర ప్రభుత్వం మంజూరు చేసేగ్రాంట్లు నాలుగవ ఆర్థిక విచారణాసంఘం నివేదిక ప్రకారం రూ. 703 కోట్లుకాగా, అయిదవ విచారణా సంఘం యీ మొత్తాన్ని రూ. 6318 కోట్లకు తగ్గించింది.

బీహార్, గుజరాత్, హరియానా, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, పంజాబ్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలకు మిగులు బడ్జెటులు

వున్నందువల్ల ఈ రాష్ట్రాలకు రాజ్యాంగంలోని 275 అంశంక్రింద కేంద్రగ్రాంట్లు మంజూరు చేయవలసిన అవసరంలేదని యీ సంఘం సూచించింది.

అయిదవ ఆర్థిక విచారణా సంఘం సిఫారసుల మేరకు కేంద్రం విధించే పన్నులలో వాటా రూపంగానూ, గ్రాంటులరూపంగానూ రాష్ట్రాలకు మొత్తం రూ. 4,266 కోట్లు లభిస్తుంది. నాలుగవ విచారణాసంఘం సిఫారసువల్ల రాష్ట్రాలకు రూ. 2,886 కోట్లు మాత్రమే రావలసివుండేది. (ఈ దిగువ పట్టికలో రాష్ట్రాలవారీ వివరాలు యివ్వబడినవి.) దీనికితోడు రానున్న అయిదేళ్ళలోనూ కేంద్రం విధించే అదనపు పన్నులనుండి కూడా రాష్ట్రాలకు తమ వాటా లభిస్తుంది.

## రాజ్యాంగంలోని 275వ అంశం క్రింద పన్నులు, డ్యూటీలు గ్రాంటులలో రాష్ట్రాలకు లభించే వాటాలు

| రాష్ట్రాలు | పన్నులు, డ్యూటీలు | | 275 అంశం క్రింద గ్రాంట్లు* | |
|---|---|---|---|---|
| | 4వ ఆర్థిక విచారణాసంఘం సిఫారసులు (1966–71) | 5వ ఆర్థిక విచారణాసంఘం సిఫారసులు 1969–74) | 4వ అర్థికవిచారణా సంఘం సిఫారసులు (1966–71) | 5వ ఆర్థిక విచారణా సంఘం సిఫారసులు (1969–74) |
| ఆంధ్రప్రదేశ్ | 166.63 | 274.27 | 67.55 | 65.01 |
| అస్సాం | 62.36 | 93.24 | 82.60 | 101.97 |
| బీహారు | 197.46 | 407.38 | .. | .. |
| గుజరాతు | 121.55 | 182.75 | .. | .. |
| హర్యానా | 39.19** | 59.61 | .. | .. |
| జమ్ము కాశ్మీరు | 33.25 | 33.16 | 32.85 | 73.68 |
| కేరళ | 84.51 | 143.78 | 104.10 | 49.65 |
| మధ్యప్రదేశ్ | 148.53 | 274.02 | 13.50 | .. |
| మహారాష్ట్ర | 260.38 | 383.66 | .. | .. |
| మైసూరు | 111.32 | 179.43 | 104.10 | 17.99 |
| నాగాలాండ్ | 23.11 | 2.77 | 35.35 | 77.95 |
| ఒరిస్సా | 85.95 | 146.01 | 145.90 | 104.67 |
| పంజాబు | 57.51** | 89.16 | .. | .. |
| రాజస్థాన్ | 96.76 | 170.16 | 33.65 | 51.49 |
| తమిళనాడు | 173.12 | 272.29 | 34.20 | 22.82 |
| ఉత్తరప్రదేశ్ | 323.77 | 620.12 | 49.25 | .. |
| ప. బెంగాలు | 197.41 | 296.64 | .. | 72.62 |
| మొత్తం | 2182.81 | 3628.45 | 703.05 | 637.85 |

* రైలు ప్రయాణికుల ఛార్జీలపై పన్నుకు బదులుగా యిచ్చే గ్రాంటుల్లో భాగంతో సహా.

** ఉమ్మడి పంజాబు భాగం పంజాబు, హర్యానా, కేంద్ర పాలిత ప్రాంతాల మధ్య జనాభా ప్రాతిపదిక మీద కేటాయించడమైనది.

# పోచంపాడు ప్రాజెక్టు

పూర్వ హైదరాబాదు రాష్ట్రం, గోదావరి నదీ పరీవాహ ప్రదేశం కావడానికి నోచుకోవడమే కాకుండా, సుమారు 46,400 చదరపు మైళ్ళ మేరకు ఆ పరీవాహ ప్రదేశాన్ని కలిగివున్న అదృష్టానికి కూడా నోచుకున్నది. ప్రకృతి ప్రసాదించిన ఈ అపూర్వమైన అవకాశాన్ని దృష్టిలో పెట్టుకొని, నాటి హైదరాబాదు ప్రభుత్వం సేద్యపు నీటిపారుదల అభివృద్ధికి, విద్యుచ్ఛక్తి అభివృద్ధికి గోదావరి నదిపై ఒక బృహత్తర పథకాన్ని అమలుపరచ దలచింది. ఆ పథకాన్ననుసరించి, గోదావరినదికి అడ్డంగా కవలగూడవద్ద ఒక జలాశయాన్నీ, కిష్టాపురం వద్ద ఒక ఆనకట్టనూ దిగువన ఏడుమైళ్ళ దూరంలో "ఒక పికప్ డామ్‌నూ కడెంవద్ద నిర్మించదలచిన రిజర్వాయరుకు నీటిని అందించేందుకై ఉత్తరదిశన ఒకకాలువ, దక్షిణదిశన166 మైళ్ళ పొడవున మరోకాలువనూ నిర్మించదలచారు. ఈ ప్రాజెక్టు సుమారు 24 లక్షల ఎకరాలకు సేద్యపునీరు అందించగలదనీ, 300 శతకోటి ఘనపుటడుగుల నీటిని వినియోగించుకోగలదనీ అంచనా వేయబడింది.

2,27,000 ఎకరాలకు సేద్యపు నీటిని అందించే 79 మైళ్ళ కాలువతోనూ, కడెం రిజర్వాయరుతోనూ కూడిన గోదావరి ఉత్తర కాలువ ప్రాజెక్టు 1969 ఏప్రిల్‌లో మంజూరు చేయబడింది నీటి వినియోగం 53శత కోటి ఘనపుటడుగులకు నిర్ణయించబడింది. కిష్టాపురం డామ్ ఏర్పడే వరకు, గోదావరినుంచి కడెం ప్రధాన కాలువ లోనికి 900 క్యూసెక్కుల నీటిని ప్రవహింపజేయడానికి సంబంధించిన తాత్కాలిక పథకం కూడా దీనిలో చేరివుంది. ఇది గోదావరి సేద్యపు నీటిపారుదల, జల విద్యుత్ పథకంలోని మొదటి దశ కార్యక్రమం.

**అచిరకాలంలోనే తెలంగాణాలోని భూములను సస్యశ్యామలం చేయగల పోచంపాడు ప్రాజెక్టు ద్వారా సుమారు 22 లక్షల ఎకరాలకు పైగా సేద్యపు నీటి వసతి లభిస్తుంది.**

## రెండు ఆనకట్టలు

ప్రణాళికా సంఘం కోరిన ప్రకారం అప్పటి హైద్రాబాదు ప్రభుత్వం 951వ సం.లో, గోదావరి పరీవాహ ప్రదేశంలో ప్రాజెక్టుల క్రింద వర్తమాన వినియోగాలను గురించీ, తలపెట్టిన పథకాలను గురించీ తెలియజేసింది. ఈ పథకాలలో సమగ్ర గోదావరి ప్రాజెక్టు కూడా చేరివుంది. ఈ ప్రాజెక్టువల్ల నికరంగా 441 శ.కో. ఘ. అడుగుల నీరు లభించగలదని అంచనా వేయబడింది. పూర్వ బొంబాయి రాష్ట్రంలో తలపెట్టిన పథకాలకు 50 శ.కో.ఘ. అడుగుల నీటినీ, నిజాంసాగరుకు 58 శ.కో.ఘ. అడుగుల నీటినీ పూర్ణప్రాజెక్టుకు 36 శ.కో.ఘ అడుగులనీటినీ, దేవనూరు మొదలైన వాటికి 27 శ.కో.ఘ అడుగుల నీటినీ కేటాయించిన తరువాత మిగతా 270 శ.కో.ఘ అడుగుల నీటిని గోదావరి నదిమీద అమలుపరచ దలచిన పథకానికి వినియోగించదలచారు. గోదావరినది మీద కావలగూడ, కిష్టాపురంలవద్ద ఒక పికప్ డాము రెండు కాలువలతో రెండు ఆనకట్టలను నిర్మించడాన్ని ఈ పథకం ఉద్దేశిస్తున్నది.

కడెం, మానేరు నదుల మీద కూడా ఆనకట్టలు నిర్మించదలచారు. 1951వ సం. లో ఈ ప్రాజెక్టుకు మొత్తం 280 శ. కో. ఘ. అడుగులనీటి అవసరాన్ని నిర్దేశించారు. గోదావరి ప్రాజెక్టుకు సంబంధించిన ఈ నీటి అవసరంలో 13 శ. కో. ఘ. అడుగుల నీరు కడెం నది నుంచీ, 11 శ. కో. ఘ. అడుగుల నీరు మానేరు నదినుంచీ లభిస్తుంది. ఇందువల్ల కిష్టాపురం వద్ద గోదావరి నుంచి వినియోగించుకునే నీటి పరిమాణం 256 శ. కో. ఘ. అడుగులకు తగ్గుతుంది. ఈ ప్రదేశం వద్ద నది అందించే నీటిని 270 శ. కో. ఘ. అడుగులకు లెక్కకట్టారు. 1951వ సంవత్సరం నాటి ఈ గోదావరి ప్రాజెక్టు క్రింద 11,60 లక్షల ఎకరాలకు సేద్యపు నీటిని పారుదల చేయడానికి తలపెట్టబడింది.

గోదావరి పథకపు మొదటి దశ కార్యక్రమమైన గోదావరి ఉత్తర కాలువ ప్రాజెక్టు పథకం అమలు సందర్భంలో, పంపింగ్‌కు సంబంధించిన పని చాలా ఖర్చుతో కూడుకున్నదనీ, లాభసాటికాదనీ కనుగొనడం జరిగింది. తత్కారణంగా యీ పథకాన్ని విరమించుకోవడం జరిగింది. ఈ విధంగా జి.ఎన్.సి.పి. పథకం అమలును కడెం జలాలను ఉపయోగించుకోడం వరకే పరిమితం చేయబడింది. తత్ఫలితంగా కడెం ద్వారా 44 మైళ్ళ నీటిపారుదల కాల్వతో 13 శ. కో.ఘ. అడుగుల నీటి ఉపయోగంతో 67,000 ఎకరాలకు నీరు లభిస్తుంది. 1953లో యీ ప్రాజెక్టు నిర్మాణానికి అనుమతి లభించింది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలో రూ. 441 లక్షలు ఖర్చుకాగల యీ పథకాన్ని చేర్చుకున్నారు. ఈ ప్రాజెక్టు నిర్విరామంగా కొనసాగేది కావడంవల్లను, 1951 సంవత్సరానికి పూర్వం దీనిపై రూ. 85 లక్షలు ఖర్చుచేయ

డం వల్లను మిగతా రూ. 358 లక్షల ఖర్చుమొత్తాన్ని ప్రథమ పంచవర్ష ప్రణాళికలో చేర్చారు. పూర్వపు హైదరాబాదు రాష్ట్రపు రెండవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాలో తీవ్రమైన మార్పులు జరగడంతో గోదావరి ప్రాజెక్టు రెండవదశ నిమిత్తం డబ్బు కేటాయించబడలేదు.

## ప్రత్యామ్నాయ ప్రతిపాదనలు

అయితే హెడ్ వర్క్స్ నిర్మాణ ప్రదేశాన్ని నిర్ణయించడంలో కొన్ని ప్రత్యామ్నాయ ప్రతిపాదనలనుచేశారు. తత్ఫలితంగా 1955 సెప్టెంబరులో ప్రతిపాదించబడిన ప్రాజెక్టు పథకంలో స్వల్పంగా మార్పు జరిగింది. దానిని అనుసరించి కిష్టాపురం, కమీలాగూడలలో రెండు డామ్ లకు మారుగా పోచంపాడులో ఒకే డాము నిర్మించాలని 1956 జూన్ లో నివేదిక తయారుచేయబడింది పోచంపాడు రిజర్వాయరు ద్వారా కుడికాలువ నుండి మాత్రమే 16.2 లక్షల ఎకరాల నీటిపారుదలకు 257 శ.కో.ఘ.అ నీరు వినియోగించాలని తలపెట్టారు ఈ పథకం అమలుకు రూ. 67.35 కోట్లు ఖర్చు అవుతాయని అంచనావేశారు. పూర్వహైదరాబాదు రాష్ట్రపు రెండవ పంచవర్ష ప్రణాళికలో చేర్చడానికి వీలుగా సంపూర్ణ పథకంతో పాటు రూ.10.22 కోట్ల అంచనా ఖర్చుతో పోచంపాడు పథకం ప్రథమదశ పథకాన్ని కూడ పరిశీలన నిమిత్తం తయారుచేశారు. పోచంపాడు వద్ద 'వీర్' నూ, 47 మైళ్ళ పొడవున దక్షిణ కాల్వనూ నిర్మించడంద్వారా ఒక లక్ష ఎకరాలకు నీటి పారుదల కల్పించడం యీ పథకంలో చేర్చారు.

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ తర్వాత ఆంధ్ర,తెలంగాణా ప్రాంతాల ప్రణాళికలను చేర్చి ఆంధ్రప్రదేశ్ సమీకృత రెండవ పంచవర్ష ప్రణాళిక తయారుచేయబడింది. గోదావరి పథకం హైద్రాబాదు రాష్ట్ర రెండవ ప్రణాళికలో చేర్చబడినందున ఆంధ్రప్రదేశ్ రెండవ పంచవర్ష ప్రణాళికలో దానిని చేర్చలేదు.

## మహారాష్ట్ర అభ్యంతరం

అప్పటి హైదరాబాదు, లోగడ ప్రతిపాదించిన పథకం ప్రాతిపదికగా విస్తృత ప్రయోజనంతోను, పంటమార్పిడి విధానం అనుసరించి దక్షిణకాలువ క్రింద 18.56 లక్షల ఎకరాలకు, ఉత్తరకాలువ క్రింద 1.89 లక్షల ఎకరాలకు నీటిపారుదల సౌకర్యం లభింపజేయడానికి వీలుగా 1958-59లో పథకం తయారుచేశారు పోచంపాడు ప్రాజెక్టు నిమిత్తం పోచంపాడువద్ద నిక్కగాతం 66 శ.కో.ఘ. అడుగుల నీరు లభిస్తుంది ప్రాజెక్టుకు నికరంగా లభించే నీరు 257 శ.కో.ఘ. అడుగులు ఉంటుందని మదింపువేశారు. మహారాష్ట్ర రాష్ట్రం ఇంజనీర్లు పోచంపాడులో 379.3 శ.కో.ఘ అడుగుల నీరూ, ఎగువ ప్రాంతం ఉపయోగానికి 313.4 శ.కో.ఘ. అడుగుల నీరూ లభిస్తుందని అంచనా వేశారు. పోచంపాడు వరకు నేరుగా ఉండే నీటి ప్రవాహం 66 శ.కో.ఘ . అడుగులకు ఉంటుంది. మొత్తం 90 శ.కో.ఘ అడుగుల నీరు లభిస్తుంది. ఇందులో పోచంపాడువద్ద సరస్సువల్ల కలిగే 30 శ.కో.ఘ . అడుగుల నీటి నష్టాన్ని తీసివేస్తే కాలువ హెడ్స్ లలో ఉపయోగానికి 60 శ.కో.ఘ అడుగులనీరు లభిస్తుంది అనివారు అన్నారు ఈ దశలో లోగడ తయారు చేసిన పథకాన్ని సమర్థిస్తూనే 1959లో తక్షణ అవసరంగా మధ్యే మార్గంగా పోచంపాడు మళ్లింపు పథకాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వానికి అందజేసింది. అయితే భవిష్యత్ ప్రతిపాదనలు కూడా యిందులోచేర్చి పోచంపాడు ప్రాజెక్టు నీటిని అత్యధికంగా వినియోగించుకోడానికి వీలుగా యీపథకాన్ని తయారు చేశారు.

ఆర్థిక పరిస్థితుల కారణంగా యీ ప్రాజెక్టు నిర్మాణానికి అనుమతి లభించడంలో జాప్యం జరుగుతున్న దృష్ట్యా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఎన్నోసార్లు ప్రణాళికా సంఘం ఆర్థిక సలహాదారుని కలిసి, యీ విషయం గూర్చి పదేపదే చర్చించి, తెలంగాణామిగులు నిధుల నుండి ఖర్చుచేస్తామని సహితం నొక్కిచెప్పారు. అప్పటికి కూడా భారత ప్రభుత్వం నుండి అనుమతి లభించలేదు. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి అనుమతి లభించడానికి వీలుగా రాష్ట్రంలోని కొందరు ప్రముఖులు, శాసన సభ్యుల ప్రతినిధివర్గం కేంద్ర నీటిపారుదలశాఖ మంత్రిని, ప్రణాళికా సంఘాన్ని కలిశారు. ఇంత ప్రయత్నం చేసినప్పటికీ యీ పథకం అమలుకు అనుమతి లభించలేదు.

## అంతర్ రాష్ట్రీయ సమావేశం

1960లో అంతర్ రాష్ట్రీయ సమావేశం జరిగిన సందర్భంలో గోదావరి జలాలకు సంబంధించి 1951లో జరిగిన అంతర్ రాష్ట్రీయ ఒప్పందంలో కేటాయించిన నీటి విషయంలోను, నికరంగా లభించే నీటివిషయంలోను ఎగువ రాష్ట్రాలు వివాదాన్ని లేవనెత్తాయి. తత్కారణంగా అన్ని అంశాలను పరిశీలించి నివేదికయిచ్చే నిమిత్తం భారత ప్రభుత్వం, కృష్ణా-గోదావరి నదీజలాల పరిశీలక సంఘాన్ని నియమించింది. మూడు దశల పోచంపాడు ప్రాజెక్టుకు సంబంధించిన సవిస్తరమైన ప్రతిపాదనలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యీ కమీషన్ కు సమర్పించింది. ఈ ప్రతిపాదనలద్వారా సగటున వార్షికంగా 21,95,000 ఎకరాల నీటిపారుదల జరుగుతుంది. స్టోరేజీ పథకం క్రింద పోచంపాడు మొదటిదశలో 66 శ.కో.ఘ. అడుగుల నీరు ఉపయోగించవచ్చునని కృష్ణా-గోదావరి జలాల కమీషన్ సిఫార్సుచేసింది. తత్ఫలితంగా భారత ప్రభుత్వం మొదటి దశను మంజూరుచేసింది. 66 శ.కో.ఘ . అడుగుల స్టోరేజికి వీలుగాను, అవసరమైన పరిమాణం పెంపుదలకు వీలుగాను సవరించబడిన పోచంపాడు ప్రాజెక్టు నిర్మాణానికికూడ భారత ప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి అనుమతి యిచ్చింది. 112 శతకోటి ఘనపుటడుగుల నీటి నిలువకు వీలైన డామ్ నిర్మాణంపని జరుగుతున్నది. 1956 జూన్ లో పోచంపాడు ప్రాజెక్టు క్రింద నిర్దేశించిన 257 శ.కో.ఘ . అడుగుల నీటి ఉపయోగానికి వీలుగా యీ స్టోరేజి నిర్మించబడుతున్నది. దీనివల్ల ప్రస్తుత తెలంగాణా ఆందోళన సందర్భంగా కొన్ని వర్గాలు ఆరోపించినట్లు పోచంపాడు ప్రాజెక్టు పరిమాణాన్ని తగ్గించారనడం సరికాదని రుజువు అవుతుంది.

కాలువ త్రవ్వకంపని ప్రారంభించబడింది. ఇది ముమ్ముందు 8600 క్యూసెక్కుల నీటి ప్రవాహానికి అవకాశంఉండేవిధంగా 7530 క్యూసెక్కుల నీటిప్రవాహ శక్తి గలవిగా ఉంటాయి నీరు లభించే సక్షంలో పోచంపాడు రిజర్వాయరు నుండి మరోకాలువ త్రవ్వి రిజర్వాయరులోని నీటి ఉపయోగాన్ని పెంచవచ్చు. ***

# బ్యాంకుల జాతీయకరణ

ప్ర : జాతీయాకరణమంటే ఏమిటి ? అది ఎందుచేత అవసరం?

సమా : మొత్తంమీద ప్రజాహితాన్నికోరి. ఏదైనా సంస్థల యాజమాన్యాన్నీ నిర్వహణాధికారాలనూ ప్రభుత్వానికి దాఖలు పరచడమే జాతీయాకరణమంటే.

ప్ర : మిగిలిన దేశాలుకూడా ఇందుకు పూనుకున్నాయా?

సమా : ఇప్పుడు మన దృష్టిలో గల లక్ష్యాల వంటివి సాధించేందుకై చాలా దేశాలలో రెండవ ప్రపంచ యుద్ధంకాగానే ప్రజోపయోగకరమైన రైల్వేలు, విద్యుత్ సరఫరావంటి సేవావ్యవస్థలనూ; బొగ్గు, ఉక్కు పరిశ్రమలనూ జాతీయం చేశారు. అనేక దేశాలలో తంతి, తపాలా వ్యవస్థ, నౌకాశ్రయాలు, రేడియో వంటివి మొదటినుంచి ప్రభుత్వ యాజమాన్యాన, ప్రభుత్వం అదుపుక్రిందనే ఉంటున్నాయి. బెల్జియం ఫ్రాన్సు, స్వీడన్, స్పెయిన్ మరికొన్ని పశ్చిమ దేశాలలో బ్యాంకింగ్ పరిశ్రమకూడా ప్రభుత్వ యాజమాన్యం క్రిందకూ, అదుపాజ్ఞల క్రిందకూ వచ్చింది.

ప్ర : ఇతర దేశాలతో పోల్చినప్పుడు, భారత దేశంలో ప్రభుత్వ రంగాన పెడుతున్న ఖర్చుఎంత?

సమా : 1965 సంవత్సరంలో, తమ తమ మొత్తం జాతీయాదాయంలో అమెరికా 21 శాతమూ, జపాన్ 20 శాతమూ, స్వీడన్ 30.7 శాతమూ ప్రభుత్వరంగంకోసమై వెచ్చించి వుండగా, భారత దేశం 13.7 శాతం మాత్రమే ఖర్చుచేసి ఉంది. నేటికి కూడా కొన్ని అభివృద్ధిచెందిన దేశాలకంటె బాగా తక్కువగానే భారత దేశం ప్రభుత్వరంగం నిమిత్తమై ఖర్చుచేస్తున్నట్లు దీనివల్ల తెలుస్తున్నది,

ప్ర : భారతదేశంలో కొన్ని బ్యాంకులను జాతీయం చేయడానికి కారణం ఏమిటి?

సమా : మన ఆర్థిక వ్యవస్థలో కొన్ని ప్రధానమైన రంగాలలో అభివృద్ధి సాధించేందుకుగాను, బ్యాంకులద్వారా చాలినంత ఋణ సహాయం లభించటంలేదు. ఆరంగాలలో ప్రగతి సాధనకు సొమ్ములభ్యమయ్యేట్లు చూడడానికే మనదేశంలో కొన్ని బ్యాంకులను జాతీయంచేశారు.

ప్ర : భారత దేశంలో మొత్తం షెడ్యూల్డు బ్యాంకులు ఎన్ని ఉన్నాయి?

సమా : దేశంలో ఈనాడు 73 షెడ్యూల్డు బ్యాంకులు ఉన్నాయి. వివిధ వర్గాల ప్రజలకు చెందినసొమ్ము రూ. 4,600 కోట్ల వరకు ఈ బ్యాంకులలో డిపాజిట్ల రూపంలో ఉంది. ఇప్పుడు జాతీయం చేసిన 14 పెద్ద బ్యాంకులు, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా దాని అనుబంధ బ్యాంకులతో కలిపి, మొత్తం 73 బ్యాంకులలోని డిపాజిట్లలో 4/5 వంతులు ఉన్నాయి.

ప్ర : షెడ్యూల్డు బ్యాంకులకు ఎవరెవరి వద్దనుంచి డిపాజిట్లు లభిస్తాయి?

సమా : ప్రధానంగా సామాన్య ప్రజలనుంచి (వ్యక్తుల నుంచి) షెడ్యూల్డు బ్యాంకులకు డిపాజిట్లు లభిస్తాయి. 1967 మార్చి 31వ తేదీన డిపాజిట్ల రూపంలో బ్యాంకుల ఆధీనంలోఉన్న 3540 కోట్ల 90 లక్షల రూపాయలలోనూ 2012 కోట్ల 70 లక్షల (56.8 శాతం) వేర్వేరు వ్యక్తుల వద్దనుంచి లభించినవే. వారిశ్రామికులూ వ్యాపారస్థులూ, ఇతర పెట్టుబడిదారులనుంచి లభించినవి 804 కోట్ల 60 లక్షల రూపాయలు (25.3 శాతం) మాత్రమే. ఇక, ప్రభుత్వం, ప్రభుత్వ సంబంధమైన సంస్థలు, తదితరుల నుంచి లభించినవి రూ. 633 కోట్ల60 లక్షలు (17.9 శాతం).

డిపాజిట్ల మొత్తం సొమ్ములో సగానికిపైగా వ్యక్తుల నుంచి లభించినదే అయినా, ఈ సొమ్ములో అధిక భాగం వెనుకబడిన ప్రాంతాలనుఉపేక్షచేసి, పట్టణ ప్రాంతాలలోని వారికి ఋణ సహాయం కల్పించేందుకే వినియోగపడుతున్నది.

ప్ర : సామాజిక నియంత్రణకంటె జాతీయాకరణ ఏ విధంగా మెరుగు?

సమా : చిన్నచిన్న పెట్టుబడిదారులకూ, సన్నకారు రైతాంగానికీ ఇప్పట్లోకంటె మెరుగైన పరపతి సౌకర్యాలు కల్పించేట్లూ, అందుకు సంబంధించిన యోగ్యతలూ, సమర్థతా గలవారు ఈ బ్యాంకులను నిర్వహించేట్లూ, దేశంలో పరపతి సదుపాయాలు కల్పించే సంస్థల పైన పెదపెద్ద పారిశ్రామిక సంస్థల వారి అదుపాజ్ఞలు తొలిగిపోయేట్లూ చూడవలసిందిగా ప్రయివేటు యాజమాన్యానగల బ్యాంకులను ఆదేశించడానికై, సామాజిక నియంత్రణ విధానాన్ని తలపెట్టడమయింది.

అవసరం దృష్ట్యా అధికప్రాధాన్యంగల రంగాలకు అది

వర్గంకంటె ఎక్కువ ఋణ సహాయాన్ని కల్పించేందుకు ప్రయివేటు బ్యాంకులు ప్రయత్నాలు చేయకపోలేదు. అయితే, అయిదు లక్షల పైచిలుకు గ్రామాల్లో నివశిస్తున్న 7 కోట్లమంది రైతాంగానికీ, చిన్న చిన్న పెట్టుబడుదారులకూ చాలా పెద్ద ఎత్తున ఋణ సహాయం అవసరమవుతుంది. ఈ దృష్ట్యా పని చాలా మందకొడిగా మాత్రమే జరిగేందుకు వీలున్నది. ఇలాకాక, అభ్యుదయకరమైన పరపతి విధానాన్ని మరింత శీఘ్రగతిన అమలు పరిచేందుకు బ్యాంకుల జాతీయాకరణవల్ల అవకాశమేర్పడుతుంది. బ్యాంకింగ్ వృత్తిలో తగుయోగ్యతలూ, సమర్థతాగలవారు బ్యాంకుల నిర్వహణకు పూనుకునేట్లు చేయటం కూడా త్వరితగతిన సాగుతుంది. బ్యాంకులు ప్రభుత్వ యాజమాన్యం క్రిందకు రావటం మూలంగా, పరపతి విధానం పైన పెద్దపెద్ద పారిశ్రామిక సంస్థల వారి అదుపాజ్ఞలను చాలావరకు తొలగించడానికి వీలుకలుగుతుంది.

ప్ర : జాతీయం అయిన బ్యాంకులలో వ్యక్తులు దాచుకున్న సొమ్ము సురక్షితంగానే ఉంటుందా?

సమా: తప్పకుండా. నిజానికి, ప్రభుత్వ రక్షణ ఇప్పుడు లభిస్తుంది కనుక, ఆ సొమ్ము మరింత భద్రంగా ఉంటుంది.

ప్ర : బ్యాంకులను ఏ కొద్దిమంది వ్యాపారస్తులో తమ అదుపులో ఉంచుకోవటంవల్ల, మొత్తంమీద సమాజ శ్రేయస్సుకు ఏ విధంగా హానికలుగుతుంది?

సమా : చాలా విధాల జరుగుతుంది. ఉదాహరణకు

అ. ఆర్థిక వ్యవస్థ పని సాగించడంలో, పరపతి సౌకర్యాలకు ప్రముఖస్థానం ఉన్నది. బ్యాంకులు ఇచ్చే ఋణాలకు ప్రజలు పొదుపుచేసి దాచుకున్న సొమ్మే ఆధారం కనుక, ప్రజల్లో అన్నివర్గాలకూ ఆ ఋణ సహాయం అందుబాటులోనికి రావలసిన అగత్యం ఉన్నది.

ఆ. బ్యాంకులు ప్రయివేటు ఆసాముల అదుపాజ్ఞలలో ఉండటం వల్ల, ఈ బ్యాంకు డైరెక్టర్ల అధ్వర్యానగల పారిశ్రామిక సంస్థ ప్రయోజనానికై ఈ డిపాజిట్ల సొమ్మును మళ్లించే అవకాశం ఉన్నది. అలా జరుగుతూ వచ్చింది కూడ. 1962_63లో ప్రధానమైన 20 బ్యాంకులను గురించి డాక్టర్ రాజ్ కె. నిగమ్ జరిపిన పరిశీలన వల్ల, ఈ బ్యాంకులకు చెందిన 188గురు డైరెక్టరకు 1300 ఇతర కంపెనీలపై పెత్తనం ఉన్నట్లు తేలింది.

ఇ. ఈ బ్యాంకుల నిధులను, డైరెక్టర్లూ, వారితోటివారూ, స్పెక్యులేషన్ కోసమూ, సరుకు దాచిపెట్టడానికీ, సరుకు విలువలు వాడకానికి విడుదలకాకుండా అరికట్టడానికీ కొన్ని సమయాలలో ఉపయోగిస్తూ ఉండేవారు.

ఈ. ఋణాలిచ్చే సందర్భంలో, బ్యాంకులు సామాన్య ప్రజలకు అత్యవసరమైన సరుకులూ, వస్తువులకంటె, అత్యవసరమనిపించుకొనే విలాసవస్తువులపట్లనే కొన్నిసమయాలలో మొగ్గుచూపుతూండేవి.

ఉ. డిపాజిట్ల రూపేణా సొమ్ము పట్టణాలనుంచి, గ్రామాలనుంచి కూడా లభిస్తున్నప్పటికీ, బ్యాంకుల బ్రాంచీలను పెద్ద పెద్ద పట్టణాలలోనే తప్ప పల్లెప్రాంతాలలో ఏర్పాటుచేస్తూ ఉండేవారుకాదు.

ఊ. మన జాతీయాదాయంలో సగానికిసగం వ్యవసాయంద్వారా లభిస్తూనేఉన్నా, ఆ రంగంకోసం బహుస్వల్పంగా మాత్రమే పెట్టుబడి లభిస్తూ ఉండేది. వ్యవసాయ దారులకు. 2,300 కోట్ల మేరకు ఋణాలు కావలసి ఉండగా సహకార బ్యాంకులు 400కోట్ల రూపాయలను సమకూర్చాయి

ప్ర : బ్యాంకులుజాతీయం చేయడంమూలాన, ఇప్పటి పరిశ్రమలకు వ్యాపార సంస్థలకు సొమ్ము లభించకుండాపోయే అవకాశమున్నదా?

సమా :ఇప్పటిపరిశ్రమలకూ,వ్యాపార సంస్థలకుగల న్యాయమైనఅవసరాలు ఇకముందు కూడా తీరుతూనే ఉంటాయి. జూలై 21వతేదీన ఈ విషయమై వచ్చిన విమర్శకు సమాధానమిస్తూ ప్రధానమంత్రి,"బ్యాంకులను జాతీయం చేసిన తర్వాతకూడా ప్రయివేటు రంగంలో పెద్ద, చిన్న పరిశ్రమల వారికీ, వ్యాపారస్తులకూ గల న్యాయమైన పరపతి అవసరాలు తీరగలవని మరొకసారిహామీ ఇస్తున్నాను. మన ఆర్థికవ్యవస్థలో వస్తూత్పత్తి జరిగే విభాగాలకు, అందులోనూ ముఖ్యంగా రైతాంగానికీ,లఘుపరిశ్రమల వారికీ స్వయంగా ఆయా వృత్తులను చేసుకునే వారికీ గల అవసరాలను తీర్చేందుకు అంతకుహెచ్చు స్థాయిన ఋణ సహాయం కల్పించేందుకు మేము పాటుపడుతూ ఉండగలము" అన్నారు.

ప్ర : బ్యాంకులను జాతీయం చేయటం వల్ల, సొమ్ము దాచుకున్న వారికి, అక్కడ లభించే సేవా సదుపాయాల స్థాయి పడిపోతుందా?

సమా : ఉన్నత స్థాయిన వంశ పారంపర్యంగా కొందరెవరో బ్యాంకులపై నిర్వహణాధికారాలను చెలాయించడంపోయి వృత్తిపరంగా యోగ్యత,సమర్థతగల వారు యాజమాన్యాన్ని చేపట్టేట్టు చూడడానికి, జాతీయాకరణద్వారా సంకల్పించడమయింది మేనేజర్లూ. పర్యవేక్షక సిబ్బందితో సహా, ఈ బ్యాంకు ఉద్యోగులందరూ ఇకముందుకూడా పనుల్లో ఉంటారు. జాతీయాకరణవల్ల మనస్ఫూర్తిగా హర్షం ప్రకటించటంద్వారా, బ్యాంకు ఉద్యోగుల సంఘాలు, తమ తమ విధులను మరింత దక్షతతో సమర్థవంతంగా నిర్వర్తించగలమని సమాజానికి హామీ ఇచ్చారు. బ్యాంకుల నిర్వహణలో ఉద్యోగులకు, చట్టబద్ధంగా ప్రమేయం కల్పించటం ద్వారా వారు మరింత ఉత్సాహంతో, దీక్షతో, డిపాజిట్టదార్లకు సేవచేసేందుకు అవకాశమేర్పడుతుంది. గతంలో జరిగిన పొరపాట్లను గమనించి గుణపాఠం నేర్చుకోవటం

(తరువాయి 43వ పుటలో)

# సిరిసిల్ల తాలూకాలో | గ్రామీణ సహకార విద్యుత్ పథకం

—సి. హెచ్. రాజలింగం

గ్రామీణప్రాంతాల్లో వ్యవసాయసంబంధమైన అవసరాలకు విద్యుచ్ఛక్తి వినియోగాన్ని అధికంచేసే లక్ష్యంతో భారత, అమెరికా దేశాలమధ్య ఒక ఒప్పందం జరిగింది. దీని ప్రకారం పి. ఎల్. 480 నిధుల నుండి భారత దేశానికి అమెరికా 105 కోట్ల రూపాయల ఆర్థిక సహాయాన్నిస్తున్నది. ఈ మొత్తాన్ని భారత దేశంలోగల ఆయా రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డులు చేపట్టే సహకార సంస్థలకు పంపిణీచేయడం జరుగుతుంది. వీటిని ప్రయోగాత్మక సహకార సంస్థలుగా పిలుస్తారు. భారత దేశంలోని అయిదు రాష్ట్రాలలోగల అయిదు తాలూకా కేంద్రాలలో గ్రామీణ సహకార విద్యుచ్ఛక్తి పథకాలు ప్రయోగాత్మకంగా నెలకొల్పాలని ఉద్దేశించారు.

ఆంధ్రప్రదేశ్‌లోని కరీంనగర్ జిల్లాలోగల సిరిసిల్ల తాలూకా యీ ప్రాంతాలలో ఒకటి. ఇది అనువైన ప్రాంతమని యీ జిల్లా చేసిన సూచన పురస్కరించుకొని అమెరికా విద్యుచ్ఛక్తి సహకార విషయాల నిపుణులైన పాల్ రిచర్డ్ నాయకత్వంలో భారత ప్రభుత్వ కేంద్ర నీటి పారువల, విద్యుచ్ఛక్తి శాఖ అధికారులు యీప్రాంతాన్ని పర్యవేక్షించి, భూగర్భ జల పరిశోధకుల అభిప్రాయాలను కూడా తెలుసుకొని చివరకు యీ ప్రాంతం చాలా అనువైనదిగా నిర్ణయించడం జరిగింది.

ఇందుకు సంబంధించిన ప్రాథమిక నిర్మాణ కార్యక్రమాలు అమలు జరిపే నిమిత్తం భారత, అమెరికా అధికారులు ఒక ఒప్పందం మీద సంతకాలు చేశారు. భారత ప్రభుత్వ నీటి పారుదల మంత్రిత్వశాఖ కార్యదర్శి శ్రీ కె. పి. మాత్రాని అమెరికా సహాయ సంస్థ స్థానిక అధికారి డా॥ ఆర్. ఒ. ఆల్టన్‌లు దీనిపై సంతకాలు చేశారు.

గ్రామీణ సహకార విద్యుత్ సంస్థల ఏర్పాటు చాలా అవసరం. గ్రామీణప్రాంతాలకు విద్యుత్ సరఫరా చేసి వ్యవసాయ రంగంలో ఆధునిక పద్ధతులను ప్రవేశ పెట్టి తద్వారా అధిక వ్యవసాయోత్పత్తిని సాధించడంలో యీ గ్రామీణ సహకార విద్యుత్ సంస్థలు ప్రధానపాత్రవహిస్తాయి. గొట్టపు బావులద్వారా భూగర్భజలాలను వినియోగించుకోవడానికి విద్యుచ్ఛక్తి అవసరం ఎంతయినా వుంది. సహకార విద్యుత్ సంస్థల వల్ల మూలమూల గ్రామాలకు సైతం విద్యుచ్ఛక్తిని లభింప జేయవచ్చును.

జిల్లా విద్యుచ్ఛక్తి శాఖ అసిస్టెంట్ ఇంజనీరు శ్రీ శేషావతారం, సిరిసిల్ల సహకార విద్యుత్ సంస్థ తరపున అమెరికాలో మూడుమాసాల శిక్షణపొందేందుకు వెళ్ళారు. అక్కడ సహకార విద్యుచ్ఛక్తికి సంబంధించిన అనేక అంశాలను అధ్యయనం చేశారు.

2 కోట్ల 90 లక్షల రూపాయల ఖర్చుతో సిరిసిల్ల, బోయినపల్లి, మల్లారం, నిమ్మపల్లి, ఎల్లారెడ్డిపేట, వంతడుపులలో ఆరు సబ్ స్టేషనులు ఏర్పాటు చేసి, 12,000 సేద్యపు నీటి బావులకు విద్యుచ్ఛక్తి మోటారులను అమర్చి తద్వారా నాలుగు లక్షల అరవై రెండు వేల ఎకరాలకు సేద్యపు నీటి సౌకర్యం కల్పించాలని యీ పథకంలో ఉద్దేశించారు. రెండేళ్ళలో దీని నిర్మాణం పూర్తి కాగలదని అంచనా. పదేళ్ళ తర్వాత యీసంస్థకు ఏటా పదమూడు లక్షల రూపాయల చొప్పున ఆదాయం లభిస్తుంది.

అధిక సంఖ్యలో రైతులు ముందుకు వచ్చి యీ సహకార విద్యుత్ సంస్థలో సభ్యులుగా చేరి 5 లక్షల రూపాయల వాటా ధనాన్ని సమకూర్చితే, రాష్ట్ర ప్రభుత్వం 15 లక్షల రూపాయల పెట్టుబడి పెడుతుంది. కేంద్ర గ్రామీణ విద్యుత్ సహకార కార్పొరేషను ద్వారా యీ పథకానికి 2 కోట్ల 90 లక్షల రూపాయలు లభిస్తాయి.



# కర్నూలు జిల్లా కృషి శేఖరుడు

**బి. మోహన్ కుమార్**

ఆంధ్రప్రదేశ్ దక్షిణాది ధాన్యాగారంగా ఎందువల్ల ప్రసిద్ధికెక్కింది?

ఎందువల్లనంటే రాష్ట్రంలోని రైతు సోదరులందరూ తమ తమ భూముల్లో విస్తారంగా పంటను పండిస్తున్నారు గనుక.

కర్నూలు జిల్లాలోని అగ్రహారం గ్రామనివాసి శ్రీ వి. సి. వీరారెడ్డి ఆదర్శగాథ ఆ పరిసరాలలోని అనేక రైతులకు ఉత్తేజాన్నీ, ఉత్సాహాన్నీ, ప్రోత్సాహాన్నీ కలిగించింది. వ్యవసాయ పద్ధతులను పునర్వ్యవస్థీకరించి అనుసరించే శ్రీ వీరారెడ్డి మార్గం అనేకులకు అనుసరణీయమై ప్రయోజనకారకమైంది.

శ్రీ వీరారెడ్డి విజయగాథ రైతుసోదరులంతా తెలుసుకోదగ్గది. ఆయన మూడు ఎకరాల పొలంలో వేరుశెనగ విత్తులను నాటి 4964 కిలో గ్రాములవచ్చి వేరుశెనగ కాయ దిగుబడినిసాధించి, అధిక దిగుబడిని సాధించినందుకు బహుమతినికూడా పొందాడు

శ్రీ వీరారెడ్డిగారు తన స్వంతపొలంలో మూడు ఎకరాలను ఎంచుకుని, దానినిబాగా దున్నారు, క్రిందమట్టిపైకీ, పైమట్టి క్రిందకూ వచ్చేలాగా దున్నడంవల్ల ఎరువులను వేయగానే నేలలో అది బాగాకలిసి సారవంతమైంది. ఆధునిక వ్యవసాయ పద్ధతులను ఆయన అనుసరించారు. గ్రోమోర్ అమోనియం ఫాస్ఫేటు 225 కిలోగ్రాములు, కోరమాండల్ యూరియా 100 కిలోగ్రాములు, సూపర్‌ఫాస్ఫేటు 300 కిలోగ్రాములు వేశారు. ఈ మూడు చాలా శక్తివంతమైన రసాయనిక ఎరువులే. పొటాష్‌ను కూడా రెండుసార్లు వేసారు. మొక్కలమీద యితర రసాయనిక ఎరువులను సైతం చల్లించారు. ఎరువులను ఎప్పుడెప్పుడు వేయాలో తూచా తప్పకుండా ఆయన అనుసరించారు. అందువ వేరుశెనగ విత్తులు నాటిన కొద్దికాలానికే మొలకలువచ్చి శీఘ్రంగానూ, దట్టంగానూ పెరగడం ప్రారంభించాయి.

పంటచక్కగా పెరగడంచూసి శ్రీ రెడ్డిగారు దానికి ఏవిధమైన పురుగుగాని, చీడగాని పట్టకుండా అత్యంతశ్రద్ధ వహించారు. కాండంతొలిచే పురుగులు మొదలైనవాటినుంచి పంటను రక్షించే సకలచర్యలూ ఆయన అత్యంత జాగ్రత్తతో తీసుకున్నారు. క్రిమిసంహారకాలను చల్లారు.

పంట దిగుబడికి మూడు వారాలముందు కూడా క్రిమి సంహారకాలను చల్లారు. చుట్టుప్రక్కల చీడపట్టిన మొక్కలనుంచిగానీ పురుగుపట్టిన మొక్కలనుంచిగానీ యీ పంటకు ఎలాటి దెబ్బ తగులకుండా యీ చర్యతీసుకున్నారు. ఇంతశ్రద్ధగా వీరుతీసుకున్న యీ చర్యలవల్లా, పడినశ్రమవల్లా చేసినకృషికితగ్గ ఫలితం వచ్చింది. వ్యవసాయ రంగంలోనే అద్భుతమైన విజయాన్ని సాధించారు. వేరుశెనగ దిగుబడిలో రాష్ట్ర స్థాయికి రెట్టింపు దిగుబడిని ఆయన సాధించారు

నిజానికి వేరుశెనగ దిగుబడిలో అఖిలభారత స్థాయిలోనే ఒక క్రొత్త ప్రమాణాన్ని నెలకొల్పారు. ఆయన వందలకొలది సంవత్సరాలుగా వస్తోన్న పాతకాలపు పద్ధతులను విడిచి, ఆధునిక వ్యవసాయ పద్ధతులను ఒకక్రమపద్ధతిలో అనుసరిస్తే పంట దిగుబడిని రెండింతలు చేయవచ్చని వీరారెడ్డిగారు నిరూపించారు. పంట దిగుబడి సమృద్ధిగా చేతివిందుగా లభింప జేసుకోవడం అసాధ్యమేమీకాదు. శాస్త్రీయ పద్ధతులద్వారా యిది సాధ్యమే అని చెప్పడానికి యిదే చక్కటి నిదర్శనం. ఎందుకంటే వ్యవసాయం ఎప్పుడూ వాతావరణం మీదా, నేలమీదా, నీరు, డ్రైనేజి, యితర సౌకర్యాలమీదా స్థానిక స్థితిగతులమీదా, అన్నిటికన్నా ముఖ్యంగా ఎరువులమీదా ఆధారపడివుంటుంది. ఇవన్నీ సక్రమంగా వుండి, ఆధునిక వ్యవసాయ పద్ధతుల ద్వారా పంట పండించడానికి పూనుకుంటే ఆశ్చర్యకరమైన విజయాలను సాధించవచ్చు. రైతు పడ్డ శ్రమకుతగ్గ ఫలితాన్ని నిర్ణయించేవి యివే.

వీరారెడ్డిగారు సాధించిన యీ విజయం అనేకులకు మార్గదర్శకమైంది. ఎందరో యీ పరిసర రైతులు శ్రీ రెడ్డిగారి మార్గాన్ని అనుసరిస్తున్నారు. ఆయన చెప్పిన దాంట్లో అబద్ధమేమీ లేదని స్వానుభావంతో తెలుసుకున్నారు. అందుకే వారు ఆయనను కర్నూలుజిల్లా కృషిశేఖరుడు అని పిలుచుకుంటున్నారు.

**ఆధునిక వ్యవసాయ పద్ధతులద్వారా అధికోత్పత్తిని సాధించండి**

## 50 యేళ్ళ చరిత్రను సృష్టించిన

# పౌష్టికాహార పరిశోధనాగారం

టి. రాజగోపాలన్

హైదరాబాదు పురాతన ప్రాభవాన్ని చాటిచెప్పే అనేక కట్టడాల మధ్య ఆధునిక నిర్మాణాలు ఎన్నో యిటీవల తలెత్తుతున్నాయి. చారిత్రిక శిథిలాలమధ్య తొంగిచూసే ఆధునిక ప్రగతి మందిరాలు హైదరాబాదు స్వరూప స్వభావాలనే మార్చివేస్తున్నాయి. అటువంటి ఆధునిక ప్రగతి మందిరాల్లో పౌష్టికాహార పరిశోధనాగారం ఒకటి. యాభై ఏళ్లుగా ప్రయోజనాత్మకమైన సేవచేసిన యీ పరిశోధనాగారం యిప్పుడు స్వర్ణోత్సవాన్ని జరుపుకోబోతున్నది.

పౌష్టికాహార పరిశోధనాగారం ఒక స్వతంత్రవ్యవస్థ. భారత ప్రభుత్వ ఆరోగ్య మంత్రిత్వ శాఖకుచెందిన ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిసర్చ్ అజమాయిషీ క్రింద ఈ పరిశోధనాగారం పనిచేస్తుంది. ఇది 1918లో తమిళనాడులోని నీలగిరి జిల్లాలోగల కూనూరుపద్ద నెలకొల్పబడి అటుపిమ్మట 1959లో హైదరాబాదుకు మార్చబడింది. ఆదిలో ఒకే ఒక శాస్త్రవేత్తతో రెండు గదుల చిన్న ఇంటిలో ప్రారంభించబడిన యీ పరిశోధనాగారం యిప్పుడు అనేకమంది శాస్త్రవేత్తలతో అత్యంతాధునిక పరికరాలతో భారత దేశంలోని అత్యుత్తమ పరిశోధనాగారాలలో ఒకటిగా రూపొందింది.

మన దేశం ఆర్థికంగానేగాక ఆరోగ్యవిషయంలో కూడా బాగా వెనుక బడివుంది. సాంకేతికంగా అభివృద్ధి చెందిన అమెరికా, ఇంగ్లాండు మొదలైన దేశాలలో యిటువంటి పరిస్థితులు కనిపించవు. అక్కడ అనేకరకాల రోగాలను—ముఖ్యంగా పౌష్టికాహార లోపంవల్ల వచ్చే వ్యాధులను—ప్రజలనుంచి దూరంగా తరిమివేయడం జరిగింది. మన దేశప్రజలలో పౌష్టికాహారలోపం వల్ల వచ్చే వ్యాధులు ఎక్కువగా వున్నాయంటే అందుకు ప్రధాన కారణం మన దారిద్రమే.

పౌష్టికాహారలోపంవల్ల వచ్చే వ్యాధులను గురించి పౌష్టికాహార పరిశోధనాగారం తీవ్రంగా పరిశోధనలు కొనసాగిస్తున్నది. ఈ వ్యాధులు రావడానికిగల కారణాలేమిటో పరిశోధించి, వాటిని అరికట్టడానికి తీసుకోవలసిన పద్ధతులను యిక్కడ కనిపెట్టడం జరుగుతున్నది.

ఈ పరిశోధనాగారం ఎనిమిది విభాగాలుగావుంది. 1. క్లినికల్ స్టడీస్ విభాగం. 2. స్టాటిస్టిక్స్, ఆంత్రపాలజీలతో సహా క్షేత్ర పరిశీలనా విభాగం. 3. మైక్రో బయాలజీ, ఫుడ్ లేబరేటరీలతో సహా ఎనలెటికల్ కెమిస్ట్రీ విభాగం. 4. బయోకెమిస్ట్రీ. 5. ఐసోటోప్ యూనిట్‌తో సహా బయోఫిజిక్స్. 6. హ్యూమన్ మెటాబాలిజం యూనిట్. 7. పేథాలజీ విభాగం. 8. శిక్షణ విస్తరణ విభాగం.

ఈ పరిశోధనాగారంలో బయోకెమిస్టులు, ఆంత్రపాలజీస్టులు, ఫిజియాలజిస్టులు, సాంఘిక కార్యకర్తలు, స్టేటిస్టిషియన్లు మొదలయినవారు మొత్తం ఓ ఆరవైమంది సిబ్బంది పనిచేస్తున్నారు. వైద్య పరిశోధనకు సంబంధించిన భారతీయ మండలి; శాస్త్రీయ, పారిశ్రామిక పరిశోధనకు సంబంధించిన భారతీయ మండలి, తదితర సంస్థలు ఫెలోషిప్పులు పొందిన శాస్త్రవేత్తలు, సాంకేతిక వేత్తలుకూడా యిక్కడ పనిచేస్తూ యీ పరిశోధనాగారం చేసే పరిశీలనల్లోనూ, పరిశోధనల్లోనూ ఎంతగానో తోడ్పడుతున్నారు.

## క్షేత్ర పరిశోధనలు

జంటనగరాల పరిసరాలలోగల వివిధగ్రామీణ కేంద్రాల్లో ఎప్పటికప్పుడు యీ పరిశోధనాగారం క్షేత్ర పరిశోధనలను నిర్వహిస్తుంది. ఇక్కడి ఆహారపు అలవాట్లు, ప్రజల ఆహారంలోని లోటుపాట్లు మొదలైన పరిశీలనలు జరిపి పౌష్టికాహార లోపంవల్ల వచ్చే జబ్బులను అనేకమైన వాటిని నిరోధించే చర్యలుతీసుకున్నది. ఈ పరిశోధనాగారంలో దగ్గర దగ్గర ఎనిమిది వందల భారతీయ ఆహార పదార్థాలను, వాటిపౌష్టికాహార విలువలను గూర్చి క్షుణ్ణంగా పరిశోధనలు జరిగాయి. వ్యవసాయ పరిశోధనకు సంబంధించిన భారతీయ మండలి యిక్కడ ఒక విభాగాన్ని నెలకొల్పింది. ఈ విభాగంలో కొత్తగా కనుగొంటున్న అధిక దిగుబడినిచ్చే వంగడాలను, వాటి ఆహారపు విలువలను గూర్చి పరిశోధనలు కొనసాగుతుంటాయి. ఇంతవరకు అయిదువందలకు పైగా అధికదిగుబడి నిచ్చే వంగడాలను పరిశోధించి ఎవి ఏ ఏ ప్రాంతాలకు అనువైనవో, వేటిలో ఏ ఏ విటమినులు ఏ ఏ నిష్పత్తులలో వున్నవో, పౌష్టికాహార విలువలు వేటిలో అధికంగా వున్నవో మొదలైన వాటిని నిర్ణయించి ప్రకటించడం జరిగింది.



హైదరాబాదులోని పౌష్టికాహార పరిశోధనాగార భవనం

ప్రోటీన్ కాలరీలు లోపించినందువల్లా, 'ఎ' విటమిను లోపించినందువల్లా వచ్చే రోగాలకు సంబంధించి: ఫోరోసిస్, లథీరిజం, అనామియ (రక్తహీనత) రోగాలకు సంబంధించి యిక్కడ క్షుణ్ణంగా పరిశీలనలు ప్రయోగాలు, జరుగుతుంటాయి.

## ప్రోటీన్ కాలరీలోపం

మనదేశంలో చిన్నపిల్లల ఆహారంలో ఈ లోపం ప్రధాన సమస్యగా వుంటున్నది. మన శరీరంలోని రక్తకణాలలోని మాంసకృత్తులు ఎప్పటికప్పుడు అరిగిపోతుంటాయి గనుక ఎప్పటికప్పుడు అరిగిపోయినవాటి బదులు కొత్తవాటిని శరీరానికి అందజేస్తూవుండాలి. మాంసకృత్తులలో నత్రజని, గంధకము ప్రధాన మూలకాలు. మనం తీసుకునే కార్బోహైడ్రేటులూ, క్రొవ్వు పదార్థాలూ శరీరానికి శక్తిని సమకూరుస్తాయిగాని వాటిలో నత్రజని, గంధకము వుండవు. అయితే ఆహారంలోని కార్బోహైడ్రేటుల వల్ల శరీరానికి క్రొవ్వు సమకూరుతుంది. ఈ కార్బోహైడ్రేటులు మాంసకృత్తుల వల్ల లభిస్తాయి. శరీరంలోని రక్తకణాలలోని మాంసకృత్తులు ఏర్పడాలంటే, అరిగిపోయినవి తిరిగి పూడుకోవాలంటే మనం తీసుకునే ఆహారంలో మాంసకృత్తులు వుండాలి.

మనదేశంలో ఆహారంలోవుండే లోపాలల్లో ప్రధానమైనది మాంసకృత్తుల లోపం. ఈ లోపం వల్ల చిన్నపిల్లలలో తలనెరిసిపోవడం, రాలిపోవడం, బుద్ధిమాంద్యం, పెరుగుదల ఆగిపోవడం వంటివి సంభవిస్తాయి. తల్లిపాలుతాగే చంటిపాప, ఒకవేళ తల్లి మరణంవల్లగానీ, లేక తమ్ముడో, చెల్లాయో పుట్టడంవల్లగానీ తల్లి పాలకు బదులు అన్నం జావ మొదలైనవి తినవలసివస్తే అది పాప పెరుగుదలకు ప్రతిబంధకమౌతుంది.

మాంసకృత్తులు లోపించిన ఆహారం ఒకటి–అయిదు సంవత్సరాల మధ్య పిల్లలమీద బాగా దెబ్బతీస్తుంది. రోగనిరోధక శక్తి క్షీణింపజేసి ముందు ముందు వారి జీవితాన్నే దుఃఖభాజకం చేస్తుంది.

మాంసకృత్తులు లోపించిన ఆహారానికి సంబంధించి పౌష్టికాహార పరిశోధనాగారం వారు పరిశోధనలు చేయడమేగాక మానసిక స్థితిగతులమీద దీని ప్రభావం ఏమిటో యిప్పుడు పరిశీలనలు చేస్తున్నారు. మాంసకృత్తులవల్ల శరీరం పెరగడమేగాక మానసిక దార్ఢ్యం, జ్ఞాపకశక్తి వికాసానికికూడా అవకాశం ఏర్పడుతుందని ఈ ప్రయోగశాలల్లో శాస్త్రవేత్తలు చేసిన పరిశోధనలు ఋజువు చేస్తున్నాయి.

మన ప్రజలలో అధిక సంఖ్యాకులు గ్రామప్రాంతాలలోనే వుంటున్నారుగనుక, స్థానికంగా పండించే ఆహార పదార్థాలతోనే పౌష్టికాహారాన్ని సమకూర్చుకోవడం ఎట్లాగో గ్రామీణులకు తెలియజెప్పితే యీ సమస్య చాల వరకు పరిష్కరింపబడుతుంది. స్థానిక రకాలను ఏవి ఏవి పాళ్ళలో సమకూర్చితే పౌష్టికాహారం అవుతుందో గ్రామీణులు తెలుసుకోవడం చాల అవసరం. ఆయా ఆహారధాన్యాల పౌష్టికాహార విలువలను గూర్చి కూడా వారికి కొంత తెలిసివుండాలి.

ఈ విషయాలన్నీ దృష్టిలో పెట్టుకుని వ్యవసాయ పరిశోధనకు సంబంధించిన భారతీయ మండలి పౌష్టికాహార పరిశోధనాగారంలో ఒక విభాగాన్ని ఏర్పాటుచేసింది. ఈ విభాగంలో వివిధ సంకరజాతి ఆహారధాన్యాల పౌషికాహార విలువలను పరిశోధించి కనుగొంటారు. ఇంతవరకు 132రకాల జొన్నలు, 50 రకాల





పరిశీలన జరుపుతున్న ఒక డాక్టరు

గోధుమలు, 55 రకాల మొక్కజొన్నలు, 19 రకాల సజ్జలు, 3 రకాల ధాన్యాలను పరిశోధించి, వాటి పౌష్టికాహార విలువలను తెలుసుకోవడం జరిగింది. వీటిలో మాంసకృత్తులు, అమినో ఆసిడ్ ఏఏ పాళ్ళలో వున్నవో గుర్తించి ప్రకటించడం జరిగింది.

## 'ఎ' విటమిన్ లోపం

మన బీద ప్రజానీకంలో దాదాపు పది శాతం మందిలో 'ఎ' విటమిను లోపించినందువల్ల వచ్చే వ్యాధిలక్షణాలు కనిపిస్తాయి. 'కెరటొమాలాసియా' అనే వ్యాధికి తరచు వారు గురి కావడంకద్దు. దీనివల్ల అంధత్వం ప్రాప్తిస్తుంది. ఈ వ్యాధి వల్ల గుడ్డివారైన పిల్లలసంఖ్య విపరీతంగా వుంది. ఈ వ్యాధినుంచి పిల్లలను రక్షించాలంటే వారి ఆహారంలో "ఎ" విటమిను లోపించకుండా చూడడం చాలా అవసరం. పిల్లల ఆహారంలో ఆకుకూరలను చేర్చితే యీ వ్యాధి రాకుండా వారిని రక్షించిన వారమౌతాము. ఇందుకు పౌష్టికాహార పరిజ్ఞానం పెద్దలకు వుండాలి.

'ఎ' విటమిను మిగతా విటమినులకన్న ఎక్కువ కాలం శరీరంలో భద్రపరచబడుతుంది. అందువల్ల సంవత్సరానికి ఒకసారి కొంత ప్రమాణంలో 'ఎ' విటమిను యిస్తే అది ఆ ఏడాది పొడుగునా అతనికి ఉపయోగిస్తుంది. అయితే యీ యిచ్చే ప్రమాణం మరీ ఎక్కువగా వుండకూడదు. మరీ తక్కువగానూ వుండకూడదు. ఎక్కువయితే వంటికే ప్రమాదాన్ని తేవచ్చు. తక్కువయితే రోగ నిరోధానికి ఏడాదికి తగినంతగా వుండకపోవచ్చు. అందుకని యీ ప్రమాణాన్ని నిర్ణయించేందుకు కొందరు పిల్లలను తీసుకొని "ఇంటెన్సివ్ పైలట్ పరిశీలనా కార్యక్రమం" అమలు జరిపించారు. తదనుగుణంగా ఎ విటమిను 3,00,000 ఐ యు ప్రమాణం ఒక ఏడాదికి కావాలని నిర్ణయించారు. అయితే మరింత విస్తృతంగా యీ పరిశీలన సాగించాలని భావించి జంటనగరాల పరిసరాలలోని గ్రామాలలో 1-3 సంవత్సరాల మధ్యగల 2500 మందిపై యీ పరిశీలన కొనసాగించడం జరిగింది. వీరందరికీ ఏడాదికి ఒకసారి 3,00,000 ఐ. యు ప్రమాణం చొప్పున 'ఎ' విటమిను యిచ్చి ఎప్పటికప్పుడు వారిని పరిశీలించడం జరుగుతున్నది. నాలుగేళ్ల యిది కొనసాగింది దీనివల్ల 'ఎ' విటమిను లోపంవల్ల సంభవించే వ్యాధులు బాగా తగ్గిపోయాయి. 'ఎ' విటమిను లోపంవల్ల వచ్చే వ్యాధులను నిరోధించడానికి యిది ఒక మార్గంగా లభించింది. పెద్దమొత్తంలో 3,00,000 ఐ. యు చొప్పున ఏడాదికి ఒక్కసారి ఎ విటమిను యివ్వడం కన్న ఆరేళ్ళకు ఒకసారి 2,00 000 ఐ. యు పరిమాణం చొప్పున యివ్వడం మంచిదని పౌష్టికాహార పరిశోధనాగారం అభిప్రాయపడింది. ఈ పథకం ప్రాముఖ్యాన్ని భారత ప్రభుత్వం ప్రణాళికా సంఘం గుర్తించి అనేక రాష్ట్రాలలో పిల్లలకు ఎ విటమినును అందజేసే కార్యక్రమాన్ని చతుర్థ ప్రణాళికలో చేర్చింది.

ఈ పరిశోధనాగారం డైరెక్టరు డా॥ సి. గోపాలన్ భారత దేశంలో ప్రముఖ శాస్త్రవేత్తలలో ఒకరు. వీరి అజమాయిషీ క్రింద యీ పౌష్టికాహార పరిశోధనాగారం ఎన్నో ప్రయోజనాత్మకమైన, నిర్మాణాత్మకమైన కార్యక్రమాలుచేపట్టి ఆరోగ్య, ఆహార రంగాలలో అమోఘమైన విజయాలను సాధిస్తున్నది.

హారానికి సంబంధించి 'మాలలోని పిల్లలపై న్న పరిశీలన



ష్టికాహార పరిశోధగారంలో పరిశోధన జరుపుతున్న ఒక శాస్త్రవేత్త

శిక్షణ కార్యక్రమాలు :_ ప్రపంచ ఆరోగ్య సంస్థ, యునెసెఫ్‌ల సహకారంతో యిక్కడ ఏడాది సర్టిఫికెటు కోర్సు నొకదానిని జరిపిస్తున్నారు. దీనికి తోడు ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అనుబంధంగా యిక్కడ ఎం. ఎస్. సి (అప్లయిడ్ న్యూట్రీషన్) కోర్సుకూడా వుంది. ఆఫ్ఘనిస్థాన్, నేపాల్, ఫిలిప్పైన్స్, కొరియా ఫిజీదీవులు, ఇండొనేషియా, థాయిలాండ్, సిలోన్ వంటి తూర్పు ఆసియా దేశాలకు చెందినవారు వందమంది యిక్కడ శిక్షణ పొందారు.

ప్రచురణలు, గ్రంథాలయము :_ పౌష్టికాహారం మీద ఈ పరిశోధనాగారం అనేక ప్రయోజనాత్మకమైన ప్రచురణలను తీసుకొచ్చింది. "న్యూట్రీషన్" పేరుతో మూడు నెలలకు ఒకసారి పౌష్టికాహారం, పరిశోధనలకు సంబంధించిన వివిధ విషయాలతో మేగజైనుకూడా ప్రచురింప బడుతున్నది. సామాన్యునికి కూడా పౌష్టికాహార విషయాలు అర్థమయ్యేటట్టు ఆయా అంశాలపై విపులంగా ప్రసిద్ధుల వ్యాసాలు యిందులో వుంటాయి.

పౌష్టికాహారానికి, తత్సంబంధమైన యితర అంశాలకు సంబందించి యిక్కడి గ్రంధాలయంలో 11,00 గ్రంధాలు వున్నాయి. పౌష్టికాహారానికి సంబంధించిన 200 శాస్త్రీయ పత్రికలు మేగజైనులకు చందాకట్టి తెప్పిస్తారు.

పశువుల గృహం :_ ఇక్కడ కోతులు, చుంచు ఎలకలు, గుయెనా పందులు, కుందేళ్లు, కోళ్లు వంటి జంతువులపై పరిశోధనలు చేయడానికై వీటికని ప్రత్యేకంగా ఒక గృహం వుంది. ఇక్కడి 'ఎలుకల కాలనీ' దేశంలోవున్న వాటిలో అతి పురాతనమైనదీ, ఉత్తమమైనదిగా చెప్తారు.

వర్క్‌షాపు : ఆధునిక వడ్రంగం పరికరాలు, డ్రిల్లింగ్ పరికరాలుగల చిన్న వర్క్‌షాపుకూడా యిక్కడ వున్నది. ఈ ప్రయోగశాలలో వాడే గాజు పరికరాలు, ఎలక్ట్రిక్ పరికరాలు మంచి స్థితిలో వుండేటట్టు ఏర్పాటు చేయడం యీ వర్క్‌షాపు పని.

ప్రదర్శనశాల :_ ఇక్కడ ఒక ప్రదర్శనశాల కూడా వున్నది దీనిలో పౌష్టికాహార వివరాలను తెలియజెప్పే ఛార్టులు, నమూనాలు, ఛాయాచిత్రాలు, పోస్టర్లు ప్రదర్శిస్తున్నారు. వివిధ ఆహార పదార్థాల పౌష్టికాహారపు విలువలను తెలియజెప్పే సమాచారం కూడా యిక్కడ లభిస్తుంది. ఈ ప్రయోగశాల చేపట్టిన కార్యక్రమాలు వాటి వివరాలు యీ ప్రదర్శనలో ప్రదర్శిస్తారు. దీనికి దేశంనుంచి, విదేశాలనుంచి, అనేకమంది ఉపాధ్యాయులు, విద్యార్థులు, పర్యాటకులు విచ్చేస్తుంటారు.

యీ పౌష్టికాహార పరిశోధనాగారం కనుగొన్న నూతన అంశాలను సాధారణంగా 'ఇండియన్ జర్నల్ ఆఫ్ మెడికల్ రిసర్చ్"లో ప్రచురించడం జరుగుతుంది. అప్పుడప్పుడు దేశంలోను, విదేశాల్లోనూవున్న శాస్త్రవిజ్ఞాన పత్రికల్లోకూడా ప్రచురిస్తుంటారు.

ఈ పరిశోధనాగారం సిబ్బంది మాత్రమేగాక తరమ ప్రజారోగ్యశాఖ, వైద్యకళాశాలలువంటి పరిశోధనా సంస్థలనుంచి కూడా సిబ్బంది యిక్కడ పరిశోధనలు చేయడానికీ, శిక్షణ పొందడానికి డిప్యూట్ చేయబడుతుంటారు. వైద్య పరిశోధనకు సంబంధించిన భారతీయ మండలి యిటువంటి ఏర్పాట్లను చేస్తుంటుంది.

వైద్య పరిశోధనకు చెందిన భారతీయ మండలి, శాస్త్రీయ, పారిశ్రామిక పరిశోధన మండలి, లేడీ టాటా మెమోరియల్ ట్రస్ట్, రెస్టకోస్ బ్రెట్టా మెడికల్ రిసర్చ్ బోర్డ్ మొదలైన సంస్థలు యిచ్చే అనేక స్కాలర్ షిప్పులు, ఫెలోషిప్పులపై యిక్కడ పోస్టు గ్రాడ్యుయేటు విద్యార్థులు వచ్చి పనిచేస్తుంటారు.

---

## ఉత్పత్తిసాధనాలను, ప్రక్రియలను కొత్తగా సాధించిన వారికి జాతీయ బహుమతులు

ఉత్పత్తి సాధనాలను, ప్రక్రియలను కొత్తగా సాధించిన 15 మందిని స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా బహుమతులను ఇచ్చేందుకు ఎన్నిక చేశారు.

కొత్త వస్తువులను, ఉత్పత్తులను తయారుచేసే వ్యక్తులకు ప్రోత్సాహాన్ని కలిగించే మండలి వారు ఈ బహుమతులను ఏటా రెండు సార్లు _ రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగానూ, స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగానూ, శాస్త్రజ్ఞులకు, ఇంజనీర్లకు సాంకేతిక నిపుణులకు, కొత్తవాటిని రూపకల్పన చేసిన వ్యక్తులకు ఇస్తున్నారు. నగదు రూపంలో ఉండే ఈ బహుమతుల విలువ రూ. 500 లగాయితు రూ. 10,000 వరకు ఉంటుంది.

ఈ బహుమతులు పొందిన వారిలో పైమానిక సంబంధ విషయాల జాతీయ పరిశోధనలకు చెందిన సర్వశ్రీ బి. గోపాలక్రిష్ణ, హెచ్.ఎన్. ప్రభాకరశాస్త్రి, ఎం. జఫార్ మొహియుద్దీన్‌లు ఉన్నారు 'ఫిలమెంట్ వైండింగ్' యంత్రాన్ని తయారు చేసినందుకుగాను, ఈ ముగ్గురికి రూ. 600 బహుమతిగా ఇచ్చారు. పూర్తిగా స్వదేశీ పరికరాలతో రూపొందించిన యంత్రంవల్ల, వేరే విదేశాల నుండి ఈ రకం యంత్రాలను దిగుమతి చేసుకోన వలసిన అవసరం ఉండదు. ఇందువల్ల విదేశీ మారకద్రవ్యం కూడా ఆదా అవుతుంది.

# మహాభారతము

తెప్పగంటుల లక్ష్మణశాస్త్రి

దమయంతి పలికిన పలుకులు ఆలకించి నలుడు "కాంతా! లోకపాలురు ఉండగా మానవజాతి వాని నెట్లు వివాహము చేసుకొనెదవు? ధర్మాత్ముడు, దానవ సంహారకుడునైన మహేంద్రుని నెవతెయైన కోరకవిడుచునా! అతడే స్వయముగా నిన్ను కోరుచుండగా ఏల శంకించెదవు? లేక తక్కిన ముగ్గురిలోనైన నొకనిని కోరుకొనుము." యనెను. ఆ మాటకు దమయంతి యేడ్చుచు, "రాజా? నిన్నే నేను భర్తగా వరించితిని ఇది సత్యము" అనెను, అప్పుడు నలుడు "సుందరీ! నేనిప్పుడు దూతగా వచ్చితిని. కనుక తదనుకూలముగానే ప్రవర్తించుము దూతను వరించుట నీకు తగదు. నేను దేవతలకు ప్రతిజ్ఞ చేసి వచ్చితిని. ఇట్టి తరి స్వార్థమునెట్లు తలంతును. ఇట్టి నా పరోపకార ధర్మరూపమగు కార్యము సిద్ధించినచో దానివలన నా స్వార్థసిద్ధిగూడ కలుగును కనుక దమయంతీ! ధర్మయుక్తముగా నా స్వార్థముకూడ నెరవేరుటకు తనువగు ప్రయత్నమును చేయుము." అని చెప్పెను ఆ మాటలువిని దమయంతి దుఃఖించుచు నలునితో మెల్లగా "రాజా! అపాయములేని ఉపాయము నొకదానిని యోచించితిని దానివలన నీకు ఏవిధమైన దోషముగూడ అంటదు అదియేమనగా, దేవతలతోపాటు నీవు గూడ స్వయంవరమునకు రమ్ము లోకపాలుర సమక్షములో వరించెదను. దానివలన దోషము కలుగదు," అని చెప్పెను.

నలుడు తిరిగి దేవతల కడకు పోయి జరిగిన సంగతి యంతయు వారికి చెప్పి దమయంతి "రాజా! నీవుగూడ దేవతలతో స్వయంవరమునకు రమ్ము, వారి సన్నిధిలోనే నిన్ను వరించెదను. దాని వలన నీకు దోషము అంటనేరదు, నెను, జరిగిన సంగతి యంతయు మీకు నివేదించితిని. అనిచెప్పెను.

## దమయంతీ స్వయంవరము

తరువాత ఒక పుణ్యదినమున శుభ ముహూర్తమునందు దమయంతీ స్వయంవరము జరుపుటకు భీమరాజు నిర్ణయించెను. రాజకుమారులందరును స్వయంవర మంటపములో దివ్యమాల్యాంబర భూషితులై కూర్చొనియుండిరి. ఆ రాజులచేత ఆ సభ నాగరాజులతో శోభిల్లు భోగవతీ పత్తనము వలెను, వ్యాఘ్రములచే గూడిన గిరి గుహవలెను ప్రకాశించుచుండెను. రాజుల బాహువులు బలిష్ఠములై ఐదు పడగలతో గూడిన సర్పరాజములవలె ఐదు వ్రేళ్ళతో శోభిల్లుచుండెను. వారి ముఖములు ఆకాశములో నక్షత్రములవలె ప్రకాశించుచుండెను.

అప్పుడు దమయంతి రాజపుత్రుల కన్నులను మనస్సులను దొంగిలించుచు స్వయంవర రంగములో ప్రవేశించెను. ఆమె యవయవములయందు పడిన రాజుల దృష్టులు వానియందే లగ్నములై చలించకుండెను. ఆ తరువాత ఒక్కొక్క రాజ కుమారుని నామరూప యశస్సులు కీర్తింపబడుచుండగా దమయంతి వారిని చూచుచు ముందుకు సాగిపోవుచుండగా నొకచోట ఒకే యాకృతి గల ఐదుగురు పురుషులను చూచి సందేహపడి వారిలో నలుని గుర్తుపట్టజాలక పోయెను. ఐదుగురును నలాకృతితోనే యుండిరి. ఎవనిని జూచినను నలుడుగానే యుండెను. ఐదుగురులో దేవతలను, నలుని ఏర్పరచజాలకుండెను. అప్పుడు మిక్కిలి దుఃఖించుచు దమయంతి మనోవాక్కాయములతో దేవతలకు నమస్కరించి దోసిలొగ్గి "దేవతలారా! హంస నాకు నలుని రూపగుణ సౌందర్యాదులు తెలిపినప్పటి నుండియు నలుని తప్ప ఇతరుని కోరక అతనికే నా జీవితమును మనస్సును సత్యముగా అర్పించి యుంటినేని, నేను మనోవాక్కాయకర్మలచేత ఇతరులను కోరక అతనినే సత్యముగా కోరుచుంటినేని, నాకు భర్తగా దేవతలు నలునినే సత్యముగా నిర్ణయించియుండిరేని, నలుని సేవించుటకుగానే సత్యముగా నేనీ వ్రతమును ఆరంభించి యుంటినేని, సత్యముల ప్రభావముచేత దేవతలు నాకు స్వస్వరూపములతో కనబడి సత్యమైన నలుని కనబరతురుగాక" యని ప్రార్థించెను. ఆమెకు నలునియందుగల సత్యమైన ప్రేమను, అతనియెడ ఆమెకుగల భక్తి, అనురాగమును గమనించి లోకపాలురు మిగుల సంతసించిరి. అప్పుడామె, స్వేదము, రెప్పపాటు, దేహపు నీడ, వాడిపోని పుష్పమాలలు లేకుండ భూమిని అంటకుండ గూర్చొనియున్న లోకపాలురనుచూచి వారికి నమస్కరించి వారిలో శరీరపునీడ భూమిపైన పడుచుండి, వాడిపోయిన పూలమాలయుగలిగి, శరీరమునందు స్వేదము గలిగి, భూమిని తాకుచునుండి, రెప్పపాటుగలిగియున్న పురుషుని నలునిగా భావించి యతని మెడలో స్వయంవర మాలనువేసి అతనిని వరించెను. ఇతర రాజులందరు హాహాకారము చేసిరి. దేవతలు, మహర్షులు, బాగు బాగని ప్రశంసించిరి. నలుడు దమయంతిని

సమాదరించెను. 'నీవు దేవతల సాక్షిగా వారి సమక్షములో నన్ను వరించితివి గనుక నీయలౌకికానురాగమును మన్నించి నేను నీకు దాసుడనుగా సర్వదా ఉండెదను' అని నలుడు చెప్పెను. దమయంతి గూడ నలుని అభినందించి అగ్నిదేవుని సాక్షిగా దేవతలను శరణు పొంది సంతసించెను.

నలదమయంతుల స్వయంవరము అయిన తరువాత ఇంద్రాది లోకపాలురు నలునకు ఎనిమిది వరము లిచ్చిరి :—

అగ్నిదేవుడు, 'తన తేజస్సుచేత ప్రకాశించు తన లోకమును ప్రసాదించి, నలుడు తనను ఎక్కడ కోరినను అక్కడ తాను ప్రత్యక్షమగునట్లును, నలుడుచేయు యజ్ఞములో తాను ప్రత్యక్షముగా దర్శనమిచ్చునట్లును, చివరకు పుణ్యలోకములను అనుగ్రహించునట్లును' వరమును ఇచ్చెను.

యమరాజు, 'నలుడుచేయు వంటలలో ఉత్తమోత్తమ మగు రసమును, రుచిని కల్పింతుననియు, అతనికి సర్వదా ధర్మమునందే నిష్ఠ కలుగునట్లును' వరమిచ్చెను.

వరుణదేవుడు, నలుడు కోరినట్లు జలము ఉత్పన్న మగునట్లును, అతడు ధరించిన పుష్పమాలలు సర్వదా సుగంధ సంపన్నములై యుండునట్లును' వరము లిచ్చెను.

## వివాహము

ఈ విధముగా వారు నలునకు వరములు ప్రసాదించి తమ తమ లోకములకు పోయిరి. స్వయంవరార్థమై వచ్చిన రాజులు ఆశ్చర్యజనకమగు ఆ వివాహమునుచూచి సంతుష్టులై తమ తమ స్థానములకు తిరిగి పోయిరి. వారందరు వెడలిపోయిన తరువాత భీమరాజు యథాశాస్త్రముగా నలదమయంతుల వివాహమును జరిపించెను. నరోత్తముడగు నలుడు శ్వశుర గృహమునందు తన యిచ్చవచ్చినన్నాళ్ళుండి దమయంతితో తన నగరమునకు పోయెను. శచీదేవితో ఇంద్రుడువలె దమయంతితో నలరాజు సుఖముగా నుండెను. సూర్యునివలె ప్రకాశించుచు నారాజు ప్రజలను ధర్మముతో పరిపాలించుచు వారిని రంజింపజేయు చుండెను. నహుష పుత్రుడగు యయాతివలె అశ్వమేధాది యాగములను చేసెను. దేవసమానుడై రమణీయములగు మనోపవనము లందు దమయంతితో యథేచ్ఛగా విహరించెను. ఆమెయందు 'ఇంద్రసేనుడు' అను పుత్రుని, 'ఇంద్రసేన' అను కన్యకను కనెను. ఈ విధముగా యజ్ఞములు చేయుచు, యథేచ్ఛగా విహరించెను, సర్వసంపదలచే సంపూర్ణమైన భూమిని ధర్మయుక్తముగా నేలు చుండెను.

దమయంతి నలుని వరించిన తరువాత లోకపాలకులు తిరిగి స్వర్గమునకు పోవుచుండగా దారిలో కలితోపాటు ద్వాపరయుగాధిపతి గూడ పోవుచుండుటనుజూచిరి. ఇంద్రాదులకును, వారికిని ఇట్లు సంవాదము జరిగెను :—

ఇంద్రుడు:— కలీ ! ద్వాపరునితోగూడి యెక్కడికి పోవుచున్నావు?

కలి:— దమయంతి స్వయంవరము జరుగుచున్నది. నేను ఆమెను వరించబోవుచున్నాను. ఆమెయందు నా మనస్సు లగ్నమై యున్నది.

ఇం:— ఆమె స్వయంవరము జరిగిపోయినది. ఆమె మా యెదుటనే నలుని వరించినది.

కలి:— (మిక్కిలి కోపముతో దేవతలనుజూచి) దేవతలమధ్యలో మనుష్యుని వరించిన దమయంతిని కఠినముగా దండించుట ధర్మము.

లోకపాలకులు:— మాయనుజ్ఞ వడసిన తరువాతనే దమయంతి నలుని వరించెను. సకల సద్గుణ పరిపూర్ణుడగు నలుని ఎవరెవరించక యుండును? అతడు సమస్త ధర్మములను తెలిసికొని తదనుసారముగా నాచరించువాడు. నాలుగు వేదములను, ఇతిహాస పురాణాదులను చదివినవాడు. ప్రతిదినము యజ్ఞములను చేసి దేవతలను తృప్తిపరచువాడు. అహింసా తత్పరుడు. సత్యమునే పలుకువాడు. గట్టి దీక్ష గలవాడు. అతనియందు సామర్థ్యము, ధైర్యము, జ్ఞానము, తపస్సు, మనశ్శుద్ధి, బహిరింద్రియనిగ్రహము, మనోనిగ్రహము ఈ మొదలైన అనన్య సామాన్య గుణములు ధ్రువముగా గలవు. అతడే పురుషశ్రేష్ఠుడు. ఎందులోగూడ లోకపాలకులకు తీసిపోడు. ఇట్టి సద్గుణసంపన్నుడగు రాజును శపించగోరువాడు మూర్ఖుడు. అట్టివాడు తనను తాను శపించుకొనినట్లును, తననుతాను హత్యచేసికొనినట్లును అగును. అతికష్టమగు నరకకూపములో పడిపోవును.

అని లోకపాలురు కలి—ద్వాపరులతో చెప్పి స్వర్గమునకు పోయిరి. తరువాత కలి ద్వాపరునితో "నేను నా కోపమును ఉపసంహరించుకొన జాలకున్నాను. నలుని యంతరంగములో నివసించి యతడు దమయంతితో సుఖించజాల కుండునట్లు చేసెదను. నీవుగూడ జూదపు పాచికలలో నిలిచి నాకు సహాయము చేయు చుండుము." అని చెప్పెను.

## జూదము

ఈ విధముగా కలి ద్వాపరునితో ఒడంబడిక చేసుకొనెను. ఆ యిరువురు నలుడు ఉన్నచోటికి వచ్చిరి. ఎప్పుడైనను నలుడు అధర్మపరుడుగా వ్యవహరించినచో ఆ నెపముతో అతని యంతరంగములో ప్రవేశింపదలచి కలి వేచియుండెను. ఇట్లు పన్నెండు సంవత్సరములు కలి నిషధపురిలో నిరీక్షించుచుండెను. ఒకనాడు కలి నలునిలో నొక ఛిద్రము కనిపెట్టెను. అదియేమనగా, నలుడు మూత్ర విసర్జనము చేసి చేతులు, ముఖము మాత్రము కడిగికొని పాదములు కడుగుకొనకయే ఆచమనముచేసి సంధ్యావందనము చేయుటకు కూర్చొనెను. ఆ యనాచారమును కనిపెట్టి కలి నలునిలో దూరి నిలిచెను.

పిదప కలి పుష్కరునివద్దకు రూపాంతరములో పోయి "నలునితో జూదమాడుము. నా సహాయముచేత నీవు తప్పక నలుని రాజ్యమును జూదములో గెలుచుకొని నిషధ రాజ్యమునకు రాజయ్యెదవు" అని యనెను. ఆ మాటవిని పుష్కరుడు నలుని కడకుపోయెను. కలికూడ వృషభరూపములో పుష్కరునితోపాటు పోయెను పుష్కరుడు నలుని జూదమాడుటకు పిలిచెను. నలుడు తొలుత ఇష్టపడలేదు. కాని, దమయంతి తనను చూచుచుండు సమయములో అతనికి జూదముపై నిష్టము కలిగెను.

అప్పుడు నలుడు కలియావేశముచేత జూదమాడుటకుగడిగి వరుసగా, ధన-కనక-వస్తు-వాహనాది సమస్త వస్తువులను పందెముపెట్టి ఓడిపోయెను. అప్పుడు జూదపువ్యసనములో చిక్కుకొని ఉన్మత్తుడై యున్ననలుని ఆయాటనుండి ఆపుటకు మిత్రులలో నెవరికిని సాధ్యముగాకుండెను. అప్పుడు మంత్రులతో పురజనులు నలుని ద్యూతక్రీడనుండి ఆపుటకు వచ్చిరి. సారథి అంతఃపురములోనున్న దమయంతికడకుపోయి "దేవీ! పురజనులు రాజదర్శనార్థమై వచ్చిద్వారముకడ వేచియున్నారు. ధర్మపరుడైనరాజు ద్యూతవ్యసనములో పడియుండుటను సహించజాలకున్నారు. ఈ విషయమును రాజునకు నివేదించుడు" అని విన్నవించెను. పిదప దమయంతి రాజుకడకుపోయి దుఃఖించుచు నలునితో, "రాజా! పురజనులు నిన్నుచూచుటకు ద్వారముకడ వేచియున్నారు. వారు రాజభక్తితో మంత్రులతోపాటు వచ్చియున్నారు. వారికి తప్పకనీవుదర్శనమీయవలెను." అని మాటిమాటికి నిర్బంధించుచు చెప్పెను. ఆమె అట్లు ఏడ్చుచు వేడుకొనుచున్నప్పటికి కలిపురుషునిచే ప్రభావితుడైననలుడు ఆమెమాటకు బదులు గూడ పలుకకుండెను. అప్పుడు మంత్రులు, పురజనులు, 'ఇతడు ఇక రాచరికము చేయజాలడు' అని చెప్పుకొనుచు దుఃఖార్తులై, లజ్జితులై తమ తమ యిండ్లకు తిరిగిపోయిరి.

'యుధిష్ఠిర మహారాజా! నలునకు, పుష్కరునకు ఈవిధముగా జూదము అనేక మాసములవరకు జరిగెను. అందులో నలుడు చివరకు ఓడుచునేయుండెను.' అని బృహదశ్వమహాముని చెప్పి తరువాత వృత్తాంతము నిట్లు చెప్ప దొడగెను:-

యుధిష్ఠిరా! ఆ తరువాత దమయంతి, జూదములో మైమరచి యున్మత్తునివలెనున్న ధర్మాత్ముడైన నలరాజునుచూచి, భయము దుఃఖముగలదై రాజు సర్వస్వమును పోగొట్టుకొన్నిన సంగతితెలిసికొని చాలాకాలము చింతించుచు రాజునకు హితము చేయదలచి, మిక్కిలి యశస్వినియు, పరిచర్యమును చేయుటలో నిపుణము, సమస్త కార్యసాధనలో కౌశలము గలదియు, తమ హితమునే కోరునదియు, తమయందు అనురాగముగలదియు, మధురభాషిణియునగు 'బృహత్సేన' యనుదాసిని పిలిచి యామెతో, 'నీవు వెంటనే మంత్రులకడకు పోయి నలుని యాజ్ఞగా వారిని ఇచటికి తోడ్కొని రమ్ము. వారితో 'ఈ యీ వస్తువులు జూదములో ఓడిపోబడినవి; ఈ యీవస్తువులింకను మిగిలియున్నవి అని చెప్పుము' అని ఆదేశించి బృహత్సేనను మంత్రులకడకు పంపెను. మంత్రులు 'మా భాగ్యవశాత్తు నలుడు ఇప్పటికైనను సచేతనుడై మమ్ము పిలిపించె'నని సంతసించి త్వరగా నలునికడకు వచ్చిరి. మంత్రులు రెండవసారిగూడ మీ దర్శనార్థమై వచ్చినారు.' అని దమయంతి నలునితో చెప్పినప్పటికిని అతడు వారిరాకను ఆమోదించలేదు. తిరిగి లజ్జితురాలై దమయంతి అంతఃపురములోనికి పోయెను. ధర్మాత్ములు నిందించు పాచికలధ్వనిని, నలుడు సర్వస్వమును ఓడుచుండుటను వినుచు తిరిగి బృహత్సేనతో 'వార్ష్ణేయుడు'అను ప్రభుభక్తిగల సారథిని, నలునియాజ్ఞయైనదని తోడ్కొనిరమ్మనెను. ఆమెపోయి చెప్పగనే ఆ సారథివచ్చెను. అతనిని ఆదరించి అతనితో దమయంతి యిట్లనెను :

"వార్ష్ణేయా! రాజు నీ యెడల ప్రేమతోనుండుటను నీవెరుగుదువు. అట్టి ప్రభువునకు సంకటము సంభవించినపుడు సహాయము చేయుట నీకు తగును. రాజు జూదములో పుష్కరునిచేతిలో ఓడినట్లెల్ల ఆటలో రాజునకు అనురాగము అధికమగుచున్నది. పుష్కరుని వశములో పాచికలుపడుచున్నట్లెల్ల అవి నలుని వశము తప్పుచున్నవి. మిత్రులు, బాంధవులు ఎంతచెప్పినను రాజు పెడచెవిని పెట్టుచున్నాడు. తుదకు నా మాటనుగూడ లక్ష్యపెట్టుటలేదు అందుచేత ఇందులో, మహాత్ముడగు నలునిదోషము ఏమియు లేదని తలచుచున్నాను. సారథీ! నిన్ను శరణు జొచ్చుచున్నాను. నా మాట వినుము. నామనస్సులో అమంగళము తోచుచున్నది. నలరాజు రాజ్యభ్రష్టుడగునని శంకించుచున్నాను. కనుక వెంటనే నీవు నలునకు ప్రియములగు జవనాశ్వములుగల రథముపైన ఈ నా యిరువురు పిల్లలను ఎక్కించుకొని కుండినపురమునకుపొమ్ము. నా బంధువులవద్ద యీ పిల్లలను, అశ్వములను, రథమునుఉంచి, నీవు గూడ అక్కడనే ఉండిననుండుము, లేదా వెడలిపొమ్ము."

రాణి దమయంతి చెప్పినమాటలను వార్ష్ణేయుడు మంత్రులకు తెలిపెను. వారియనుమతిగొని నలుని సంతానము నిరువురను రథముపై ఎక్కించుకొని సారథి కుండిన పురమునకుపోయెను. ఇంద్రసేన కుమారుని, ఇంద్రసేన కుమారిని మాతామహుల యింటిలోఉంచి రథమును, గుఱ్ఱములను అచటనేఉంచి, భీమరాజు వద్ద సెలవుగొని, నలునకు సంభవించిన దుర్దశకు దుఃఖించుచు తానక్కడేవున్మత్తునివలె తిరుగుచూ పాదచారియై అయోధ్యానగరమునకుపోయి ఋతుపర్ణ మహారాజునకు రథసారథిగా నియుక్తుడై కాలము గడపజొచ్చెను.

## నలదమయంతుల వనవాసము

నలుడు పుష్కరునితో జూదమాడుచు సర్వస్వమును ఓడిపోయిన తరువాత నలునితో పుష్కరుడు, ఇంకను ఆట సాగింతుమా? పందెము నొడ్డుటకు ఇప్పుడు నీ వద్ద ఏమున్నది, అన్ని వస్తువులను నేను గెలుచుకొంటిని. ఇప్పుడు నీవద్ద దమయంతి తప్ప ఇతర వస్తువేదియు పందెమొడ్డుటకు లేదుకదా! నీకు అభిప్రాయము ఉండినచో దమయంతిని పందెముపెట్టి చివరిసారిగా పాచికవేయుము." అని యనెను. ఆమాటవిని నలుని మనస్సు చీలిపోయినట్లు దుఃఖించి పుష్కరునితో నేమియు పలుకక మౌనము వహించియుండి పుష్కరుని ముఖమును అశ్రుపూర్ణములైన కన్నులతో చూచుచు తన అవయవము

లందు ధరించియున్న ఆభరణము లన్నియు విడిచిపెట్టి ఉత్తరీయ వస్త్రము గూడా లేకుండ కట్టుబట్టతో రాజభవనమును వీడి వెడలెను. దమయంతిగూడ కట్టుబట్టతో పతిని అనుసరించెను. ఇరువురును నగర బహిర్భాగమునందు మూడు రాత్రులుండిరి పుష్కరుడు, "నలునకు హితము గోరుచు ఈ నగరమునందుండువారు వధార్హుల గుదురు" అని చాటింపజేసెను. ఆ చాటింపువిన్నతరువాత పురవాసులకు పుష్కరునిపై మిక్కిలి అసహ్య భావము కలిగెను.

నలుడు దమయంతితో ఆ విధముగా నగర సమీపమునందు గౌరవ సత్కారరహితుడై కేవలము జలము మాత్రము ఆహారముగాగొని మూడురాత్రులుఉండి తత్కాలమునందు అక్కడ లభించిన ఫలములను, ఆకలికి తట్టుకొనలేక, తీసికొని అడవిలోపడి పోయెను. అతనివెంట దమయంతి మాత్రమే వెడలెను. ఈ విధముగా నలుడు చాలనాళ్లు ధార్తుడై అడవిలో తిరుగుచు నొకచోట బంగారు రెక్కలుగల పక్షులను చూచెను. అప్పుడు నలుడు సంతసించి, 'ఈ పక్షులు మాకు ఆహారమగును వీని బంగారురెక్కలు మాకు సంపదగానుండును' అని ఆ పక్షులపై తన కట్టువస్త్రమును విడిచి పక్షులపై వలవలెకప్పి వానిని పట్టుకొనబోయెను. అప్పుడా పక్షులు ఆ వస్త్రముతోపాటు ఆకాశమునకు ఎగిరిపోయెను. దిగంబరవేషముతో దీనుడై తలవంచుకొనియున్న నలుని చూచి ఆ పక్షులు, మూర్ఖుడా! మేము పక్షులముకాము. జూదపు పాచికలము. నీవు వస్త్రమునుకట్టుకుని పోవుచుండుటను సహించజాలక ఈ పన్నాగముతో వచ్చినాము" అని చెప్పెను.

అట్లు తనసమీపమునకు వచ్చిన పాచికలను వివస్త్రుడుగా నిలిచియున్న నలుడు చూచి. "ప్రియా! యీ పాచికల మూలముగా నేను సర్వస్వము పోగొట్టుకొని అడవిపాలై వచ్చినప్పటికి అవి యిప్పుడుగూడా నన్ను విడువక వెంటబడి అవమానపరచుచున్నవి. నిషధదేశవాసులందరు నన్ను ఏవగించుకున్నప్పటికిని విడువక పీగి వ్యసములోపడి మోసపోయితివి, నీకు ప్రియపతిని గనుక ఒక హితమును చెప్పెదను వినుము," అని ఇట్లుచెప్పదొడగెను.

"ఇదిగో ఇక్కడ అనేకమార్గములు కనపడుచున్నవి. ఇది అవంతీపురమును. ఋక్షవంతమను పర్వతమునుదాటి దక్షిణ దేశమువైపు పోవును. ఇదివింధ్యపర్వతము. ఇది పయోష్ణి నదిసముద్రమును కలియుచోటు. ఈ నదితీరమునందు పుష్పఫల వృక్షములతో గూడిన మహర్షుల ఆశ్రమములు గలవు. ఈ మార్గము విదర్భ దేశమునకు, ఇది కోసలదేశమునకు పోవును. ఇవి దాటిపోయినచో దక్షణదేశము వచ్చును" అనిచెప్పెను.

ఆ మాటలువిని దమయంతి దుఃఖించుచు నిట్లనెను :-
"రాజా! నీ మాటలలో అభిప్రాయమును నేను కనిపెట్ట లేదనుకొంటివా? నాకు ఈ మార్గములన్నియు చూపి నిన్ను వీడి వెడలి పొమ్మనుచున్నావు. నామనస్సు తత్తరపాటు చెందుచున్నది. అవయవములు కూలబడి పోయినవి. నీవు రాజ్యమును, సంపదను, కడకు వస్త్రములనుగూడ పోగొట్టుకొని ఆకలి మంటచే బాధపడుచున్నావు. ఇట్టి నిన్ను వీడి నేనెట్లు పోవుదును? ఈ వనము గూడ నిర్జనముగానున్నది. ఈ ఘోరవనమునందు నేను శ్రమనెట్లు పోగొట్టగలుగుదును? సమస్త దుఃఖములయందు భార్యతో సమానమైన ఔషధము లేదని వైద్యులందరు చెప్పుదురు. ఇది సత్యముగూడ నగును"

ఆ మాటలువిని నలుడిట్లనెను: "దమయంతీ! నీ మాట సత్యము. ఆర్తుడగువానికి భార్యాసమమైన మిత్రము మరియొకటి యుండదు. నిన్నునేను విడువదలచుటలేదు. కనుక నీవు భయపడకుము, నా ప్రాణములైన విడిచెదను గాని నిన్ను విడువజాలను." ఆ మాటకు దమయంతి, "రాజా! నన్ను నీవు విడువదలచని యెడల విదర్భదేశమునకుపోవు మార్గమును నాకేల చూపించితివి? నన్ను నీవు విడువజాలవని నేనెరుగుదును. కాని, నీవు అనేక బాధలలో ఆపదలలో చిక్కుకుని గత్యంతరము లేక విసిగి నన్ను విడుచుటకు గూడ వెనుదీయవు. నీవు విదర్భ దేశమునకు పోవు మార్గమును చూపించినందువలన నాకు శోకము పొంగిపొరలి వచ్చుచున్నది. ఒక వేళ నేను నా తల్లిదండ్రులు మొదలైన బంధువుల వద్దకు పోవలెనను ఇచ్ఛయే యున్నచో మనమిరువురము కలిసి విదర్భ దేశమునకు పోవుదము. విదర్భరాజగు మాతండ్రి నిన్ను ఆదరించి పూజించును. అచ్చట మాయింటిలో మనము సుఖముగా నివసింతుముగాక." అని యనెను. ఆ మాటకు నలుడిట్లనెను:

"దమయంతీ నేను, మీ తండ్రి సమానరాజులము. కనుక ఇట్టి దుర్దశలో అతని ఇంటికి నేను పోవను. పూర్వము సమృద్ధడనుగానుండినప్పుడు అక్కడికి పోయి నీకు సంతసము చేకూర్చితిని. ఇప్పుడు ఈ యవస్థలోపోయి నీకు దుఃఖము కలిగించను" అని చెప్పుచు నలుడు దమయంతిని ఊరడించుచు ఆమె వస్త్రములో సగము తాను చుట్టుకొనెను. అడవిలో తిరుగుచు తిరుగుచు వారు ఆకలి దప్పులతో బాధపడుచు నొకానొక ధర్మశాలను చేరుకొని అచట కూర్చొనిరి. నలుడు వివస్త్రుడుగా, మాలినుడుగా, వికృతాకారము గలవాడుగా అలసి భూమిపై నిద్రించెను. దమయంతియు పరిశ్రాంతయై నిద్రించెను.

దమయంతికి నిద్రపట్టిన తరువాత శోకాతిరేకముచేత నలునకు నిద్రరాక, తన రాజ్యభ్రంశమును, మిత్రవియోగమును, వనవాసమునుగూర్చి చింతించుచుండెను, "నాకు ఏ పన్నియు తోచకున్నదే. నాకిప్పుడు మరణము శ్రేయస్కరమా? లేక దమయంతిని వీడుట మంచిదా? నాయందు అనురక్తురాలైన కారణముగా ఈమె అనేక దుఃఖములను అనుభవించుచున్నది, కనుక ఈమెను నేను విడిచిపోయినచో నొకవేళ ఈమె తనపుట్టినింటికిపోయి సుఖముగా నుండవచ్చును. నాతోనుండినచో తప్పక కష్టములనుభవించును. ఈమె మహాపతివ్రత గనుక ఒంటరిగా అడవిలో పోవుచున్నప్పటికిని ఈమె పాతివ్రత్యమును ఎవడుగూడ భంగపరచజాలడు" అని చింతించెను. ఇదియంతయు కలి ప్రభావముచే నతనికి గలిగెను. తనకు వస్త్రములేకుండుటను ఆమెకు వస్త్రము ఉండుటను చూచి ఆమె చీరలో సగము చించి ఆ యర్ధ వస్త్రమును ధరించదలచెను. అది చించినచో ఆమె మేల్కొనునని సంశయించి నలుడు దిగంబరుడుగానే ఆ ధర్మశాలలో నటునిటు తిరుగుచు నొకచో పడియున్న కత్తిని తీసికొని దమయంతి చీరలో

సగము ఆ కత్తితో కోసి దానిని కట్టుకొని, నిద్రలో మైమరచి పడియున్న దమయంతిని విడిచి త్వరగా వెడలిపోయెను. కొంత దూరముపోయి తిరిగివచ్చి ఆమెను చూచి యేడ్చెను. సూర్యుడు వాయువును చూడజాలని నా ప్రియురాలు కటికనేలపై దిక్కులేని దానివలె పడియున్నదే. సగము వస్త్రము కత్తిరించియుండుటను ఈమె మేల్కొనిచూచి పిచ్చి యెత్తినదానివలె నగునేమోకదా! ఒంటరిగా నీమె యీ ఘోర వనమునందు ఎట్లు సంచరించగలదు అని చింతించి 'సమస్త దేవతలు పుణ్యురాలవగు నిన్ను రక్షింతురుగాక. నీ ధర్మమే నిన్ను కాపాడుగాక.' అని పలుకుచు కలిచేత అపహరించబడిన వివేకజ్ఞానము గలవాడై నలుడు, అసమాన రూపసౌందర్యవతియగు ప్రియురాలిని కటికనేలపై విడిచి వెడలిపోయెను. అటు కలిపురుషుడు, ఇటు ప్రియురాలిప్రేమ ఆకర్షించుచుండగా మాటిమాటికి, పోవుచు పోవుచు తిరిగి వచ్చుచు ఆయన హృదయము రెండుగా చీలి ఉయ్యాలవలె మాటిమాటికి ఆతన్ని ముందుకు ఈడ్చుచు – వెనుకకు ధర్మశాలకడకు ఈడ్చుచునుండెను ఇట్లున్న అతనిని భార్య ప్రేమకన్న ప్రబలమైన కలిప్రభావము ముందుకు ఈడ్చుకొనిపోవగా దుఃఖించుచు ప్రియకాంతను వీడి అడవిలోబడిపోయెను.

నలుడు వెడలిపోయిన పిదప దమయంతి మేల్కొని ఆ నిర్జన ప్రదేశములో భర్తను గానక భయపడి "మహారాజా," అని బిగ్గరగా అరచుచు నేడ్చెను. 'నాథా! స్వామీ! నన్ను ఈ విర్జన వనములో వదలిపోయితివా! నాకు దిక్కెవరు? నష్టమైతిని ధర్మజ్ఞుడవే! సత్యము తప్పితివే! ఇది నీకు తగునా! నిద్రించుచున్న ఆలను వదలిపోవుట న్యాయమా! నీకు అనురక్తురాలనై యెల్లప్పుడు నిన్ను సేవించుచుందునుగదా! నా వలన ఏ యపరాధము జరుగలేదు ఇతరులు నీకు చేసిన అపరాధమునకు దండనము నాకు విధించుటయా? లోకపాలుర యెదుట స్వయంవరమునందు నీవు చేసిన ప్రతిజ్ఞనైన జ్ఞప్తికి తెచ్చుకొనకపోయితివా? నీవు లేకుండ ఒక నిముషమైన జీవించజాలని నన్ను అకాలమృత్యువువాత పడవేయుట ధర్మమా! నీవు పరిహాసమునకు నన్ను పరీక్షింపవలచినచో నిక పరిహాసము చాలును. భీతురాలనైన నాకు వెంటనే దర్శనమిచ్చి నన్ను కాపాడుము. ఇదిగో ఇక్కడనే నీవు పొదల మాటున దాగియున్నట్లు నేను చూచుచున్నాను. వెలికిరమ్ము. ఇట్లు విలపించుచున్న నన్ను నీవు పలుకరించకుండుట క్రౌర్యముకాదా! నన్నుగూర్చి నేను దు:ఖించుటలేదు. మరి దేనికిని విలపించను. కాని నీవు ఒంటరిగా కారడవిలో ఎట్టి బాధల ననుభవించుచుంటివో యని శోకించుచున్నాను. ఆకలిదప్పులతో నన్ను తలచుకొనుచు ఎంత బాధపడుచుంటివోకదా!' అని యనేకవిధములుగా విలపించుచు దమయంతి ఏమియుతోచక ఇటునటు పరుగెత్తుచు, "ఎవని వలన మాకు ఈ దుఃఖము సంప్రాప్తియైనదో అతడు మాకంటె ఎక్కువగా దుఃఖపడుగాక అట్టివాడు జీవితమంతయు అసుఖ జీవనము గడుపుగాక." అనుచు మాటిమాటికి నేడ్చుచున్న ఆమెను ఒక అజగరము(కొండచిలువ) నోటపట్టుకొని మ్రింగజొచ్చెను. అప్పుడు తనకు కలిగిన ఆ యాపదనుచూచి దానిని లెక్కచేయక నలుడు ఏం బాధపడుచున్నాడోకదా యని దమయంతి మిగుల దుఃఖించెను.

(సశేషము)

## బ్యాంకుల జాతీయకరణ

( 32 వ పుటనుండి )

ద్వారా, ముందు ముందు మెరుగైన విధంగా పని జరపడానికి వీలు కాగలదని ప్రభుత్వం ఆశిస్తున్నది.

ప్ర : ఇప్పుడు జాతీయం చేసిన బ్యాంకులు పని జరిపిన తీరుతో పోల్చినప్పుడు, ప్రభుత్వయాజమాన్యం క్రిందకు వచ్చిన తర్వాత స్టేట్ బ్యాంక్ పనిచేసినతీరు ఎలా ఉన్నది?

సమా: ప్రభుత్వ యాజమాన్యం క్రిందకు వచ్చాక స్టేట్ బ్యాంక్ 4,000 అంతకుతక్కువ జనాభాగల చిన్న చిన్న పట్టణాలలో, 11 వందల పైచిలుకు బ్రాంచీలను నెలకొల్పింది. ఇతర బ్యాంకులు, ఇలాంటిచోట్ల పనిజరగటం లాభదాయకం కాదని వదిలి వేశాయి. చిన్న చిన్న పరిశ్రమలవారికీ రైతులకూ సహాయపడేందుకై కొత్త పథకాలను తలపెట్టింది. ప్రభుత్వ యాజమాన్యం క్రిందకు రాకపూర్వం సంవత్సరాలలోకంటే స్టేట్ బ్యాంక్‌లో డిపాజిట్ల మొత్తం ఆరు రెట్లకు పైగానే (ప్రయివేటు బ్యాంకుల విషయాలలో ఈ పెరుగుదల దాదాపు మూడురెట్లు) పెరిగింది. 1969 జూలైలో డిపాజిట్ల మొత్తం, షుమారు 1200 కోట్లు మొత్తం బ్యాంకులన్నిటి డిపాజిట్లలో ఇది నాల్గవ వంతు.

ప్ర : జాతీయీకరణ మూలంగా, బ్యాంకుల నిర్వహణలో సమర్థతకూ అసమర్థతకూ వ్యత్యాసం తెలియకుండా పోతుందా ?

సమా : ఇప్పుడు జాతీయమైన బ్యాంకులు, పరస్పరం వాంఛనీయమైన పోటీ భావంతో పనిసాగించడాన్ని ప్రోత్సహించే ఉద్దేశంతో కొంతకాలం వరకు, ఆ బ్యాంకులను, వాటి వాటి పేర్లతో విడివిడిగానే గుర్తిస్తూ ఉండాలని నిశ్చయించారు. ఈ బ్యాంకులలో వ్యవస్థా పరంగానూ, ఇతర విధాలుగానూ, మార్పులు వేటినైనా నిపుణులయినవారు కూలంకషంగా పరిశీలన జరిపిన మీదటనే చేయడంజరుగుతుంది.





# తెలుగుదేశంలో బౌద్ధమతం

పాతూరి ప్రసన్నం

ఆంధ్రుల ప్రాచీన చరిత్రను గురించిన పరిశోధనలు ఇంకా జరుగ వలసివున్నా చారిత్రకంగా ఇంతవరకు లభ్యమైన ఆధారాల వల్ల తెలుగు దేశపు సంస్కృతిపై తొలివెలుగులు ప్రసరింప జేసినది బౌద్ధమత మేనని తెలుస్తుంది

ప్రాచీన కాలంనుంచీ బౌద్ధమతాన్ని ఆంధ్రులు అభిమానించటం కాకుండా, ఆరాధించారు. ఫలితంగా కళల్లో, తత్వశాస్త్రంలో, శిల్పంలో సైతం నిత్యజీవితంలో నాడు బౌద్ధం ఒక సచేతనమైన వికాసాన్ని కలిగించింది. శాతవాహన, ఇక్ష్వాకు ప్రభువులకాలంలో ఆర్యధర్మంతోపాటు బౌద్ధమతం కూడా ఆంధ్రదేశంలో సహజీవనం చేయటం, ఆంధ్రుల మత సామరస్యానికి చిహ్నం.

ఆంధ్రదేశపు ప్రసక్తి ప్రాచీన బౌద్ధ గ్రంథాలలో కూడా కానవస్తుంది. మహాపరినిర్వాణానంతరం బుద్ధదేవుని ధాతు విశేషాలపై స్థూపనిర్మాణం కావించటంకొరకు భారతదేశంలోని రాజన్యులందరూ ముందుకు వచ్చారు. బుద్ధుని పవిత్రాస్థికలు తెచ్చుకొన్న వారిలో నాగారాజు ఒకడనీ, ఆయన ఆంధ్రభూమిలో ఒక భాగాన్ని పరిపాలించేవాడనీ. 'వజ్రాల తిన్నె'లో ఒక స్థూపాన్ని నిర్మించి బుద్ధుని పాదారవిందాలకు సమర్పించాడనీ బౌద్ధ గ్రంథాలవల్ల తెలుస్తుంది. అమరావతి, నాగార్జున కొండ, భట్టిప్రోలు, ఘంటసాల, గుడివాడ, జగ్గయ్యపేట, గుంటుపల్లి, రామతీర్థము, శాలిహుండము, గోలి, బొజ్జనకొండ, అల్లూరు గుమ్మడి దుర్రు మొదలగు ప్రదేశాలలో బౌద్ధ స్థూపాలు వేర్వేరు కాలాలలో వెలశాయి. 'సుత్తనిపాత' మను బౌద్ధ గ్రంథంలో 'అంధకరట్ట' మను పేరుతో ఆంధ్ర రాష్ట్రముదహరింప బడినది.

## బౌద శిల్పం:

క్రీస్తు పూర్వం 3వ శతాబ్ది నించి, క్రీస్తుశకం 3 వ శతాబి వరకూ ఆంధ్రుల సంస్కృతీ సంప్రదాయాలలో, వేషభాషలలో, అలంకరణల్లో కూడా బౌద్ధ ప్రభావం సుస్పష్టం. నాటి ఆంధ్రులలో ఆడబడుచులు తమ కబరీభరాల్లో తురుముకున్న సువర్ణ కుసుమాలు బుద్ధమూర్తి పాదాబ్జాలకు పూజా ప్రసూనాలయినవి. భట్టిప్రోలు (నాటి ప్రతీపాలపురం) స్థూపంలో బయల్పడిన కుబ్బీరకుని నాటి ఖనన విశేషాలు ఇందుకు తార్కాణం. నాడు తెలుగు దేశపు మగువలు ధరించిన రంగు రంగుల చేతిగాజులు, కుంకుమ బరిణలు, అపురూపమైన అమరావతీ

(నాటి ధాన్యకటకము) స్తూపంలో బయల్పడినాయి. 'నిగమములుగా, 'సంఘములు' గా ఏర్పడిన నాటి ప్రజానీకం బౌద్ధ స్తూపానికి ఎన్నో దాన ధర్మాలు చేసేవారు. సామాన్య ప్రజానీకమే కాక శాతవాహన సామ్రాట్టులు సైతం బంగారు కిరీటాలను బౌద్ధ భిక్షు



వుల పాదతలములపై మోకరించారు. తథాగత ధర్మానికి ఇక్ష్వాకు వంశపు రాణివాసము భక్తి నీరాజనాలు సమర్పించింది.

బౌద్ధ మతం, నాటి ఆంధ్ర శిల్పులను పరవశింపజేసింది. ఆంధ్రుల శిల్ప సంపదను అభివర్ణించటం బౌద్ధ శిల్ప ప్రసక్తితోనే ఆరంభమవుతుంది. భారతీయ శిల్ప వికాసంలో బౌద్ధ శిల్పాలు వినూత్న పరిణామాలు తెచ్చాయి. బౌద్ధ సిద్ధాంతాల్లోవలె, బౌద్ధ శిల్పాలలో కూడా శాంతి సౌజన్యాలు గోచరిస్తాయి. రూపంలో గంభీరత, సౌందర్యంలో లాలిత్యం, భంగిమలో సరళత బౌద్ధ శిల్పాల సహజ లక్షణాలు. ఆంధ్రదేశంలోని అమరావతి, నాగార్జున కొండలలోని శిల్ప సంపద భారతీయ శిల్ప చరిత్రలోని ఒక ఉజ్వల శకాన్ని సూచిస్తుంది. అంతకుముందు వెలసిన సాంచీ, బార్హత్ శిల్పాలు భౌతిక సౌందర్యాన్ని ప్రదర్శించుతూ, బుద్ధుని జీవిత గాథలనూ, జాతక కథలనూ చిత్రించగా, అమరావతీ శిల్పాలు ఆత్మ సౌందర్యాన్ని భాసింపజేస్తూ బుద్ధ దేవుని సిద్ధాంతాలకూ, సందేశాలకూ రూపాన్ని కల్పించాయి. అమరావతి శిల్ప కళా రీతులు ఆనాడు జరిగిన ద్వీపాంతర సముద్రయానం వల్ల మలయా, సుమాత్రా, బోర్నియో వంటి ప్రాచ్య దీవులకు సైతం విస్తరించాయి. ఆనాటి ఆంధ్రుల బౌద్ధ శిల్పాలు లావణ్యంతోనూ, ఒయ్యారంతోనూ ఒప్పుతూ వికృత శృంగారానికి చాలా దూరంగా వుంటాయి. శాతవాహన రాజన్యులచేత నిర్మితమైన సాంచీ స్థూపపు తూర్పు తోరణంపై వెలసిన ఒయ్యారి భామ శిల్పమూ, అమరావతి స్థూపమున బోధివృక్షమును పూజించు భక్తురాలి శిల్పమూ ఇందుకు ఉదహరణగా సమీక్షకులు సూచిస్తారు. అమరావతి శిల్పాలు భారతీయ శిల్పకళకు పరమావధులని కళావిమర్శకుడు ఫెర్గూసన్ వ్రాశారు.

ఆంధ్రదేశపు వాస్తు పరిణామంలో కూడ బౌద్ధయుగపు ప్రభావం సువిదితం. ఆనాడు నివాసార్థం అంతస్తులు గల మేడలు నిర్మించబడినవి. అమరావతీ శిల్పాలలోగల ఒక అంతస్థుల సౌధమును చూపు శిల్పంవల్ల ఈ విషయం తెలుస్తుంది. బృహత్తర నిర్మాణములైన ఆనాటి అమరావతి, నాగార్జునకొండ, భట్టిప్రోలు బౌద్ధ స్థూపములు ఆంధ్రుల చైత్య నిర్మాణములకు ఉత్కృష్టమైన ఉదాహరణములు. సాంచీ స్థూపం యొక్క ప్రాకారకుడ్యం సామాన్యమైనదికాగా అమరావతి స్థూపంయొక్క ప్రాకారకుడ్యం రమ్యాలంకరణలతో శిల్ప సంశోభితంగా నిర్మించబడినది. నాగార్జునకొండలోని స్థూపముల ప్రవేశద్వారముల యందుగల 'చంద్రశిలలు' అని పిలువబడుమెట్లు సింహళదేశపు వాస్తుశిల్ప ప్రభావమును సూచించుచున్నవి. నాగార్జునకొండ యందు బౌద్ధ భిక్షువులు నివసించు విహారములకు పై అంతస్థులుకూడా వుండెడివి. అంతేగాక అచట బయల్పడిన బహుళ స్తంభ మంటపము, తర్వాత శతాబ్దుల్లో దక్షిణ దేశములో వెలసిన బహుళస్తంభ దేవాలయమ్ములకు మూలా



ధారమైనదిగా వాస్తు మర్మజ్ఞులు చెప్పుదురు. నాగార్జునకొండలోని బౌద్ధ చైత్యము తర్వాత కాలములో, చేజెర్లలో ఆనంద గోత్రజులచే నిర్మించబడిన కపోతేశ్వరాలయమునకు ఆధార భూతమైనది. గజ పృష్ఠాకారము గల ఈ దేవాలయము పల్లవులచే నిర్మించబడిన

మహాబలిపుర దేవాలయ రథ వర్గములో చేర్చబడుట గమనార్హముగా వాస్తు శాస్త్రజ్ఞులు భావించుచున్నారు. ఇదే రీతిగా చైత్య గవాక్షములూ, కుడ్య స్తంభములూ, స్తంభములూ బౌద్ధయుగపు శాతవాహనుల నుంచి పల్లవుల వరకూ వివిధమైన పరిణామములు పొందినవి.

చిత్రకళ విషయంలో కూడా బౌద్ధ మతమే ప్రధానమైన ప్రేరణగా ప్రాచీనాంధ్రులు కృషిచేశారు. భారతీయ చిత్రకళా ప్రాదుర్భావానికి బౌద్ధమతం ఆధారం కాకపోయినా, ఆంధ్రదేశంలోని చిత్రకళావతరణం మాత్రం బౌద్ధ మతం వల్లనే జరిగింది. శాతవాహనుల వలన ఆంధ్రదేశంలో బౌద్ధమతం విస్తరించినట్లే చిత్రకళకూడా వారి పోషణలో మహోన్నత స్థాయిని అందుకున్నది. ఇందుకు అజంతాలోని పదవ గుహాలయం ఉదాహరణగా సమీక్షకులు సూచిస్తారు. ఈ గుహ ఆంధ్ర శాతవాహనులలో ఒక రాజుచేత నిర్మింపబడినదని ఒక సిద్ధాంతము. అజంతా గుహలలో ఒక చోట గౌతమీపుత్ర శాతకర్ణి నామము చెక్కబడి యుండుటచేత, ఇచట కుడ్యచిత్రములను చిత్రించినది ఆంధ్ర చిత్రకారులేయని యూహింపబడుచున్నది. అజంతా గుహలోని బౌద్ధగాథను చిత్రించు చిత్రములోని లౌకిక, పారలౌకిక భావ సమ్మేళనం, చద్దంత జాతక చిత్రణ మొదలగునవి ఆంధ్ర చిత్రకారుల సృష్టియనియు, అవి క్రీస్తుపూర్వం 2వ శతాబ్దినుండి క్రీస్తుశకం 2వ శతాబ్ది వరకూ ఆంధ్రులచేత చిత్రించబడినవనియు నిర్ధారింపబడినవి. అమరావతీ శిల్పములకూ, అజంతా చిత్రములకూ గల సాదృశ్యము ఈ సిద్ధాంతమునకు మూలాధారము. శాతవాహనుల నాటి బౌద్ధ చిత్రకళలో ప్రకృతి పరిశీలన, పశు పక్ష్యాదుల చిత్రణ, భావ ప్రకటన, భక్తి కరుణరస ప్రదర్శన, ఆంధ్ర చిత్రకారులు చూపించిన ప్రముఖ లక్షణములు.

## మతము

మతపరముగాకూడా ఆంధ్రదేశంలో బౌద్ధమత ప్రభావం అపూర్వమైనదే. అశోకుని కాలంనాటికే ఆంధ్ర దేశంలో బౌద్ధ మతం విస్తరించినదని భట్టిప్రోలు స్తూపం ఆధారంగా చారిత్రకులు నిర్ణయించారు. అశోకుడు పంపిన బౌద్ధ ప్రచారకుడైన మహాదేవ స్థవిరుడు ఆంధ్రదేశమునకు వచ్చి కృష్ణానది తీరమున చైత్యక వాదమును స్థాపించాడు. చైత్యక వాదమనగా బుద్ధ సమాధులను పూజించుట. ఈ వాదము అంధకులదిగా (ఆంధ్రులది) బౌద్ధ ధర్మమున స్థిరపడినది. ధాన్యకటకమునందలి మహా చైత్యమును మహాదేవ స్థవిరుడు నిర్మించినట్లు బౌద్ధ గ్రంథములలో చెప్పబడినది. దేవశ్రవుడను బౌద్ధుడు, 'శాలివాహన' రాజును బౌద్ధ ధర్మావలంబుని గావించినట్లు చైనాలోని బౌద్ధ గ్రంథములలో వ్రాయబడినదట!

శాతవాహనుల కాలంలో అవతరించిన నాగార్జునాచార్యుడు బుద్ధుని తర్వాత బుద్ధుడంతటి వాడుగా ఆరాధింపబడిన మహాపురుషుడు. ఆనాడు యావద్భారత దేశమునకూ ఆంధ్రదేశము బౌద్ధమత కేంద్రముగా ఖ్యాతిగాంచినది. నాగార్జునాచార్యుడు అధివసించిన శ్రీ పర్వతము—నేటి నాగార్జున కొండ—ఆనాడు బౌద్ధులందరికీ పుణ్యక్షేత్రము. నాడు క్షీణించిపోవుచున్న బౌద్ధ మతమును ఉద్ధరించుటకై 'మహాయాన' సంప్రదాయమును నాగార్జునాచార్యుడు ప్రవేశపెట్టి సంస్తుతి పాత్రుడైనాడు. నాగార్జునుడు శాతవాహన చక్రవర్తికి వ్రాసిన 'సుహృల్లేఖ' నాటి ఉదాత్త సారస్వతమునకు మచ్చుతునక. ఆ యాచార్యుని మహాయాన సిద్ధాంతములు శూన్యవాదమనీ, మాధ్యమిక వాదమనీ బౌద్ధ తత్త్వమునకు మూల సిద్ధాంతములుగా విఖ్యాతి గాంచినవి. ఆనాటి ధాన్యకటక, విజయపురీ విశ్వవిద్యాలయములు ప్రాచీన భారత విశ్వవిద్యాలయములుగా వినుతికెక్కి, వేలాది విద్యార్థులకు విజ్ఞాన భిక్ష పెట్టినవి.

కాలక్రమమున మహాయాన బౌద్ధమున వజ్రయాన శాఖ ఏర్పడడం, మంత్రతంత్రోపాసనల ద్వార ఇష్ట కామ్యార్థ సిద్ధికై జుగుప్సాకరమైన చర్యలు జరగటంవల్ల బౌద్ధ మత ప్రభావం దిగజారిపోయింది. ఆంధ్రదేశములో బౌద్ధమతం క్షీణదశలో వుండగా చైనా యాత్రికుడు హ్యూయాన్‌సాంగ్ ధాన్యకటకమును దర్శించాడు. 12వ శతాబ్దివరకు బౌద్ధమతం ఆంధ్రలో కొనవూపిరితో వున్నదనుటకు పాల్కురికి సోమనాథుని 'పండితారాధ్య చరిత్ర' నిదర్శనము. ఆ తర్వాత కాలమున ఆంధ్రదేశమునుంచి బౌద్ధము పూర్తిగా అంతరించిపోయినది.

నేడు ఆంధ్ర దేశంలో బౌద్ధమతం లేకపోయినా, బౌద్ధ యుగంనాటి ఉజ్వల కళా సంపద నేటికీ మనకు మహోత్కృష్టమైన వారసత్వంగా మిగిలిపోయింది. ఆంధ్రుల సంస్కృతి, కళలు, తత్వశాస్త్రాలలో బౌద్ధ ప్రభావం ప్రస్ఫుటంగా వున్నదని చెప్పటం సత్యదూరం కానేరదు.

"ఒకచోట నేమి ? తెనుగుల
సకలోర్విని ఎచట చూడ చైత్యకములు, స్థూ
పకములు, పద్మాసన గత
ముకుళిత నేత్రములు, జ్ఞాన ముద్రా రీతుల్"

సీరియల్:

# తిరస్కృతి

## — వాసిరెడ్డి సీతాదేవి

**జరిగిన కథ**

సత్యం, సూర్యం అన్నదమ్ములు. సత్యం శాంతి నికేతన్ వెళ్ళి చిత్రకళ నేర్చుకుని వచ్చాడు. సూర్యం పట్నంలో చదువు కొంటున్నాడు. తమ యింట్లోనే వుంటున్న మేనమామ కూతురు సరళను సత్యం పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. కాని సరళ తనను చేసుకోదలచలేదని తెలిసి ఇంట్లోంచి వెళ్ళిపోయాడు. చిన్నప్పుడు సత్యానికి చదువుచెప్పిన కేశవరావుగారూ, ఆయన కూతురు విమల ఒకసారి ఓ చిత్రకళా ప్రదర్శనకు వెళ్ళారు. అక్కడ సత్యం పేరున ఒక చిత్రం కనిపించింది. అక్కడవున్న ఒకతన్ని పిలిచి సత్యంనుగూర్చి అడిగారువారు. అతను యిచ్చిన అడ్రసు ప్రకారం మర్నాడు సత్యం వుంటున్న యింటికి వెళ్ళారు.

రాజమణీదేవి పూజముగించిలేచింది. ఆమె ఖంగున మ్రోగుతున్న కంఠంతో మంత్రపుష్పం చదవుతుంటే అందరూ తన్మయత్వంతో నిలబడిపోయారు. వెనుదిరిగిన ఆమె, కొత్త వారు నిల్చొని వుండటంచూసి ఆశ్చర్యపోయింది. చిరాకు కూడా వేసింది కొడుకు మీద. ఆమె పూజ చేసుకుంటూ వుండగా ఎంతో దగ్గర వారైతే తప్పించి ఆమె అనుమతి లేకుండా గదిలో ప్రవేశించరు.

మాధవరావు రెండడుగులు ముందుకువేసి "అమ్మా! వారు కేశవరావుగారు. మన సత్యానికి ఎంతో కావాల్సినవారు. చిన్నప్పటి గురువుగారు" అన్నాడు.

కేశవరావుగారు నమస్కరించారు. విమల సంభ్రమాశ్చర్యాలతో ఆమెన చూస్తూ పక్కగా నిలబడిపోయింది. మంచి ముత్యాలను గుర్తుకుతెచ్చే రంగులోవున్న ఆమె, వయస్సుమళ్ళినా ఎంతో ఆకర్షణీయంగా వుంది. ఐదు అడుగుల మూడంగుళాల ఎత్తు. ఎత్తుకుతగ్గ లావూ. నిజంగా ఎవర్నో మహారాణిని చూస్తున్నట్లనిపించింది విమలకు. ఆమె ముఖంలోనూ, నిల్చున్న తీరులోనూ ఎంతో హుందాతనం ఒక ప్రత్యేకత కనిపిస్తున్నాయి. తెల్లని అంచులేని పట్టుచీరలో వున్న ఆమె ముందు ఎందుకో మోకరించాలనిపించింది విమలకు. అలాంటి తల్లి గర్భం నుంచి జన్మించిన మాధవరావు ఎంత అదృష్టవంతుడు!

"చెయ్యి పట్టమ్మా!" అన్న ఆమె స్వరానికి ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చింది విమల. తొట్రుపాటుతో చెయ్యి ముందుకు చాచింది.

చేతిలోవున్న పంచపాత్రలోని తీర్థం ఉద్ధరణి తో మూడుసార్లు విమల చేతిలో పోసింది రాజమణీదేవి. విమల తీర్థం పుచ్చుకొని నెత్తిమీద చేత్ని అనించుకొని తన ఎదురుగా ఇంకా నిలబడి తననే పరీక్షగా చూస్తున్న రాజమణీదేవి ముఖంలోకి కుతూహలంగా చూసింది. రాజమణీదేవి ముఖం ముసురు పట్టిన ఆకాశంలావుంది. శ్రావణమేఘాలలావున్న ఆ కళ్ళు వర్షించటానికి సిద్ధంగా వున్నాయి. ఆమె విషణ్ణవదనం చూసిన విమల గాబరాపడింది.

"నీ పేరేమిటి తల్లీ?" రాజమణీదేవి కంఠంలో కారుణ్యం ఒలికింది, కళ్ళలో నీరు తొలికింది.

"విమల" అంది విమల చిన్నగా, సన్నగా జంకుతూ.

ఆత్రంగా మాధవరావు అమ్మా! అంటూ ఒక అడుగు ముందుకు వేశాడు.

అదే సమయంలో "అమ్మా! నాకేది తీర్థం" అంటూ సత్యం కూడా ముందుకు వచ్చాడు.

ఆ వాతావరణంలో ఏదో కంపన బయలు దేరినట్లనిపించి విమల భయపడింది. కేశవరావు ఏమీ అర్థంకానట్లు చూస్తూ నిల్చుండిపోయాడు.

పంచ పాత్ర పాలరాతి గచ్చు మీద పడి వింత శబ్దం చేసింది. అందరూ ఆ మోతకు త్రుళ్ళిపడ్డారు. మాధవరావూ, సత్యమూ తూలిపోతున్న రాజమణీదేవిని పట్టుకొని చిన్నగా తివాచీ మీద పడుకోబెట్టారు.

పరిస్థితి అర్థంకాక విమల భయంతో బిగుసుకొని పోయింది. విమలను చూసి ఆమె మూర్ఛపోవటానికి కారణాన్ని ఊహించుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు కేశవరావు.

విమల ఆదుర్దాగా రాజమణీదేవి ముఖంలోకి చూసింది. మాధవరావు ఆమెతలను తన తొడ మీద పెట్టుకొని కూర్చున్నాడు. సత్యం గబగబా లోపలకు వెళ్ళి రెండు తలగడలు తెచ్చి ఆమె తలకింద పెట్టాడు. ఆమె ముఖంలోని మార్దవం అంతా ఏమయిందో ముఖంలో నరాలు తేలి, బాగాబిగుసుకొని కఠోరంగా కనిపిస్తుంది. చేతిగుప్పెట్లు కూడా మూసుకొని వున్నాయి.

సత్యం ఇన్‌హేలర్ తెచ్చి ఆమె ముక్కు దగ్గరవుంచాడు. కొంచెం సేపటికి ఆమె గుప్పెళ్లు తెరుచుకున్నాయి. ముఖంకూడా యాథాస్థితికి వచ్చింది. ప్రశాంతంగా నిద్రపోతున్నట్లు కనిపించింది. సత్యం ముఖం మీద నీళ్లు చల్లాడు ఆమె కళ్లు తెరచింది. కాని చూపులు ఎవర్నీ చూస్తున్నట్లు లేవు అసాధారణంగా వున్న ఆ చూపులకు విమల బెదిరిపోయింది. తమ ఆగమనం వల్లనే ఆమెకు మూర్ఛ వచ్చిందని గ్రహించిన కేశవరావు ముఖం చిన్నపుచ్చుకొని నిల్చుండిపోయాడు. ఆమె మళ్లీ కళ్ళుమూసుకుంది. మాధవరావు అక్కడ నుంచి లేచాడు.

"మేము రావటం వల్ల అమ్మగారికి మూర్ఛవచ్చినట్లుంది. నాకు చాలా బాధగా వుంది" అన్నాడు కేశవరావు.

"ఆమెకు చాలాకాలంనుంచి ఫిట్స్ వస్తున్నాయి. మరో అర్ధ గంటలో ఆమె మామూలు మనిషవుతారు" అన్నాడు మాధవరావు

"ఏకొంచెం మానసిక ఒత్తిడి కలిగినా ఇలాగే పడిపోతూ వుంటుంది" అన్నాడు సత్యం.

"నన్ను చూస్తూనే అదోలా అయిపోయారు" అంది విమల ఏదో తప్పు చేసిన దానిలా.

"అవునండీ! అమ్మాయి పేరు అడిగి పేరు చెప్పగానే చేతిలో గ్లాసు కింద పడిపోయింది" అన్నాడు కేశవరావు.

మాధవరావు ముఖంలో విషాద రేఖలు అలుముకున్నాయి. ఎప్పుడూ ఉత్సాహంగా వున్నట్లు కనిపించే అతనిలో ఇంత విషాదం దాగివుండటానికి కారణం ఏమిటో అనుకుంది విమల ఆ ఇంటి వైభవంలో ఏదో అపశృతి పలుకుతూ వున్నట్లు తోచింది కేశవరావుకు.

"నాకు ఒక చెల్లాయి వుండేది. చాలా సౌందర్యవతి. ముమ్మూర్తులా అమ్మపోలికే. అమ్మకు చెల్లాయి అంటే ప్రాణం. అమ్మ చెల్లాయిని చూసినంత ప్రేమగా నన్ను చూడటం లేదనే భావం నాలో అప్పుడప్పుడు కలిగి ఈర్ష్య పడేవాణ్ణి, అమ్మతో దెబ్బలాటకు దిగేవాణ్ణి! అమ్మ నవ్వుతో నన్ను దగ్గరకు తీసుకొనేది. నాన్న నాపక్షం వహించి అప్పుడప్పుడూ అమ్మను కోపగించుకొనేవాడు. చెల్లాయి చదువు హైస్కూలుతో ఆగిపోయింది. కాలేజీకి పంపించడం అమ్మకు ఇష్టం లేక పోయింది. ఇంట్లో వీణా, నాట్యం నేర్పించింది. పద్దెనిమిద్ది ఏళ్లు నిండాయి ఎన్ని సంబంధాలు వచ్చినా అమ్మకు నచ్చేవి కావు చివరకు ఆకివీడు జమిందారు కొడుక్కు నిశ్చితార్థాలు జరిగాయి అమ్మకళ్లు ఎప్పుడూ జమిందారుల వంశాలపై వుండేవి. అమ్మకు తనకూతురు రాణిగారు అని అని పించుకోవాలనే పిచ్చికోరిక వుండేది. మాచెల్లాయి కూడా అమ్మాలాగే ఆలోచిసూవుండేది. నా స్వభావం మానాన్నగారి స్వభావంలాంటిది నాన్న తనకూతురును జమిందార్ల ఇళ్లలో ఇవ్వటం అనే విషయాన్ని ఊహించ లేకుండా లేకపోయేవారు, మొత్తంమీద అమ్మ సాధించింది. మా చెల్లాయి అందం చూసి జమిందారుగారి భార్య ఈ సంబంధం చెయ్యాల్సిందేనని పట్టు పట్టిందట. ఆ అబ్బాయి సరేసరి. "నేను నాస్తికుణ్ణి. కాని అప్పుడప్పుడు విధిని నమ్మాలని అనిపిస్తూవుంటుంది కారణం మనిషి ఒకటి అనుకోవటం, మరొకటి అనుకోనివిధంగా సంభవించటమే కావచ్చు. పెళ్లిప్రయత్నాలు హడావిడిగా జరుగుతున్నాయి. ముహూర్తాలు నిశ్చయం అయాయి. అల్లుడికి బట్టలు కుట్టించుకోవటానికి నాన్నగారు పదివేల రూపాయిలు ఇచ్చారు. మాకు జమీందారీ లేదు. కాని చిన్న చిన్న జమీందార్లకు తీసుపోని ఆస్తి మాది. వివాహం ఇంకా పది రోజులుంది. ఆ రాత్రి చెల్లాయికి ఒళ్లు తెలియని జ్వరం ముంచుకొచ్చింది. పెద్ద పెద్ద డాక్టర్లు వచ్చారు. జ్వరం తగ్గలేదు. మూడోనాటికి చెల్లాయికి వచ్చింది మామలు జ్వరం కాదనీ, మశూచి అనీ తెలిసింది. అది విన్న అమ్మకు పూర్తిగా మతిపోయినట్లే అయింది. చెల్లాయి చనిపోతుందని మేము అనుకోలేదు. కాని మశూచి వచ్చాక జమీందారుగారి భార్య, మా చెల్లాయిని తన కోడలుగా చెసుకుంటుందో లేదో నన్న దిగులు మా అందరికీ పట్టుకుంది. కాని పదమూడో రోజు చెల్లాయి మమ్మందర్నీ వదలి వెళ్ళి పోయింది. దాంతో మాఇంటి వెలుగునే తీసుకెళ్ళి పోయింది. ఆనాటి నుంచి అమ్మకు ఫిట్స్ ప్రారంభం అయాయి. చెల్లాయిపోయిన ఆరునెల్లకే నాన్నగారు ఒక కారు యాక్సిడెంట్‌లో పోయారు. ఇక అమ్మ మానసిక పరిస్థితి నేను చెప్పకుండానే మీరు గ్రహించగలరు. అప్పటికీ ఇప్పటికీ అమ్మ బయట వెలుగును చూడలేదు. ఒకరితో మాట్లాడదు. ఏకాంత వాసం గడుపుతుంది. సత్యం వచ్చినప్పటి నుంచి కొంతనయం. సత్యం రోజూ కొంత సేపు అమ్మదగ్గర కూర్చుని పిచ్చాపాటీ చెబుతూ వుంటాడు". మాధవరావు గొంతు దుఃఖంతో పూర్తిగా పూడుక పోయింది.

విమల కళ్లు తుడుచుకుంది. కేశవరావు మనస్సు వికలమై పోయింది.

రాజమణీదేవి కళ్లు తెరిచింది. ఆమె దేనికోసమో చెయ్యి చాచింది. పెదవులు చిన్నగా కదిలాయి.

"ఏమ్మా ఏంకావలి?" సత్యం ఆమె దగ్గరకు వెళ్ళి అడిగాడు. ఆమె చిన్నగా ఏదో గొణిగింది. సత్యం విమల కేసి చూస్తూ "మిమ్మల్ని అమ్మ పిలుస్తోంది" అన్నాడు.

విమల దగ్గరకు వెళ్ళబోయి అంతలోనే తటపటాయిస్తూ నిలబడి పోయింది.

"భయిపడకండి. ఒకసారి ఫిట్‌వచ్చి తగ్గాక మళ్ళీ రాదు". అన్నాడు మాధవరావు.

విమల సంకోచంగానే వెళ్ళి రాజమణీదేవి తల దగ్గిర కూర్చుంది తన కుడి చేతిని చాచివున్న ఆమె చేతికి అందించింది.

లేచి కూర్చోవటానికి ప్రయత్నిస్తున్న రాజమణీదేవిని విమల ఆసరా ఇచ్చి లేపి కూర్చోపెట్టింది ఓ నిముషం ఆమె విమల ముఖంలోకి నిశితంగా చూసింది. ఎంతో సేపటికి ఆమె ముఖంలో సంతోష రేఖల్ని చూసి మాధవరావు సంతృప్తిగా నిట్టూర్చాడు.

"నిన్ను చూస్తుంటే ఎందుకో నా విమలనే చూసినట్లు అనిపిస్తుందమ్మా. రూపంలో పోలికలున్నా యని కాదు. అదేదో చిత్రమైన అనుభూతి నాలో కలుగుతోంది ఇవ్వాళ పూజలో నా విమల కనిపించింది, ఎదురుగా వచ్చి నిల్చింది. ఈ రెండు సంవత్సరాల్లో ఒక్క సారి కూడా కనిపించలేదు. పూజ ముగించి వెనక్కి చూశాను. నువ్వు నిల్చొని వున్నావు. నీ పేరు విమల అని చెప్పావు ఆనందం...దుఃఖం...మిళితమై లోతుగా కలిగిన ఆ అనుభూతికి తట్టుకోలేక పోయాను. నా చిట్టి ఇన్నాళ్ళకు ఈ రూపంలో నన్ను చేరుకుందనిపిస్తూంది" అంది రాజమణిదేవి విమల చెంపల్ని నిమురుతూ. విమల తల వంచుకొని కూర్చుంది. అలాంటి పరిస్థితిని ఎదుర్కోవడం ఎలాగో ఆమెకు అర్థం కావటం లేదు. ఆమె చూపిస్తున్న ఆదరణకు చలించిపోయింది విమల. కాని ఎలా కృతజ్ఞత చెప్పాలో ఊహించ లేకుండా వుంది.

"చెప్పడం మర్చాను మా చెల్లాయి పేరు కూడా విమల" అన్నాడు మాధవరావు.

రాజమణిదేవి తనచుట్టూ వున్న ప్రపంచాన్నే మర్చిపోయి విమలను ప్రశ్నల మీద ప్రశ్నలు వేస్తూ కూర్చుంది. సత్యం, కేశవరావు, కుతూహలంగా చూస్తూ వుండిపోయారు. మాధవరావు మాత్రం ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు

"ఏం తల్లీ! నాదగ్గరే వుండిపోతావా:"అంది తల నిమురుతూ రాజమణిదేవి.

విమల చివ్వున తల ఎత్తి చిత్రంగా చూసింది ఆమె ముఖంలోకి. కేశవరావు నమ్మ లేనట్లు చూశాడు. మాధవరావు తల్లి పిచ్చితనానికి బోలుగా నవ్వాడు. సత్యం మాత్రం ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు.

"ఏమ్మా! నా ప్రశ్న ఆశ్చర్యంగా వుందా ?"

విమల జవాబివ్వలేదు.

"నీకు ఇష్టం అయితే మీ అమ్మగార్నీ, నాన్నగార్నీ నేను అర్థిస్తాను" అంది రాజమణిదేవి.

"నాకు అమ్మ లేదండి!" అంది విమల బరువుగా!

"బాధపడకు తల్లీ! నేను మాత్రం నీ అమ్మనుగదూ?"

రాజమణిదేవి కంఠంలోని ఆర్ద్రతనూ, ఆదరణనూ, భరించ లేకపోయింది విమల. ఆమె కళ్ళలో నీరు తిరిగింది.

"ఏమండి కేశవరావుగారు! మీ అమ్మాయిని నాకు ఇస్తారా?"

"ఏమిటమ్మా నీ పిచ్చి " అన్నాడు మాధవరావు.

"ఇందులో తప్పేముంది బాబూ! అందరం ఒక ఊళ్లోనే వున్నాం. వస్తూ పోతూ ఉండొచ్చు."

కేశవరావు సమాధానం చెప్పలేదు. ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"ఈ అమ్మాయి ఎన్నో అమ్మాయి"అడిగింది రాజమణిదేవి

"పెద్దమ్మాయి ఈ అమ్మాయేనండి" అన్నాడు కేశవరావు.

"అదీ!అలాచెప్పండీ! పెళ్లిచేస్తే అత్తవారింటికి పంపంచరూ'

కేశవరావు ముఖం నల్లబడింది. విమల పెదవులు బిగబట్టుకొని కూర్చుంది. అదేమీ గమనించని రాజమణిదేవి తన ధోరణిలో మాట్లాడసాగింది.

"పోనీయ్! ఒకటి చెబుతాను అందరికీ సమ్మతం అయేది. మా అబ్బాయిని చూస్తున్నారుగా? బడుద్దాయికి సరిగా చదువైతే అబ్బలేదు గాని చాల బుద్ధిమంతుడు వ్యాపారంలో మంచి నేర్పు ఉన్నవాడు. మాకు ఆస్తి పాస్తులకు కొరతలేదు మీ అమ్మాయిని మా ఇంటికి కోడలుగా తెచ్చుకుంటానంటే మీకేం అభ్యంతరం ఉండదనే అనుకుంటాను" అంది రాజమణిదేవి.

కేశవరావు తలవంచుకొని కూర్చున్నాడు. విమలకు ఆ మాటలు ముందుగా అర్థంకాలేదు. అర్థంచేసుకొన్న వెంటనే వస్తున్న దుఃఖాన్ని దిగమింగుకుంటూ గదినుంచి బయటకు పారిపోయింది.

రాజమణిదేవి మాటలకు సత్యం సంతోషించాడు. కాని విమల ఏడుస్తూ పారిపోవడం చూసి తెల్లపోయాడు

మాధవరావుకు ముందు ఆశ్చర్యం వేసి, అంతలోనే చిరాకువేసింది ఎంతో సంయమనంగల తన తల్లి ఏమిటి ఈరోజు ఇలా పసిపిల్లలా బేలతనం చూపిస్తుంది.

"ఏమిటమ్మా ఇవ్వాళ నీకేమయింది. అవతలివాళ్ళ ఇష్టానిష్టాలు తెలుసుకోకుండా ఎందుకమ్మా అంతతొందర పడ్డావు?" మాధవరావు కంఠంలో, దెబ్బతిన్న అభిమానం తొంగిచూసింది.

రాజమణిదేవి తెల్లపోయి కూర్చుంది.

"ఇప్పుడు చూడమ్మా ఆ అమ్మాయికి ఎంతదుఃఖం కలిగించావో! కేవలం మనం మన అంతస్తుతో ఇతరుల మనస్సులను ఇట్టే కొనేయగలం అనుకోవటం కేవలం దురాభిమానం మాత్రమే అవుతుంది. కేశవరావుగారూ! క్షమించండి! అమ్మ త్వరపడ్డా కేవలం విమలమీద కలిగిన ఆపేక్షకొద్దీ, ఆమెను ఎలాగయినా తనదానిని చేసుకోవాలనే ఆత్రంకొద్దీ అలాఅంది. అంతేగాని మిమ్మల్ని గానీ, మీ అమ్మాయిని కానీ అవమానించాలని అమ్మ అభిప్రాయంకాదు " అన్నాడు మాధవరావు

"ఇష్టం లేకపోతే ఇష్టంలేదనే చెప్పాలి. ఇంత మాత్రానికే ఒకరు ఏడవటం, మరొకరు ముఖం ముడ్చుకోవటం ఎందుకో !" అనుకొంటూ లోలోపలే చిరాకుపడ్డాడు సత్యం.

కేశవరావు కళ్లు తుడుచుకున్నాడు.

"క్షమించండమ్మా ! అమ్మాయి అలా దుఃఖంతో పారిపోవటానికి గానీ, నేను బాధపడటానికి గానీ, కారణం మీ మాటలు

కాదు మీ ఆదరణనూ, ఆప్యాయతనూ పొందే అదృష్టం నా బిడ్డకు లేదు." కేశవరావు కంఠంలో మాటలు అడ్డుపడ్డాయి.

అందరూ కేశవరావు ముఖంలోకి అర్థంకానట్లు చూశారు.

"విమలకు వివాహం అయింది!"

"ఆఁ!" అంటూ తలెత్తి కేశవరావు ముఖంలోకి చూసింది

సత్యం వివాహం అయింది కాబోలు అనుకున్నాడు. మాధవరావు మనస్సు చివుక్కుమంది.

"అయ్యో? తెలియక అంతమాటఅనేశాను. అమ్మాయి మెళ్లో మంగళసూత్రాలుగానీ, ముఖానికి కుంకంబొట్టుగానీ, కనీసం బంగారు గాజులమధ్య ఓ మట్టిగాజైనా లేకపోవటంవల్ల పొరపాటు పడ్డాను." బాధామిళిత కంఠంతో అంది రాజమణి దేవి

"ఆ అర్హత విమలకు లేదమ్మా!" అన్నాడు కేశవరావు వణుకుతున్న కంఠంతో.

"అంటే?" మాధవరావు, సత్యం, ఒకేసారి ప్రశ్నించారు అర్థం అయిన రాజమణిదేవి జాలిగా కేశవరావు ముఖంలోకి చూసింది.

విమల వితంతువా? భగవంతుడు కొందరి జీవితాలతో ఇంత భయంకరమైన ఆట ఎందుకు ఆడుతాడో! రాజమణి దేవి శిలాప్రతిమలా వుండిపోయింది.

"ఏమిటి మాస్టారూ మీరంటున్నది? విమలకు వివాహం అయిందా? భర్త పోయాడా?" సత్యం బాధగా ప్రశ్నించాడు. మాధవరావు అనుకోకుండా తగిలిన షాక్‌నుంచి ఇంకా కోలుకోలేదు.

"అవును బాబూ! ఐదు సంవత్సరాలయింది విమల వివాహం జరిగి! పెళ్లి చేసుకోననీ, చదువుకుంటాననీ ఎంత మొత్తుకున్నా, వాళ్ళమ్మ విన్నదికాదు పెళ్లి పిల్లకు పెళ్లికాకపోతే చిన్నపిల్లకు ఎలా చెయ్యడం అని ఆమె భయం. నాకు ఆమె భయంలో నిజం లేకపోలేదనిపించింది. చివరకు ఇద్దరం కలిసి విమల్ని వివాహానికి బలవంతంగా ఒప్పించాం. కాని విధి క్రూరంగా నవ్వింది. కాలి పారాణి ఆరకముందే నొసటి కుంకుమ రాలిపోయింది. పసుపుబట్టలు విడవకముందే ఆమెబ్రతుకు బండలపాలైంది." కేశవరావు మరిక మాట్లాడలేకపోయాడు.

ఆ గదిలో గాలికూడా ఆ విషాధ గాథవింటూ ఓ క్షణం నిలిచిపోయిందా అన్నంతగావుంది ఆ వాతావరణం. "ఎలా జరిగిందీ? ఏం జరిగిందీ!" అని ప్రశ్నించాలనే ఆదుర్దా అందరికి కలిగింది. కాని ఎవరూ ప్రశ్నించ లేకపోయారు. కేశవరావే మళ్ళీచెప్పడం ప్రారంభించాడు;

"పెళ్లి మాఊళ్ళో చేశారు. పిల్లవాడి ఊరుకూడా మా ఊరికి దగ్గరోనేవుంది. వాళ్ళఊరు మా ఊరి కంటెకూడా చాలా చిన్నది. కుగ్రామం అనాలి. పెళ్ళికాగానే సవారిబళ్ళు బయలు దేరాయి. వేసవికాలం, సవారిబళ్ళు చేల గట్లమీదగా, చేలమధ్యగా పరుగెత్తుతున్నాయి. పెళ్లి కుమారుడు బి. ఏ. వరకు చదివాడు, కాని పాస్ కాలేదు. అతనికి గవర్నమెంటు ఉద్యోగం ఇష్టం లేదనీ, ఇంటిపట్టునే వుండి వ్యవసాయం చేసుకుంటాడని తెలిసే ఈ వివాహం చేశాను, బాగా స్థితిమంతుడే! పెండ్లి కుమారుడు తన ఎడ్లబండి నతనే తొట్లోకూర్చుని హుషారుగా తోలుతున్నాడు. చిన్నసైజు సందుల్లా వున్న కోడెడ్లను మా అల్లుడు అదిలించగానే పరుగులంకించుకున్నాయి. అతని వూరివాళ్ళు. కొందరు కుర్రాళ్లు సవారిబండు కట్టుకొచ్చారు. వాళ్ళు తమ తమ ఎడ్లను అదిలించారు. గజ్జెలు గణ గణమని మ్రోగుతూవుంటే, బాగా బలిసిన ఎడ్లు చేలకు అడ్డంపడి పరుగెత్తుతూవుంటే చూట్టానికి ఉత్సాహంగానేవుంది. కాని ఆ దృశ్యం భయాన్నికూడా కలిగించేదిగానే వుంది. పెద్దవాళ్ళం నెత్తీనోరు కొట్టుకున్నా కుర్రకారు విన్నారుకాదు. ఆ వయస్సు అలాంటిది. దానికి పరుగుతీయటమే తెలుసు. ఆగటం, ఆలోచించడం తెలియదు.

క్షణంలో సగం సేపట్లో ఏం జరిగిందో ఎవరికీ తెలియలేదు. ఎక్కడిబళ్ళు అక్కడ ఆగిపోయాయి. చిన్నా పెద్దల హాహాకారాలతో దిక్కులు వణికిపోయాయి ఒకబండి తాలుకు చక్రాలు గాలిలోకి లేచి నిల్చొని వున్నాయి. బండి ఇరుసుక్రింద ఇరుక్కుపోయిన వాళ్ళను లాగుతున్నారు. పసుపు బట్టలతోవున్న పెళ్లి కుమారుణ్ణి నెత్తురు మడుగులో చూశాను. అంతే, కళ్ళుతిరిగి పడిపోయాను. మూడురోజులకు బందరు ఆసుపత్రిలో స్పృహ వచ్చింది. అప్పుడుతెలిసింది, పెళ్లికొడుకుతోపాటు అదేబండిలో బావగారితో సరసాలాడుతూ కూర్చున్న నా చిన్నకూతురు కూడా చనిపోయింది. ఆ ఘోరాన్ని చూసిన నా భార్యకు మతి చలించింది. విమల చాలా నిర్లిప్తంగా కనిపించింది. సంవత్సరం తిరక్కుండానే మతి చలించిన నా భార్యకూడా పోయింది. ఆ తరువాతే అమ్మాయిని ఎం. ఏ. చదివించాను. కాలేజిలో లెక్చరర్‌గా చేరింది. ఇదీ మా కథ!" అన్నాడు కేశవరావు బరువుగా నిట్టూరుస్తూ.

పైట కొంగుతో కళ్ళొత్తుకుంటూ రాజమణీ దేవి గదినుండి బయటకు వెళ్లిపోయింది.

"మళ్ళీ వివాహం చేయకపోయారూ?" అన్నాడు సత్యం.

కేశవరావు ఓ క్షణం మౌనంగా సత్యం ముఖంలోకి చూశాడు.

"అమ్మాయిని ఆ ప్రశ్నవేసే ధైర్యం నాకులేదు. మొదటి వివాహానికే ఆమె ఒప్పుకోలేదు. చాలా గంభీరంగా వుండే విమల దగ్గర, కన్నతండ్రినైనా వుండికూడా ఆమె భవిష్యత్తుగురించి నేనేమీ ప్రశ్నించలేక పోతున్నాను." అన్నాడు కేశవరావు.

ముగ్గురూ మౌనంగా వరండాలోకి వచ్చారు.

విమలను రాజమణీదేవి తన రెండు చేతులతో పొదివి పట్టుకొని వుంది. విమల ఆమె గుండెల్లో తలదాచుకొని వెక్కి వెక్కి ఏడుస్తూవుంది.

( సశేషము )

# వెలిచేరు పంచాయతి

—జి. పుల్లయ్య

వెలిచేరు చాలా చిన్న గ్రామం. ఇది తూర్పు గోదావరి జిల్లాలో నందనోద్యానమనదగిన కోనసీమలో కొత్తపేట పంచాయితీ సమితిలో కోనసీమకు ముఖ ద్వారమైన బొబ్బర్లంకకు 4 మైళ్ళ దూరంలోను, కొత్తపేటకు 16 మైళ్ళ దూరంలో వుంది. కొత్తపేట నుండి బొబ్బర్లంకకు బస్సు సౌకర్యము వుంది. ఇది వశిష్ట నదీ తీరము. దీని శివారు గ్రామమైన ఊదలమ్మగమళ్ళ పాలెంగౌతమీ తీరంలో వుంది. అంటే గౌతమీ వశిష్టలను కలుపుతూ వెలిచేరు గ్రామం వుంది.

వెలిచేరు పంచాయతీ వెలసినప్పటినుండి దృఢమైన నాయకత్వముతో స్థిరమైన ఆశయాలతో నిర్మాణాత్మకమైన ఆశయాలతో నిర్మాణాత్మకమైన కార్యక్రమాలు అమలు జరిపి నవోదయంవైపు పురోగమించింది. వెలిచేరు గ్రామ విస్తీర్ణము 2.46 చ॥ మైళ్ళు దీని జనాభా 2389. గ్రామ పంచాయతీ సభ్యుల సంఖ్య 9. గ్రామ పంచాయతీకి స్వంత భవనం వుంది. శ్రీ కోడూరు సుబ్బారాయుడు గారు పంచాయతీ భవన నిర్మాణం చేశారు. పంచాయతీ భవనానికి స్థలం వుచితముగా సమకూర్చడమేగాక రు. 2000 లు విరాళము యిచ్చారు. భవనం మొత్తం ఖర్చు రు. 6,200 లు. పంచాయతీ ఆదాయం రు. 1458.

## ఆధునిక పద్ధతులలో వ్యవసాయము

పంచాయతీ రాజ్యవ్యవస్థకు పూర్వం వెలిచేరు గ్రామంలో రాగులు తమిదులు, సజ్జలు, వరి మొదలగు పంటలను మాత్రము పండించేవారు. వెలిచేరు గ్రామంలో పరిసర ప్రాంతంలో కాలువ లున్నప్పటికి నీటి సదుపాయములేని మెట్ట నేలలందు యితర పంటలు పండించవలసివచ్చేది. కాని ఆధునిక పద్ధతులను ఆచరణలో పెట్టి ప్రస్తుతము వరి, చెఱకు, అరటి మున్నగు పంటలు పండించి మంచి దిగుబడిని సాధించారు. బెల్లము ఎకరానికి 35 పుట్లు దిగుబడివచ్చింది. శ్రీ ముళ్ళపూడి రామచంద్రరావు (పేరవరము కాపురస్తులు—వ్యవసాయము వెలిచేరులో) శ్రీ వేగిన సూరరాజు (యువజన సంఘ అధ్యక్షుడు)గారులు అధిక దిగుబడి సాధించి మిగిలిన రైతులకు ఆదర్శప్రాయమైనారు. వ్యవసాయాభివృద్ధికిగాను గ్రామ పంచాయతీ 2 స్ప్రేయర్లు, రైతులు 10 స్ప్రేయర్లు, ఇనుపనాగలి, ఒక ట్రాక్టరు సమకూర్చుకున్నారు. వ్యవసాయ విస్తరణాధికారుల ప్రోత్సాహంతో యీ సంవత్సరము సహకార సంఘాల ఆధీనంలోవున్న లంక భూముల్లో 25 ఎకరాల్లో హైబ్రీడు జొన్న పండించి ఖర్చులు పోను ఎకరానికి రు. 550 లు ప్రతిఫలం పొందారు. గ్రామ పంచాయతీ రు. 1500 లు, విలువ ఎండ్రిన్ మందులు, 500 రూ. విలువగల గలఫేరా మారుకొని లాభనష్టములు లేని పద్ధతిన రైతులకు సరఫరా చేసింది. ఈ పద్ధతి ప్రోత్సాహకరంగా వున్నందున యీ సంవత్సరం సహకార సంఘాలద్వారా యెక్కువ పరిమితిలో ఐ. ఆర్ 8, వరి వంగడము, తదితర నూతన వరి వంగడములు అమలుపరచి యెక్కువ ప్రతిఫలం రాబట్టటంద్వారా ఎంతో కృషి జరిగింది. ఈ సందర్భంలో పచ్చిఆకు రొట్ట తుప్పలు పండించుటలో కృతకృత్యులైన శ్రీ కోడూరి సుబ్బారాయుడు గారికి జిల్లా వ్యవసాయాధికారులు ప్రత్యేక బహుమతి నిచ్చి కొని యాడారు 100 అరటి మొక్కలను నాటి వనమహోత్సవం జరిపారు.

## ప్రాథమిక విద్య

వెలిచేరు గ్రామమున ఒక ఉన్నత ప్రాథమిక పాఠశాల, ఒక సాంఘిక ప్రాథమిక పాఠశాల, ఒక ప్రాథమిక పాఠశాల మొత్తం 3 పాఠశాలలు వున్నాయి. ఈ పాఠశాలల్లోపనిచేయు ఉపాధ్యాయుల సంఖ్య 13, విద్యార్థుల సంఖ్య 450. భవన నిర్మాణానికి 19,790 రూ. లు ఖర్చు అయింది. దానిలో ప్రజలు విరాళంగా యిచ్చింది 4400 రూ.లు. పాఠశాలలకు స్థలము వుచితముగా లభించింది

## రహదారులు:

గ్రామములోని వివిధ భాగములను కలుపు రోడ్డు నిర్మించుకొన్నారు. రహదారులకు 5,130 రూ.లు ఆరోగ్య పథకములకు 5,550 రూ లు ఖర్చు జరిగింది. దానిలో ప్రజా విరాళము 5,155 రూపాయలు.

## సహకారము

ఇక్కడి పరపతి సహకార సంఘ షేరు ధనము 7,500రూ.లు. సహకార సభ్యులకు స్వల్పకాల ఋణాలు 40,000 రూ.లు, మధ్యకాల ఋణాలు 20,000 రూ లు సమకూర్చారు. సమిష్టి వ్యవసాయ పరపతి సంఘం యొక్క కృషి గణనీయమైనది. భూమిలేని పేదవారు యీ సంఘంలో సభ్యులు హరిజనులకు ప్రత్యేక సంఘం కలదు ఆ సంఘము సభ్యుల సంఖ్య 375. ఈ సంఘముల ద్వారా లంక భూములు యకరములు 250 వీరికి సంక్రమించినవి. తద్వారా వీరి జీవన ప్రమాణము పెంపొందుతున్నది. 12 మంది పారిశ్రామికులకు 34 పౌనుల నైలాను నూలు 1/6 వంతు సబ్సిడీ పద్ధతిపై యివ్వబడింది.

# బోధనా భాషగా మాతృభాష

ఆంధ్రప్రదేశ్‌లో హయ్యర్ సెకండరీ స్థాయిలో చాలా కాలంగానే తెలుగు బోధనాభాషగా వుంటున్నది. రాష్ట్ర ప్రభుత్వం అధికార భాషా చట్టాన్ని చేసి తెలుగుభాషను ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధికార భాషగా ప్రకటించింది.

ఉన్నత స్థాయిలో బోధనకు, పరిపాలనకు వీలుగా తెలుగు భాషను మరింత శక్తివంతంగా చేయడానికై అవసరమైన ప్రతిపాదనలను చేసే ఉద్దేశంతో నాటి ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ కార్యదర్శి శ్రీ జె. పి. గ్విన్, ఐ. సి. ఎస్. అధ్యక్షతన నిపుణుల సంఘాన్ని ఒకదానిని 1966 డిశంబరులో రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ఆ సంఘం తదనుగుణంగా 1967 ఏప్రిల్‌లో ఒక నివేదికను సమర్పించింది. అందులో, పైన పేర్కొన్న ప్రయోజనాలను సాధించేందుకు రాష్ట్ర స్థాయిలో తెలుగు సంస్థనొకదానిని ఏర్పాటు చేయాలని సిఫారసు చేయడం జరిగింది.

కళాశాలల్లో బోధనా భాషగా తెలుగును ప్రవేశ పెట్టాలనే విషయం చాలా కాలంగా పరిశీలనలోవుంది. అయితే 1966 నాటి కొఠారి కమిషను నివేదిక యీ ఆలోచనకు ఒక స్థూలమైన రూపాన్ని యిచ్చింది ఈ నివేదికలోని ప్రధాన విషయాలను భారత ప్రభుత్వం అంగీకరించింది. దానితో, ప్రాంతీయ భాషల్లో ఉన్నత స్థాయి విద్యకు అవసరమైన పాఠ్య గ్రంథాలను వ్రాయించడం, వాటిని ప్రచురించడం తప్పనిసరి అయింది.

విశ్వ విద్యాలయ స్థాయిలో పాఠ్యగ్రంథాలను తయారు చేయడానికై భారత ప్రభుత్వంకూడా 1967 జూలైలో బృహత్ప్రణాళికను రూపొందించి అన్ని రాష్ట్ర ప్రభుత్వాలకు అందజేసింది.

గ్విన్ కమిటీ నివేదిక కారణంగానూ, విశ్వ విద్యాలయ స్థాయిలో పాఠ్య గ్రంథాలను రూపొందించాలన్న కేంద్ర ప్రభుత్వ ప్రణాళిక కారణంగానూ "తెలుగు అకాడమీ" అనబడే రాష్ట్ర స్థాయి తెలుగు సంస్థ ఆవిర్భవించింది. 1968 ఆగష్టు 6 వ తేదీన యీ తెలుగు అకాడమీ వ్యవస్థాపితమైంది.

తెలుగు అకాడమీ స్వతంత్ర ప్రతిపత్తిగల ఒక వ్యవస్థ. కొంతమంది నిర్వాహక సభ్యులతో కూడిన మండలి దీనిని నడిపిస్తుంది. ఈ మండలికి విద్యా మంత్రి అధ్యక్షులు. రాష్ట్రంలోని నాలుగు విశ్వ విద్యాలయాల ఉపాధ్యక్షులు, విద్యాశాఖ కార్యదర్శి, విద్యా శాఖ డైరెక్టరు, సాంకేతిక విద్యాశాఖ డైరెక్టరు, న్యాయ శాఖలో అధికార భాషా వ్యవహారాలను చూసే ఉప కార్యదర్శి (అంటే న్యాయ శాఖలోని అనువాద విభాగంలోగల సభ్యుడు-కార్యదర్శి), ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షుడు, ఆంధ్రప్రదేశ్ సైన్స్ అకాడమీ అధ్యక్షుడు-వీరుసభ్యులు. తెలుగులో ముగ్గురు పేరుమోసిన పండితులుకూడా అనధికారులనుంచి ఇందులో సభ్యులుగాకూడా వుంటారు. విద్యాశాఖ కార్యదర్శి, ఒకరి తరువాత ఒకరు చొప్పున విశ్వ విద్యాలయాల వైస్ ఛాన్సలర్లూ యీ అకాడమీకి ఉపాధ్యక్షులుగా వుంటారు. ఈ సంస్థకు డైరెక్టరును నియమించేవరకు, ప్రస్తుతం యిది నెలకొల్పబడినప్పటినించీ దీని నిర్వహణ కార్యక్రమాలను చూడడానికై ఒక ప్రత్యేక అధికారిని నియమించడం జరిగింది.

ఈ దిగువ పేర్కొనబడిన మూడు విభాగాల ద్వారా తెలుగు అకాడమీ తన పథకాలను అమలు పరుస్తుంది

1. పరిశోధన
2. శిక్షణ
3. ప్రచురణ

తెలుగును అన్ని స్థాయిలలోనూ, అధికార భాషగా పరిపాలనా వ్యవహారాలలోనూ, బోధనా భాషగా విద్యా సంస్థలలోనూ ప్రవేశ పెట్టడంలో ఎలాటి ఒడుదుడుకులూ లేకుండా సాఫీగా సాగిపోవడానికి యీ మూడు విభాగాల సమన్వయ కృషి దోహదం చేస్తుంది.

తెలుగు అకాడమీ ఎందుకు నెలకొల్పబడినదో ఆ లక్ష్యాలను సాధించేందుకుగాను తన మూడు విభాగాల ద్వారా యీ అకాడమీ అనేక పథకాలను చేపట్టింది. అవి_

తొలి సంవత్సరం చేపట్టినవి :

(అ) తెలుగులో సాంకేతిక పదాలను స్థిరీకరించడం

(ఆ) విశ్వవిద్యాలయ తరగతుల నిమిత్తం తెలుగులో పాఠ్యగ్రంథాలను తయారు చేయడం

(ఇ) పరిపాలనా వ్యవహారాలలో తెలుగును ప్రవేశ పెట్టే టప్పుడు యీమార్పు ఏవిధమైన ప్రతిబంధకంగానూ వుండకుండావుండేందుకై తెలుగు తెలియని అధికారులకు తెలుగులో శిక్షణా తరగతులను నిర్వహించడం.

(ఈ) రాష్ట్రమంతటా ఆయా పాఠ్యాంశాలకు సంబంధించిన అధ్యాపకులకు పునశ్చరణ శిక్షణ తరగతులను నిర్వహించడం.

(ఉ) వివిధ సబ్జక్టులలో తెలుగులో బిబ్లియోగ్రఫీలను సంకలించి ప్రచురించడం.

(ఊ) ఆధునిక తెలుగు భాషకు వ్యాకరణాన్ని రూపొందించడానికై వస్తుసేకరణ నిమిత్తం ఆయాప్రాంతాలలో సర్వేలను జరిపించడం

రెండవ సంవత్సరం చేపట్టాలని ఉద్దేశించినవి :

(అ) సబ్జక్టులవారీగా ఇంగ్లీషు తెలుగు నిఘంటువులను, ఇతర రిఫరెన్సు పుస్తకాలను తయారు చేయడం.

(ఆ) ఇతర విదేశీ భాషల్లోని ప్రామాణిక గ్రంథాలను అనువదించడం.

(ఇ) శాస్త్ర విషయాలపై రచనలను ప్రోత్సహించేందుకై త్రైమాసపత్రికను ప్రచురించడం.

(ఈ) డా. నేలటూరి వెంకటరమణయ్యగారు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు 1943లో సూచించిన పథకం ప్రకారం "ఆంధ్రుల చరిత్ర సంస్కృతి"ని సమగ్రంగా నాలుగు సంపుటాలలో ప్రచురించడం.

రాష్ట్రమంతటా ఒకే పాఠ్యాంశం, ఒకే తరహా పరీక్షలు ఉండాలని రాష్ట్రంలోని అన్ని విశ్వవిద్యాలయాలూ అంగీకరించాయి. అయితే కొత్త పాఠ్యాంశానికి సంబంధించి ప్రస్తుతం పాఠ్య గ్రంథాలేమీలేవు. అందుచేత తెలుగులో మౌలిక పాఠ్య గ్రంథాలను ప్రచురించాలని తెలుగు అకాడమీ ఉద్దేశించింది. రేండేళ్ళ ఇంటర్మీడియేట్ కోర్సులో తొలి సంవత్సరానికి వివిధ పాఠ్యాంశాలలో సుమారు 30 పాఠ్యపుస్తకాలు అవసరమౌతాయనీ, రెండో సంవత్సరానికికూడా యించుమించు అంతే సంఖ్యలో పుస్తకాలు కావలసివస్తాయనీ అంచనావేశారు. (డిగ్రీ తరగతులకు, ఆ తర్వాత పోస్టుగ్రాడ్యుయేటు తరగతులకు కూడా క్రమంగా పాఠ్య గ్రంథాలను రూపొందించడం జరుగుతుంది).

తెలుగు అకాడమీ తయారుచేస్తున్న పాఠ్యగ్రంథాలను కొత్తగా ప్రవేశపెడుతున్న రెండేళ్ళ ఇంటర్మీడియేట్ తరగతుల్లో రెండేళ్ళపాటు ప్రవేశపెట్టాలని ఇటీవల విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు జరిపిన సమావేశంలో నిశ్చయించారు. తదనుగుణంగా ప్రభుత్వం ఉత్తర్వులనుకూడా జారీచేసింది ఇందువల్ల కొన్ని పుస్తకాలకు ఒక్కొక్కదానికి 50,000 ప్రతులను ప్రచురించవలసి వుంది.

ప్రస్తుతం ఈ దిగువ పాఠ్య గ్రంథాలు అచ్చుపూర్తయి విడుదలకు సిద్ధంగా వున్నాయి.

1. గణిత శాస్త్రము (బీజగణితము), 2. గణిత శాస్త్రము, (త్రికోణమితి, సాంఖ్యక శాస్త్రాలు), 3. సామాన్య గణితశాస్త్రము (బీజగణిత, సాంఖ్యక శాస్త్రాలు), 4. భౌతిక శాస్త్రము (రెండు సంపుటాలు), 5. భౌతికశాస్త్ర ప్రయోగ దీపిక, 6. రసాయన శాస్త్రము, 7. రసాయనశాస్త్ర ప్రయోగదీపిక, 8. వృక్ష శాస్త్రము (రెండు సంపుటాలు), 9. జంతు శాస్త్రము, 10 జంతుశాస్త్ర ప్రయోగ దీపిక, 11. సామాన్య జీవశాస్త్రము, 12. వాణిజ్య శాస్త్రము (ప్రాథమిక సూత్రాలు), 13. వ్యాపార గణక శాస్త్రము (రెండు సంపుటాలు), 14. అర్థ శాస్త్రము (ప్రాథమిక సూత్రాలు) 15. భారత దేశము–ఆర్థికాభివృద్ధి. 16. భారతదేశ చరిత్ర, 17. ప్రపంచ చరిత్ర, 18. జగాన్ దేశ చరిత్ర, 19. పురాతత్వ శాస్త్రము (ప్రాథమిక సూత్రాలు), 20. పౌర శాస్త్రము 21. తర్క శాస్త్రము, 22. భూగోళ శాస్త్రము, 23. గృహ నిర్వహణ శాస్త్రము (అయిదు సంపుటాలు).



తెలుగు అకాడమీ ప్రచురించిన పాఠ్యగ్రంథాలను ఆగస్టు 29న ఆవిష్కరిస్తున్న ముఖ్యమంత్రి

పాఠ్యాంశం కొత్తదికావడంచేత ప్రస్తుతంవున్న గ్రంథాల నుంచి అనువదించడానికిగల అవకాశాలు చాలా పరిమితం. ఒక ప్రత్యేకమైన సబ్జెక్టులో మౌలికంగా తెలుగులో వ్రాయగల సమర్థుడైన వ్యక్తి లభించనప్పుడు అనువాదపు పనిని పరిమితంగానే చేపట్టడం జరుగుతుంది. అయితే విదేశీ ప్రామాణిక గ్రంథాల విషయంలో భారతప్రభుత్వం కాపీరైటు సంపాదించడంతోనే వాటి అనువాదాన్ని చేపట్టడానికి తెలుగు అకాడమీ సిద్ధంగావుంది.

రాష్ట్రంలో అటు గ్రాంథిక భాషావాదులకు, ఇటు వ్యవహారిక భాషావాదులకు ఆమోదయోగ్యమైన తెలుగు రచనాశైలి నొకదానిని రూపొందించడం అవసరమని 1965లో ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి అధ్యక్షతన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏర్పాటుచేసిన సంఘం అభిప్రాయపడింది. తెలుగును తొలిభాషగా తీసుకొని తెలుగు సాహిత్యాన్ని అధ్యయనంచేసే విద్యార్థులు తప్పనిసరిగా గ్రాంథిక భాషలో వ్రాసిన గ్రంథాలనే చదవాలనీ, సైన్సు తదితర భాషేతర సబ్జెక్టులను అధ్యయనంచేసే విద్యార్థులు వ్యవహారిక భాషలో వ్రాసిన గ్రంథాలను చదవాలని ఈ సంఘంచేసిన సిఫారసులను ప్రభుత్వం ఆమోదించింది. ఇదే నిర్ణయాన్ని గ్విన్ కమిటీకూడా తెలియజేసింది. తెలుగు అకాడమీ వివిధ అంశాలకు సంబంధించిన వ్రాత ప్రతులను సిద్ధంచేయించేటప్పుడు శ్రీ పింగళి

లక్ష్మీకాంతం కమిటీచేసిన సిఫారసులనూ, తెలుగు అకాడమీ ఏర్పాటుచేసిన నిపుణుల సంఘాల సిఫారసులనూ తెలుగు అకాడమీ దృష్టిలో వుంచుకునే వ్యవహరిస్తుంది.

ఇక సాంకేతిక పదాలకు సంబంధించి ఉమ్మడి మద్రాసు రాష్ట్రం, భారత ప్రభుత్వం, శాస్త్రీయ సాంకేతిక పదవిషయిక కమిషను యింతవరకు ముద్రించి ప్రచురించిన పారిభాషిక పద కోశాలనుబట్టీ, రాష్ట్రంలో జాతీయంచేయబడిన పాఠ్యగ్రంథాలలోను, ఇతర ప్రసిద్ధ రచనల్లోనూ వాడిన పదాలను బట్టీ తెలుగు అకాడమీ సాంకేతిక పదజాలాన్ని కూర్చినది. తెలుగు అకాడమీ నియమించిన గ్రంథకర్తలు, నిపుణులు కూడా కొన్ని ప్రయోజనకరమైన పారిభాషిక పదకోశాలను తయారుచేశారు. మూడు విశ్వవిద్యాలయాలకు చెందిన ఆయా సబ్జెక్టుల్లోని నిపుణులూ తెలుగు అకాడమీకి చెందిన భాషావేత్తలూ ప్రత్యేకసమావేశాలు జరిపి అంతిమంగా పారిభాషిక పదజాలాన్ని రూపొందించారు. తెలుగు అకాడమీ ప్రచురించే పాఠ్యగ్రంథాలలో యీ పదజాలాన్ని వుపయోగించడం జరుగుతున్నది. విద్యార్థులకు తక్షణ ప్రయోజనకరంగా వుండేందుకై ప్రతి పాఠ్య గ్రంథం చివరలోనూ అకారాది క్రమంలో సాంకేతిక పారిభాషిక పదాలను అనుబంధంగా జతపరచడం జరుగుతున్నది. పుస్తకంలోపలకూడా ఎక్కడైనా తెలుగు సాంకేతిక పదం ప్రయోగించబడినప్పుడు దాని ప్రక్కనే బ్రాకెట్లలో దానికి సమానార్థమిచ్చే యింగ్లీషు పదంకూడా చేర్చబడుతున్నది.

అకాడమీ ప్రచురణలు, ప్రయివేటు సంస్థలు ప్రచురించే ప్రచురణలు, తరగతిలో బోధించే ప్రత్యక్ష అనుభవాన్నిబట్టి అధ్యాపకులు సృష్టించే పదాలు మొదలైన వాటిలో కనిపించే కొత్త పారిభాషిక పదాలను యిప్పుడు తెలుగు అకాడమీ తయారుచేసిన పారిభాషిక పదకోశంలో చేర్చి పునర్ముద్రించడం జరుగుతుంది. ఇటువంటి కొత్తమాటలను కూడా అకాడమీ భాషావేత్తలూ, నిపుణులూ క్షుణ్ణంగా పరిశీలించిన మీదటనే వాటిని పదకోశంలో చేర్చుతారు

కళాశాల స్థాయిలో పాఠ్యగ్రంథాలను ప్రచురించడానికి తెలుగు అకాడమీకి వ్యవధి తక్కువవుండడంవల్ల ముందు రెండేళ్ళ ఇంటర్మీడియేట్ తొలిసంవత్సరానికి మాత్రమే పాఠ్యగ్రంథాలను రూపొందించి ప్రాధాన్యతాక్రమంలో వాటిని ప్రచురించడం జరుగుతున్నది.

(i) ప్రతి సబ్జెక్టుకు ఒక నిపుణుల సంఘంవుంది. దీనిలో ముగ్గురు సభ్యులున్నారు రాష్ట్రంలోవున్న మూడు విశ్వవిద్యాలయాలలోనూ ఆ సబ్జెక్టులలో వీరు శాఖాధిపతులై వుంటారు. (ఒకవేళ ఏ శాఖాధిపతికి అయినా తెలుగు రాకపోతే అతనికన్న దిగువ హోదాలలో వున్నతరువాత వ్యక్తి నిపుణుల సంఘంలో సభ్యుడు అవుతాడు)

(ii) పాఠ్యగ్రంథాలను రూపొందించే నిమిత్తం ఆయా శాఖలలో విశేష ప్రజ్ఞాప్రాభవాలుగల రచయితల అజమాయిషి క్రింద అనుభవజ్ఞులైన రచయితలు (రచయితలు ఉపాధ్యాయులు, అధ్యాపకులు రీడర్లు)తో కూడిన బృందాలను ఏర్పాటు చేయడం జరిగింది. ఇవి పనిచేయడం ప్రారంభించాయి. రచయితలు, సంపాదకులు గల బృందానికి అధ్యాయాలను ప్రతి నిపుణుల సంఘం పంపిణీ చేస్తుంది. (అంటే ఒక పాఠ్యగ్రంథాన్ని ఏ ఒక్క వ్యక్తీ వ్రాయడు. దానిని ఒక నిపుణుల బృందంకలిసి వ్రాస్తుంది. అదే సంపాదకత్వం వహిస్తుంది)

(iii) ఆ విధంగా తయారు చేసిన ప్రతివ్రాత ప్రతినీ అనుభవజ్ఞులైన అధ్యాపకులతో కూడిన "వర్క్‌షాప్"లలో క్షుణ్ణంగా పరిశీలించడం జరుగుతుంది. అక్కడ చేసిన వ్యాఖ్యానాలను పురస్కరించుకుని అవసరమైతే ఆ వ్రాతప్రతిని సవరించనుకూడా సవరిస్తారు.

(iv) అంతిమంగా నిపుణుల సంఘం యీ వ్రాతప్రతులను పరిశీలించి, అవసరమైన మార్పులుచేసి, దానిని ముద్రణకు పంపిస్తుంది.

పైన చెప్పినట్టుగా, డిగ్రీస్థాయివరకు కావలసిన మౌలిక పాఠ్యగ్రంథాలను రానున్న అయిదేళ్ళలో– అంటే 1969–73 మధ్య తయారుచేయడం జరుగుతుంది. ఆ తర్వాత పోస్టుగ్రాడ్యుయేటు స్థాయి పాఠ్యగ్రంథాలను తయారుచేయడానికి ఈ అకాడమీ పూనుకుంటుంది.

విశ్వవిద్యాలయ స్థాయిలో ఆంగ్లంనించి తెలుగులోనికి బోధనా భాష మార్పుచెందే యీ సంధిసమయంలో విద్యాప్రమాణాలు ఏ మాత్రం పడిపోకుండా రాష్ట్ర ప్రభుత్వమూ, విశ్వవిద్యాలయాలూ, తెలుగు అకాడమీ అన్నిజాగ్రత్తలూ తీసుకుంటున్నవి. రచయితలు, గ్రంథకర్తలను ప్రోత్సహించే వుద్దేశంతో వారికి తెలుగు అకాడమీ పెద్దమొత్తాలలో ప్రతిఫలాలను యివ్వాలని ఉద్దేశిస్తున్నది.

త్వరలోనే నేరుగా కళాశాలలకే అచ్చయిన పాఠ్యగ్రంథాలను ఈ అకాడమీ పంపించడం ప్రారంభిస్తుంది. ఇది 1968 నవంబరు 1 నించే ఒకపద్ధతిలో పనిచేయడం మొదలుపెట్టింది. అయినప్పటికీ అతి త్వరలోనే–అంటే రెండేళ్ళ ఇంటర్మీడియేట్ కోర్సు తొలి సంవత్సరంలోకి విద్యార్థులను చేర్చుకోవడం కాగానే– తరగతులకు పాఠ్య గ్రంథాలను సరఫరాచేసే స్థితిలో ఈ అకాడమీ వుంది. రెండో ఏడాదికి అవసరమయ్యే పాఠ్యగ్రంథాలను రూపొందించేపని అప్పుడే ప్రారంభించడం జరిగింది వచ్చే ఏడాది చాలా ముందుగానే–అంటే 1970 మే మాసాంతం నాటికే–వీటిని అందజేయగలుగుతుంది.

తెలుగు అకాడమీ ప్రచురించే పుస్తకాల ధరలను 'లాభనష్టాలు' లేనిప్రాతిపదిక మీద నిర్ణయిస్తారు.

కొద్దిపాటి ఆదాయవర్గాలకు చెందిన విద్యార్థులకుకూడా యీ పాఠ్యగ్రంథాలు అందుబాటులో వుండగలవు. ఈ ఏడాది విడుదలచేసే పుస్తకాలకు $\frac{1}{8}$ డెమ్మీ సైజుగల పుస్తకంలో పేజీ ఒక్కింటికి $1\frac{1}{2}$ పైసలు చొప్పున లెక్కగట్టి పుస్తకం ధరను నిర్ణయించాలని భావించారు.

ప్రామాణికమైన మౌలిక పాఠ్యగ్రంథాలను ప్రచురించడంతోపాటు ప్రతి పాఠ్యాంశానికి తత్సంబంధమైన ఒక్కొక్క నిఘంటువును కూడా తెలుగు అకాడమీ ప్రచురించాలని తలపెట్టింది. ఇంటర్మీడియేట్ రెండో సంవత్సరం పాఠ్యగ్రంథాల ప్రచురణ కూడా పూర్తయిన తర్వాత యీ నిఘంటువుల ప్రచురణను చేపట్టడం జరుగుతుంది

వివిధ సబ్జెక్టులపై ఎన్నెన్ని గ్రంథాలు తెలుగులో లభ్యమౌతాయో ఆ వివరాలన్నీ క్షుణ్ణంగా పరిశీలించడం జరుగుతోంది. త్వరలోనే ఒక వివరణ పట్టికను కూడా అకాడమీ ప్రచురించనున్నది. దీనివల్ల వివిధ అంశాలకు సంబంధించి అదనంగా చదువుకోవడానికి విద్యార్థులకు యిది ఎంతో ప్రయోజనకారి కాగలదు.

తెలుగురాని అధికారుల నిమిత్తం యీ దిగువ పేర్కొన్న విధంగా తరగతులను నిర్వహించాలని తెలుగు అకాడమీ ఉద్దేశించింది:—

(అ) కొద్దిపాటి తెలుగు భాషా పరిజ్ఞానంగల అధికారుల నిమిత్తం ఆరు వారాల కోర్సు (ఇటీవలే యిటువంటి ఆరువారాల కోర్సును విజయవంతంగా నిర్వహించడం జరిగింది)

(ఆ) ఏ మాత్రం తెలుగుభాషా పరిజ్ఞానంలేక అ ఆ ఇ మొదలుపెట్టి నేర్వ వలసిన అధికారుల నిమిత్తం నాలుగు నెలల కోర్సు.

కొత్తగా ప్రవేశపెడుతున్న ఇంటర్మీడియేట్ తరగతుల పాఠ్యాంశాలను బోధించనున్న అధ్యాపకులకు పునశ్చరణ శిక్షణ తరగతులను ఏర్పాటుచేయడం తక్షణ కర్తవ్యం. ప్రస్తుతం రాష్ట్రంలో సుమారు 150 కళాశాలలు వున్నాయి. ఈ ఏడాది వందకు పైగా జూనియర్ కళాశాలలను ప్రారంభించనున్నారు. ఇక్కడ పన్నెండు పాఠ్యాంశాలు బోధిస్తారు. అవి—గణితశాస్త్రం, భౌతికశాస్త్రం, రసాయనిక శాస్త్రం, జంతుశాస్త్రం, వృక్షశాస్త్రం, గృహవిజ్ఞానశాస్త్రం, ఆర్థికశాస్త్రం, చరిత్ర, వాణిజ్యం, తర్కశాస్త్రం, పౌరశాస్త్రం, భూగోళ చరిత్ర,

పై వాటిని దృష్టిలోపెట్టుకుని ముందుగా ఒక్కొక అంశంలో ఒక్కొక్క కళాశాలకు సగటున యిద్దరు అధ్యాపకుల చొప్పున పునశ్చరణ శిక్షణ యివ్వాలి అంటే మొత్తం $150 \times 12 \times 2 = 3,600$ మందికి శిక్షణ యివ్వవలసి వుంటుంది. ఈ సంఖ్యచాలా ఎక్కువవున్న దృష్ట్యా వీరందరికి పునశ్చరణ శిక్షణ తరగతులను ఏ ఒక్క కేంద్రంలోనో జరిపించడం అంత సులభంకాదు. పైగా సాధ్యమూకాదు. అందుచేత పునశ్చరణ శిక్షణ తరగతులకు సంబంధించిన పథకం ప్రస్తుతం పరిశీలనలోవుంది. దీనిని రెండుదశలలో యీ క్రింది విధంగా తెలుగు అకాడమీ జరిపిస్తున్నది.

(అ) ఒక్కొక్క పాఠ్యాంశంలోనూ ముగ్గురు చొప్పున మొత్తం 12 పాఠ్యాంశాలకు ప్రతి యునివర్శిటీ ప్రాంతంనించి సీనియర్ అధ్యాపకులను రప్పించి తెలుగు అకాడమీలో తొలిదశ వర్క్‌షాపును పదిరోజులపాటు నిర్వహించడం జరిగింది. ఈ అంశాలన్నీ రెండు బృందాలుగా విభాగించబడినవి శాస్త్రపాఠ్యాంశాలన్నీ ఒకబృందంగా 1969 జూలై 14 నుంచి 23 వరకు జరిగాయి. హ్యూమానిటీస్ అనీ రెండో బృందంగా 1969 జూలై 28 నుంచి ఆగస్టు 6 వరకు జరిగాయి. ఒక్కొక్క బృందంలో సుమారు 40 మంది అధ్యాపకుల చొప్పున వున్నారు. ఈ వర్క్‌షాపులో భాషా శాస్త్రవేత్తలు, ప్రముఖ ఆచార్యులు ప్రదర్శనా పూర్వకమైన ప్రసంగాలను చేశారు. ఈ సీనియర్ అధ్యాపకులను ఉద్దేశించి విద్యాశాఖమంత్రి, ఆంధ్ర, ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు కూడా ప్రసంగించారు.

(ఆ) ఇక్కడ శిక్షణ పొందిన యీ సీనియర్ అధ్యాపకులు అకాడమీతరపున వివిధ కేంద్రాలలో యిదేమాదిరి వర్క్‌షాపులను నిర్వహిస్తారు. వీటిని ద్వితీయస్థాయి వర్క్‌షాపులని అంటారు. ఇవికూడా పదిరోజులపాటు జరుగుతాయి ఇటువంటివి వంద కేంద్రాలలో నిర్వహిస్తారు. తమకు సంబంధించిన పాఠ్యాంశాలను బోధిస్తున్న మిగతా అధ్యాపకులకు యీ సీనియర్ అధ్యాపకులు 1969 సెప్టెంబరులో పునశ్చరణ శిక్షణ తరగతులు నిర్వహిస్తారు. ఒక్కొక్క కేంద్రంలోనూ సుమారు 100 మంది అధ్యాపకులు పాల్గొంటారు. ఈ ప్రాంతీయ వర్క్‌షాపులతో తెలుగు అకాడమీ సహకరించి తోడ్పడడంతోపాటు వీటికి అవసరమైన మార్గదర్శకత్వాన్ని కూడా అందజేస్తుంది.

ఆధునిక తెలుగు భాషకు ఒక వివరణాత్మకమైన వ్యాకరణాన్ని తయారుచేసే వుద్దేశంతో రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో తెలుగు ఉచ్చారణాలలోగల తేడాలను క్షుణ్ణంగా పరిశీలించే క్షేత్ర పరిశీలనా కార్యక్రమాన్ని కూడా తెలుగు అకాడమీ చేపట్టింది. ఈ పని అప్పుడే ప్రారంభించడంకూడా జరిగింది. ఇది 1969 అక్టోబరునుంచి మరింత వేగాన్ని పుంజుకోగలదు. ★

## ప్రశంసా పతకాలు

ఈ యేటి స్వాతంత్ర్య దినోత్సవాలను పురస్కరించుకుని, రాష్ట్రపతి పేరిట గల పోలీసు, అగ్నిమాపక దళాల పతకాలను మొత్తం 15 గురు పోలీసు అధికారులకు ప్రదానం చేస్తున్నట్లు ప్రకటించారు. వీరిలో తిరుపతిలోని జిల్లా పోలీసు సూపరింటెండెంట్ శ్రీ తినుమూరు కృష్ణారెడ్డి ఒకరు.

# కొన్ని కోలాటం పాటలు

తూమాటి దొణప్ప

మువ్వలు కట్టిన మూరెడేసి బచ్చెన కోలలతో తాళంవేస్తూ గుండ్రటి కక్ష్యలలో తిరుగుతూ పాటలు పాడే జానపదుల ప్రాచీన జాతీయక్రీడా విశేషమే కోలాటం. దీన్నేరాయలసీమలో, ముఖ్యంగా అనంతపురమండల ప్రాంతంలో కోలన్న అని అంటారు. దండ నర్తనమనీ, దండలాసకమనీ పూర్వాంధ్ర కావ్యాల్లోని వ్యవహారం. మనసాహిత్యంలో చాల చోట్ల దీని ప్రసక్తి వచ్చింది. తెలుగు దేశంలో వెలసిన అనేక దేవాలయాలలో కోలాటం భంగిమలు, సంపుటీకరణం చెయ్యబడ్డ శిల్పకళా ఖండాలు కొల్లలుగా గోచరిస్తున్నవి.

పూర్వం పురుషులూ స్త్రీలూ విడివిడిగా కోలాటం వేసేవాళ్ళు ఇపుడయితే యిది యెక్కువగా తెలుగునాట పురుషులకే పరిమితమైన వినోద క్రీడగా నిలిచివున్నట్లు తోస్తున్నది. పూర్వసంప్రదాయానికి పరిశిష్టంగా బాలికలువేసే జడకోలాటం మాత్రం స్త్రీలపరంగా ఆచరణలో స్థిరపడి వున్నది. జడకోలాటంలోనూ నవరాత్రి మొదలైన వుత్సవాల్లో పిల్లలు వేసేకోలాటం సందర్భంలోనూ పాటలు పాడటం అంతగా అలవాటులో కనపించదు.

గంగగావూ, గాలి జాతరా, పోతరాజు కొలుపులూ, వూరి దేవర వుత్సవాలూ, దరగావురుసులూ, పల్లెదేవర పరసలూ, పీర్లసరిగస్తులూ, పారువేటలూ, పానకంపందేరాలూ మొదలైన పండగపబ్బాలలో గ్రామసీమలలో కోలాటం మామూలు వినోదం. పనిపాటులు ముమ్మరంగా లేని తెరపికాలాల్లో సైతం రాత్రి పూట రచ్చబండ దగ్గరో, వూరి వాకిలిదాపునో చేరి కోలాటం వెయ్యటం కూడా కొత్తకాదు.

కోలాటంలో సాధారణంగా యెనిమిది మందిగానీ, పన్నెండు మందిగానీ ఆటగాళ్ళు పాల్గొంటారు. సకృత్తుగా యీ సంఖ్యమారవచ్చుకూడా. ఆటగాళ్ళని వుద్దులు, వుద్దికాళ్ళు అని అంటారు. వీళ్ళల్లో ఆరితేరిన వాడొకడు మేళనాయకుడుగా వ్యవహరిస్తాడు. మేళనాయకుని పెన్నుద్ది అనీ, పెన్నుద్ది కాడనీ, అయ్యావారనీ పిలుస్తారు. వుద్దులంతా కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటారు. వుద్ది కాళ్ళల్లో తొలి సగంమందిలో, కక్ష్యలో సవ్యముఖంగానూ, మలి సగం మంది వెలికక్ష్యలో అపసవ్యముఖంగానూ లయబద్ధంగా అడుగులువేస్తూ కోలాటం వేస్తారు. కాసేపు కుదిగాళ్ళ మీద కూచునీ, కొంతసేపు బస్కీలుతీసుకూడా కోలాటం వేస్తారు. అలసిపోయిన వుద్దుల స్థానంలో వచ్చి కోలాటాన్ని కొనసాగించటానికి సత్రికాయ ఆటగాళ్ళు కూడా సిద్ధంగా వుంటారు.

పెన్నుద్దికాడు పాట ప్రతి చరణాన్నీపాడగా తక్కిన ఆటగాళ్ళంతా వాటిని అందుకుని పాడతారు. మేళనాయికుడు 'హేయ్ తట్టూ జముతక ధిమితక వుద్దీదిరుగూ యెలుద్దీకాడా యెచ్చరికన్నా తయ్యకుక్క తళాంగు తద్ధిమితా......' యిత్యాది ముక్తాయింపు చరణాల్ని యెత్తులయ మీద పాడి, ద్రుతగతిలో జగ్గు చౌకట్లు పలికి, కోలాటం కోల్దెబ్బలప్రస్తారం పరిశీలించి, వుద్దికాళ్ళ అడుగుతీరు సవరించి పాటని తీర్మానించి, కొత్తపాటలోని మొదటి నుడుగుల్ని విలంబితంలో యెత్తుకుంటాడు.

కోలాటం పాటలు నవరసభరితాలయినప్పటికీ ప్రధానంగా శృంగార రసప్రచురాలు. అందులోనూ పారదారిక శృంగారం అతివేలం. యిదంతా అనుభూతమనీ అనలేము; అనుష్ఠేయమనీ అంగీకరించలేం. అసంతుష్టవ్యక్తుల అవ్యక్త వాంఛలకు యిందలి విషయాలు అస్పష్టావతారాలని మనస్తత్త్వవేత్తలు వ్యాఖ్యానం చేస్తేచెయ్యవచ్చు. అయితే మనం అంతదూరం పోనక్కరలేదు. మరొక దృష్టితో వీటి తత్వాన్ని వివేచించవచ్చు.

ఇప్పుడంటే మనప్రాచీన గ్రామీణ వ్యవస్థ ఛిన్నాభిన్నమయిపోయిందిగాని, నిన్నా మొన్నటి దాకా నిల్చివున్నగ్రామీణ జీవితాన్ని సూక్ష్మంగా పృథఃకరించి చూస్తే యిలాటి వాటిపట్ల జానపదులకంత పట్టింపూ, పాటింపూలేనట్లు స్పష్టంకాకపోదు. అట్లని వాళ్ళు నీతిబాహ్యులనీ, నియమ విదూరులనీ నిర్ణయించటం కూడా నిజంకాదు. జానపద జీవితం నిమ్మకునీరెత్తినట్లు నిండుగా నిమ్మళంగా, అలజడీ ఆందోళనా అంటేయేమిటో యెరగని ప్రశాంత పథంలో గడచిపొయ్యేది.

ఒక నాటి గ్రామజీవనం మమతకూ, మానవతకూ మారుపేరు. భవిష్యత్తుని గూర్చిన భయాలుగాని, భూతకాలంనాటి పీడకలలుగానీ, వర్తమానంలోని బాధలుగానీ అనాటి జనుల బ్రతుకు బాటలలో అంతగా కనిపించేవి గావు. మిన్నువిరిగి మీద కొరిగినా మహా మేరువులా యెదురొడ్డి నిలిచే ధీరత్వం వాళ్ళలో నిసర్గంగా నిహితమైవుండేది అజ్ఞానం కొంతా, అమాయకత్వం కొంతా, అహంకారం వొకింత వాళ్ళలో వుంటే వుండవచ్చు. వాళ్ళు నిరీహులే కాక నిర్భీకులు కూడా. జీవిత సమస్యల పట్ల ఔదాసీన్యమూ, వాటి పరిష్కారంలో ఔదార్యమూ వారి నడవడిలో యిమిడి వుండిన విశిష్టలక్షణాలు.

బ్రతుకు తెరువు పొకగతుకులపుంతగా, అతుకుల బొంతగా తయారయిన నేటి వ్యవస్థలో నాగరికత మూర్తి కట్టిన వాళ్ళమని మురిసిపడే నేటి జనులు ఆదర్శాలను వల్లించటంలో అగ్రేసరులు; వాటిని ఆచరణలోకి అనువదించటంలో ఆరంభ శూరులు. ప్రస్తుత జీవిత పరమార్థం ఇలాంటి విపరీత సమన్వయంలో మిశ్రితమైవున్నది. అందుకని యీనాటి కొలగారంతో ఆనాటి జానపదుల బతుకు తీరులను విలువ కట్టటం న్యాయం కాదు. కుట్రలకూ కుటిలనీతులకూ కూటమిగా కుళ్ళిపోతున్న గ్రామసీమలు గాదు మనం లెక్కించ వలసింది. యీ చర్చనింతటితో ఆపి కోలాటం పాటలను కొన్నింటిని విందాం. యీ దిగువ కోలన్నకోపును చిత్తగించండి.

కొలు కోలుకోవే కోలన్న కోలుకోవే
చెలి కోలుకోవే కోలన్న కోలుకోవే
మద్దాన్నప్పుడెండా మద్దాన్నప్పుడెండా పునపూరి రచ్చబండా
కాసుకొక్కదండా ఘనమైన పెనుగొండా ॥కొలు॥

వాలుగొప్పుమిందా వాలుగొప్పుమిందా యీవాడు పూలదండా
చిన్నోడేసినదండా బంగారు తిరిపతి కొండా ॥కొలు॥

చేని మేరనుంటీ చేనిమేరనుంటీ నీవుచెప్పినట్ల యింటీ
అట్ల దానిపొందు నేనెట్ల మర్చి యుందూ ॥కొలు॥

పొట్టిదాని పొందు పొట్టిదాని పొందు యెట్లదొరికెసందు
అదేమె బెత్రమందు నేనెట్లగొట్టుకుందూ ॥కొలు॥

వానగాలివీచె వానగాలివీచె వాకిలి దట్టొక్కనిబడితి
దాన్నిరెండుదిడితీ దానమ్మని సెప్తోగొడితీ ॥కొలు॥

నాకన్ను సొట్టా నాకన్ను సొట్టా నామొగుణికన్నులొట్టా
సద్ద సేన్లా చొప్పా నేనెట్ల గడుదు కట్టా ॥కొలు॥

ఎదుల్ రెడ్డి యాసా ఎద్దుల్ రెడ్డియాస నాముద్దు యెంకటేశా
కడియాల్ కమ్మలు దేరా నాకలికి యెంకటేసా ॥కొలు॥

నీలిఛట్టివాడ నీలిదట్టివాడ నీటైన సొగసుకాడ
పెద్దల మిందివాడ నాపేరు దలిసిరార ॥కొలు॥

రూకల్ పోకల్ సాలు రూకల్ పోకల్ సాలు కోకల్ దెస్తేమేలు
వాడొస్తానంటేసాలు నా మొగుణికంటె మేలు ॥కొలు॥

రాకల్ పోకల్ జూస్తి రాకల్ పోకల్ జూస్తి నే నేకులరాటం బెడితీ
మాయత వచ్చె పోరా నీ మాయదుడ్లుగాల
కొలుకోలుకోవె కోలన్న కోలుకోవె
చెలుకోలుకోవె కోలన్న కోలుకోవె
...హేయ్ తట్టూజముతక ధిమితక వుద్దీవిరుగూ యెలుద్దికాడ
యెచ్చరికన్నా లోవుద్దికాడా తెలివుండన్నా హేయ్ జంతక జంతక ధింతక మరిగిన వారికి మామిడి గూటం, తప్పినవానికి తంగెగు బర్ర, రాకట్లో బన్నచెప్పిన కట్టి మరిసేరన్న తప్పేరన్న, మీసంనిండా సెయ్యించన్నా, రోసంగలిగి బతుకోయన్నా-తళాంగు తద్ధిమితా తకిటతయ్యక్కు తద్ధిమితా

యీ క్రింది పాటలోని నాయిక యెవరోనయగారాల నంగనాచి; కులాసాల గొడగూచి. సంసారాన్ని యెలా సద్దుకోవాలో, తెలివితేటల్లేని యింటి మగణ్ణి యెలాదిద్దుకోవాలో యామె యెరగదట! అందువల్లనే కాబోలు పాపం, యీ వ్యత్యయం! అని మనల్ని నమ్మించాలని చూస్తున్నది. ఇంటి మగడంటే యీమెకు వొళ్ళుమంట: పరాయివాడంటే వలపుల పంట. నడుమదిగే నాపసానీ యీమె పాలిట యిలవేల్పు. యీ ముగ్గుర్నీ యీమె యెలా ఆదరిస్తుందో అవధరించండి.

'యెల్లమ్మ యీ సముసారము నేనెదబడి కుదబడిచేసేవిధమూ
యెల్లమ్మ యీ సముసారమూ
యింటి మొగిణికీ ఆవులకుర్లూ
పరాయిమొగిణికి దేశం కుర్లూ

నడుమనదిరిగే వోబారమ్మకు
కొమ్ములుదిరిగిన బత్తెనుగొడ్డూ ॥యెల్లమ్మా॥

యింటి మొగిణికి కొర్రాన్నిబువ్వా
పరాయి మొగిణికి వరిన్నిబువ్వా
నడుమనదిరిగే వోబాళమ్మకు
సద్దారొటె ముద్దాపప్పు ॥యెల్లమ్మ॥

యింటి మొగిణికి నులకామంచం
పరాయి మొగిణికి పట్టేమంచం
నడుమనదిరిగే వోబాళమ్మకు
నగిషీచేసిన నవారు మంచం ॥యెల్లమ్మ॥

యింటిమొగుడూ దండుకుపోతే
సద్దీగట్టను గుడ్డేలేదు
పరాయిమొగుడూ దండుకుపోతే
నాగులచీరా నడిమికిజించే

యెల్లమ్మ యీ సముసారము
నే నెదబడి కుదబడిచేసే విధమూ
యెల్లమ్మ యీ సముసారము....
...హేయ్‌తట్టూ-తుంపెరి దిగమరి-కొండల్‌నడుమన-

తకిట దికిటతా- దగిలించన్నా కోలన్నా కొంగొత్తన్నా-

యేవూరన్నా యే పల్లెన్నా-యెచ్చరికన్నా రుమాలసెరుగూ వూడిందన్నా
పువాలసరమూ వాడిందన్నా - యెగజెక్కన్నా - దిగజెక్కన్నా - తయ్యక్కు తళాంగు తద్ధిమితా

ఇదిగోపాట మర్మకవిత్వానికొక మచ్చుతునక. సిద్ధయ్య వీరబ్రహ్మేంద్రుల గాలిసోకిన సరకులో యిదొక సరికొత్త దినుసుగా స్ఫురిస్తున్నది. ఇందేదో అంతరార్థం యిమిడివుందని అంటారు. చూస్తే వున్నట్టే అనిపిస్తున్నది. ఆ వున్న మర్మం మటుకు మన వూహకి అందిరాదు పాడినవాళ్ళని అడిగితే అందని పొందని అర్థాలు చెబుతారు. వాళ్ళుతానకులేగాని తాత్త్వికులు కారుగదా!

దీని అసలు భావమేమో నాకుకొంతైనా అవగతం కాలేదు. సరకును మీ యెదుటవుంచటం నా వంతు; తెలిస్తే వక్కాణించెప్పటం మీ వంతు; ఇదిగో వినండి

గోవిందా నందమ్మయా నన్నూ గోవిందానండీ
గోవిందానందక్కయా నన్నూ గోవిందానండీ

చెఱువులో రెండూచేపాపిల్లలు
సెలుక్కుమాని సెలకంగా
గడ్డనవుండె గుడ్డీకొంగా
ముద్దూబెడతాను రమ్మనగా ॥గోవిందా॥

కుంటలొ రెండూ తోకాకప్పలు
కుణిసి కుణిసి కులుకంగా
పుట్టలొవుండే నాగుంబాము
పొప్పులుబెడతాను రమ్మనగా ॥గోవిందా॥

మేకాపిల్లలు మేళంబట్టుక
యాడికి సంతకుబోవంగా
తోడేల్నాతుడు దోవకడ్డమొచ్చి
పెండ్లికి రమ్మని పిలువంగా ॥గోవిందా॥

గుమ్మకింద రెండు పందీకొక్కులు
కడుపూ నొస్తాదనంగా
మంచంకిందా బావిరిగాడు
మంతరిస్తాను రమ్మనగా

గోవిందా నండమ్మయా నన్నూ గోవిందానండీ
గోవిందా నండక్కయా నన్నూ గోవిందానండీ
హేఁయ్‌తట్టూ...గోపాళ గోపాళ గోపాళా

గోపాళసామి గోపాళే_వరగల మిరగల గోపాళే_హేఁయ్ కంబ్దూర్ కట్ కిందగోపాళే_చిప్లేకి బీరకాయ గోపాళే_హేఁయ్ తట్టూతళాంగు తయ్యక్కుతద్ధిమితా'.

అపారమైన జానపద సాహితీ సింధువులో యివి కొన్ని బిందువులు మాత్రమే.

# నీకొరకై మేము

_ తుంగతుర్తి విశ్వనాథశాస్త్రి

మానవతకు మారు పేరుగా
మాలో నీవు నిలిచావది
దీన జనుల దైవంగా
మేదినిపై వెలశావని
నీకు గుడులు కట్టాలని
మా నేతలు అంటుంటే
మాకు భయంగా ఉంది.
మానవతకు పరిధులు
మట్టిగోడలు అవుతాయని
'వద్దు వద్దు నాకు
దేవాలయాలు వద్దు' అని
నీవు స్వర్గం నుంచి
అరుస్తావని
చెవులు పెద్దవి చేసికొని
వినటానికి నిలుచున్నాము.
విభజించి పాలించిన
ఆ తెల్లవారిని నీవు వెళ్ళగొట్టి
మమ్మెల్లరను ఐక్యంచేయగా
మేమంతానేడు
బహు వర్గాలుగా విభజింపబడి
మాలో మేము తన్నుకుంటున్నాము
జాతి పితవైన
నీవు ఒకసారి
ఆ దివినుండి
యీ భువికి దిగివచ్చి
యీ నల్లవారి కలలో కన్పడి
మొక్కబోని మా ఐకమత్యం
ముక్కలు చేయరాదని చెబుతావని
మేమంతా కలలుకంటున్నాము.
తుపాకి గుండుకు ఎదురు నిల్చిన
యీ జాతికి నేతవు నీవు
భయం అంటే ఎరుగని జాతి
బల్లి పలికిందంటే
అభయం యిచ్చే వారికోసం
అర్రులు జాస్తోంది
నీవు ఒక్కసారి ఆకాశంలో
నిలు వెత్తు జ్యోతిగా వెలిగి
మాలో పేరుకున్న పిరికితనాన్ని
మంచులా కరగించి వేస్తావని
మేమంతా ఆశిస్తున్నాము.
తన చీకటి జీవితాన్ని
తప్పు పడుతోందని
యింటికి దీపం అయిన
యిల్లాలిని చంపి
యిల్లంతా చీకటి చేసిన
యింగిత జ్ఞానం లేని దొంగలా
నీవు వెలిగించిన
స్వాతంత్ర్య జ్యోతిని
తమలో నిస్వార్థాన్ని
నలుగురికి చూపుతోందని
నలిపివేయ ప్రయత్నిస్తున్న
నరరూప రాక్షసులతో
యీ పని దేశానికి
శాపంగా పరిణమిస్తోందని చెప్పటానికి
నీవు మళ్ళీ మాలో పుడతావని
మాకు నాయకత్వం వహిస్తావని
మేమంతా నీకొరకై వేచివున్నాము.

సీరియల్

# గృహిణి

## పిలకా గణపతి శాస్త్రి

### జరిగిన కథ

పార్థసారథి రామ నాట్యకళామండలిని నెలకొల్పి నాటకాలు వేస్తుండేవాడు ఆ నాటకాలలో హీరోయిన్‌గా సరోజ అనే ఆమె వేస్తుండేది. ఏలూరులో శ్రీకృష్ణతులాభారం నాటకం వేయాలని అన్ని ఏర్పాట్లూ జరిగాయి. కాని సమయానికి సరోజ మద్రాసు వెళ్ళిపోవడం వల్ల అది జరగలేదు. నానా రభస జరగగా మరో నాడు నాటకం వేయాలని నిర్ణయించుకున్నారు. ఆమెను పిలుచు కొద్దామని పార్థసారథి మద్రాసు వెళ్ళాడు. అయితే సరోజ మేన మామ పార్థసారథిని అవమానించాడు. పార్థసారథి జ్వరంతో మద్రాసులో వుండిపోతే అతని బావమర్ది వెళ్ళి తీసుకొచ్చాడు.

ఒకటి రెండుపూటలావిధంగా బాధపడిన తరువాత మరి సరోజ పేరు తలపెట్టకూడదని తన యావచ్ఛక్తి వినియోగించి దృఢంగా నిర్ణయించుకున్నాడు. ఆ సుస్థిర సంకల్పంతో పిల్లలిద్దరిని తన దగ్గర కూర్చోపెట్టమని భార్యతో చెప్పి వాళ్ళతో కబుర్లు చెబుతూ మనస్సు సరోజ మీద నుంచి పూర్తిగా మళ్ళించివేసుకున్నానని అనుకున్నాడు. పసివాళ్ళిద్దరు ఆడుకోవడానికి వెళ్ళినప్పుడు విజయలక్ష్మిని దగ్గరికి పిలిచి సన్నని హీన స్వరంతో పిచ్చాపాటీ మొదలు పెట్టాడు. ఆ విధమయిన నిరంతర ప్రయత్నాల వల్ల గట్టి పట్టుదలవల్ల తన గుండెలో నిద్రపోతున్న సరోజ స్వరూపం నిశ్శేషంగా తొలగించి వేసుకోగలిగానని ఎంతయినా సంతోషించాడు.

మరునాడు మధుసూదనరావు ఇచ్చిన బలమయిన ఇంజక్షను వల్ల టెంపరేచరు నూటనాలుగు నుంచి నూటమూడు దాకా దిగింది. కాని వెనకటి అవలక్షణాలన్ని తిరిగి తలలెత్తాయి. చెరుపు మరుపు మాటలు క్రమక్రమంగా తీవ్రమయి సంధిగా పరిణమించాయి. దానితో కొంచెం వెర్రిచూపులు, మగతకూడా ప్రారంభమయ్యాయి. ఆ పరిస్థితి గమనించి విజయలక్ష్మి, వర్ధనమ్మ, కృష్ణమూర్తి చాలా భయపడ్డారు. మధుసూదనరావు మనస్సులోకూడా ఆందోళన బయలుదేరింది. కృష్ణమూర్తిని రహస్యంగా దగ్గరికి పిలిచి, అంతగా ప్రాణభయంలేదని నచ్చజెప్పి ఇంగ్లండు వెళ్ళివచ్చిన స్పెషలిస్టు డాక్టరు శర్మను ఒకసారి తీసుకువచ్చి పార్థసారథి పరిస్థితి పరీక్ష చేయించడం చాలా అవసరమని చల్లగా సలహా ఇచ్చాడు. డబ్బుకోసం ఆలోచించవలసిన అవసరమేమి లేదని చెప్పి అతనిని త్వరగా వెంటబెట్టుకుని రావలసిందని కృష్ణమూర్తి తొందరపెట్టాడు.

డాక్టరు వెళ్లిపోయిన తరవాత పార్థసారథి పరిస్థితి తలుచుకుంటే అతనికెంతయినా భయంవేసింది. కాని ఆ దైవం చల్లని చూపు చూస్తే విజయలక్ష్మి మంగళసూత్రం బలిమివల్లనయినా బ్రతికి బయటపడక పోడని తిరిగి ధైర్యం తెచ్చుకున్నాడు అయితే ఆ ఇంటి పరిస్థితులన్ని అతనికి చాలా గందరగోళంగా కనిపించాయి. ఆఖరికి మందులు కొనడానికి కూడా తగినంత సొమ్ము సమయానికి దగ్గరలేక విజయలక్ష్మి తన మెడలో ఉన్న ముప్పేట చంద్రహారంతోబాటు రెండు గాజుల జతలు తాకట్టు పెట్టింది. ముందు జాగ్రత్త మంచిదని ఇంకా ఇరుగు ఇళ్ళల్లో చిన్న మొత్తాలు కొన్ని చేబదుళ్ళుగా తీసుకు వచ్చింది. పొద్దస్తమానము భర్తకెంతో జాగరూకతతో పరిచర్య చేసింది. కాస్త విశ్రాంతి తీసుకోవలసినదని వర్ధనమ్మ ఎంతగా చెప్పినా వినలేదు. అందువల్ల అసలే శుష్కించిన ఆమె మరింతగా చిక్కి శల్యమయింది. అయితే సావిత్రి, విజయలక్ష్మి నేమాత్రము ఇంటి పనుల్లో చెయ్యిపెట్టనీయలేదు! హార్లిక్సు దగ్గరనించి తానే కలిపి ఆమె చేతికందించింది. ఏ రోజు కారోజు పార్థసారథి పరుపుమీద దుప్పటీలు, తలగడా గలీబులు తానే ఉతికింది. ఇక మందులు మాకులు తేవడము మొదలయిన పై పనులన్ని కృష్ణమూర్తి సంబాళించుకున్నాడు. వారిద్దరు అప్పుడప్పుడు విజయలక్ష్మి కనేక విధాల ధైర్యం చెప్పి ఓదార్చారు. ఆ దంపతుల కావిధంగా తనమీద ఏర్పడిన ఆత్మీయత తలుచుకొన్నప్పుడు ఆమె కన్నులలో కన్నీటి బిందువులు నిలిచాయి. వారి ఋణం తానెన్నటికి తీర్చుకోలేనని అనుకొన్నది.

ఆ వేళ మధ్యాహ్నమే మధుసూదనరావు డాక్టరు శర్మని వెంటబెట్టుకుని వచ్చాడు. అతడు కొంచెం భారీమనిషి. ఇంగ్లండులో నాలుగయిదు ఏళ్లుండి పెద్దపెద్ద పరీక్షలేమో ఇచ్చి వచ్చాడు. కొంత కాలం అక్కడ ప్రాక్టీసు కూడా చేసి వచ్చాడని చెబుతారు. వైద్యానికి సంబంధించిన వ్యవహారాలన్నిటిలోను చాలా నిక్కచ్చి అయిన మనిషి కాని చాలా సమర్థుడని అందరు అంటారు. అతడు వస్తూనే ఇంచుమించుగా ఒక అరగంట సేపు పార్థసారథిని చాలా జాగ్రత్తగ పరీక్షించాడు. ఆ తరవాత డాక్టర్లిద్దరు కలసి ఇవతలికి

వచ్చి బాగా నెమ్మదిగా కొంచెంసేపు మాట్లాడుకున్నారు. డాక్టరు శర్మ అది నిస్సందేహంగా టైఫాయిడ్ కేసని నిర్ణయించాడు. వైద్యం మొట్టమొదటి నించి పెడదారి పట్టెనని సన్నసన్నగా చీవాట్లు పెట్టాడు. ఆ పరిస్థితిలో ఇకనయినా జాగ్రత్తగా వైద్యం చెయ్యకపోతే మాటదక్కడం చాలా కష్టమని గట్టిగా హెచ్చరించాడు. కృష్ణమూర్తి ఇచ్చిన ఫీజు అంటీ అంటనట్టు అందుకొని పంట్లాం జేబులో పెట్టుకొని త్వరగా ఇంకొక అర్జంటు కేసు చూడవలసి ఉన్నదని చెప్పి తొందరగా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

మధుసూదనరావు అప్పటినుంచి తన యావచ్ఛక్తి వినియోగించి చికిత్స చేశాడు. అత్యవసరమయి నప్పుడు డాక్టరు శర్మతో కూడా సంప్రతించాడు. ఆ తరవాత పార్థసారథి పరిస్థితి రవంత మెరుగయింది కాని ఆ మరునాడే మళ్లీ రోగం తిరగ బెట్టినట్టు కనబడింది. జ్వరంలో గాని సంధిలోగాని, మిగిలిన అవ లక్షణాలలోగాని ఏ మాత్రము గుణం కనబడలేదు. అంతకుమునుపు సంధిలో పార్థసారథి మొదలు చివర లేకుండ అసమ్బద్ధంగా ఏమేమోగొడవలు పెట్టాడు. ఇక ఇప్పుడెక్కువగా అతని నోట సరోజమాటే వినవచ్చింది. 'సరోజ వచ్చిందా? తప్పకుండా వస్తానని చెప్పిందే ! ఇంకారాలేదా ? త్వరగా ఒక అర్జంటు టెలిగ్రాం పంపించు! ఏమిటలాగ చూస్తావు? నేను చెప్పిన మాటలు విన బడడంలేదూ?' పొద్దస్తమానమూ అదే ధోరణి! ఎప్పుడయినా సంధి తగ్గినప్పుడు సన్నని హీనస్వరంలో కొంచెం మంచినీళ్లు కావాలని అడిగేవాడు. విజయలక్ష్మిని దగ్గిరికి పిలిచి 'భయం లేదులే! నాకు నింపాదిగానే ఉంటుందిలే! జ్వరం చాలావరకు తగ్గిందిలే!' అని ఆయాసపడుతూ ఓదార్చాడు.

కృష్ణమూర్తి ద్వారా ఆ సంగతివిన్న మధుసూదనరావు వెంటనే డాక్టరు శర్మతో సంప్రతించి ఒక ఇంజక్షను ఇచ్చి నాలుగయిదు గంటలలోగా గుణం కనబడక పోతే ఇంకొకటి ఇవ్వ వలిసి ఉంటుందని చెప్పి వెళ్లిపోయాడు. ఆ సాయంకాలానికి కూడా అతని ధోరణి రవంతయినా తగ్గలేదు! మాటిమాటికి 'సరోజ వచ్చిందా? వచ్చిందా? టెలిగ్రాం కొట్టారా!' అని ఒకటే ఎడతగని పేలాపన! తెరలు తెరలుగా వస్తున్న ఆ సంధి తగ్గినప్పుడుకూడా బాగా పరధ్యానంగా విజయలక్ష్మి వైపు చూసి 'సరోజ వచ్చిందా? ఏదీ, ఎక్కడ ఉంది?' అని సణిగాడు. అతని జ్వర తీవ్రతలో గాని, సంధిలోగాని రవంతయినా మార్పు కనబడలేదని విజయలక్ష్మి చాలా భయపడింది. వెంటనే కృష్ణమూర్తి డాక్టరు దగ్గిరికి వెళ్లి కొత్తగా ఇచ్చిన ఇంజక్షను వల్లకూడా గుణమేమి కనబడలేదని చెప్పాడు.

మధుసూదనరావుతో కలిసి కృష్ణమూర్తి తిరిగి వచ్చేసరికి సాయంత్రం సుమారు నాలుగుగంటలయింది. డాక్టరు నాడి పరీక్ష చేస్తున్నప్పుడు కూడా పార్థసారథి తనలోతాను 'సరోజ తప్పకుండా వస్తానని చెప్పిందే! ఎందుకు రాకుండా ఉంటుంది! వచ్చిందేమో చూడు! అదిగో! బండి చప్పుడు వినిపిస్తూంది!' అని అదే ధోరణిలో గొణుక్కున్నాడు. డాక్టరు సరోజా పార్థసారథు లిద్దరిని రంగస్థలంమీద రెండు మూడు సారులు చూశాడు. అందుచేత సంధిలో పార్థసారథి నోట ఆమె పేరు మాటిమాటికి వినిపించడం అతని కేమి విడ్డూరంగా కనబడలేదు. తిరిగి మరింత తీవ్రమైన ఇంజక్షన్ ఒకటి ఇచ్చి, దానివల్ల తప్పక గుణం కనపడగలదని చెప్పి ఇంటికి బయలుదేరాడు. అతనిని సాగనంపడానికి కృష్ణమూర్తి వీధి గుమ్మందాకా వెళ్లాడు. అంతలోనే విజయలక్ష్మి కొంచెం తొందరగా అడుగులు వేసుకుంటూ డాక్టరు దగ్గిరికి వెళ్లి తటపటాయిస్తూ నిలబడింది మధుసూదనరావు ఆమె ధోరణి కనిపెట్టి నెమ్మదిగా ఓదార్చాడు.

'ఏమిటమ్మా, ఇలా వచ్చావు! మరేం భయంలేదులే! ఇంతవరకు ఆశపోలేదు! ఆ పైన భగవంతుడున్నాడు! మానవ మాత్రులం మనమేమి చెయ్యగలం చెప్పు! చెయ్యగలిగినంత వరకు శాయశక్తులా చేస్తూనే ఉన్నాను. ఆ పైన శర్మగారితో కూడ సంప్రతించి ఇవ్వవలసిన మందులు ఇంజక్షనులు అన్నీ ఇస్తున్నాను. క్రమక్రమంగా తగ్గాలి మరి! ఇన్నాళ్లనించి ముదిరిన రోగం ఒక్కసారిగా తగ్గుతుందా?'

'అదికాదు డాక్టరుగారూ! మిమ్మల్ని ఒకమాట అడగాలని అనుకుంటున్నాను '

విజయలక్ష్మి కొంచెం తలవంచుకుని నెమ్మదిగా సణిగింది.

'ఏమిటది?'

డాక్టరు జిజ్ఞాసార్థకంగా బొమముడి విరిచాడు.

'ఏమిలేదు, ఆయన అస్తమానము సరోజమాట తలపెడు తున్నారుగదా! ఆవిడగాని ఒకసారి ఇక్కడికి వచ్చిచూస్తే గుణం ఏమన్నా కనబడుతుందా?'

విజయలక్ష్మి గొంతులో దగ్గుత్తిక మొలకెత్తింది తీవ్ర మానసిక పరిస్థితుల వల్లనే రోగాలు రాగలవని డాక్టరు అప్పుడప్పుడు చెబుతున్నమాట లామెవిన్నది. ఒకవేళ ఆ పరిస్థితిలో సరోజ వచ్చి చూస్తే కొంతకాకపోతే కొంతయినా గుణం కనబడగలదేమో అని ఆశపడింది. మునిగిపోతున్న మనిషి గడ్డిపరక పట్టుకున్నట్టు ఆ సలహా ఒక ఆలంబనగా స్వీకరించింది. ఆమె ఆలోచనమీద డాక్టరు నాలుగయిదు క్షణాలుపాటు ఆలోచించాడు.

'అయితే ఆమె ఇప్పుడు ఊళ్లో లేనట్టుందే!'

'పోనీ ఆయన పరిస్థితి ఇలాగుందని తెలియజేసి తొందరగా రమ్మని ఒక ఉత్తరం రాద్దామనుకుంటున్నాను. రాయమన్నారా?'

'అల్లాగే రాయమ్మా! దానికేం? ఆమె ఒకసారి వచ్చిచూస్తే తప్పకుండా పరిస్థితి బాగుపడి తీరుతుంది: దీనికి నేను చాలాసారులు దాఖలాలు చూశాను. . . . . మరి నేను వెళ్లనా?'

డాక్టరు తొందరగా వెళ్లి బండిలో కూర్చున్నాడు. కృష్ణమూర్తి అతని దగ్గర సెలవు తీసుకుని విజయలక్ష్మితో కలిసి హాలులోకి తిరిగి వచ్చాడు. ఆమె ఎంతో ఆత్రంగా అతనిని అడిగింది.

'వాబానీ! ఈ సరోజ అడ్రసు తెలుసునా?'

'తెలుసునుగాని ఇప్పుడు దానికంత తొందరేమి వచ్చింది? కృష్ణమూర్తి కొంచెం చిరాకుపడి అడిగాడు.

'పోనీ! వెంటనే సరోజపేర ఒక ఉత్తరం రాసి పోస్టులో వేద్దామని. ఇంకా మెయిలుకి బాగా వ్యవధి ఉందికదా!'

కృష్ణమూర్తి వెటకారంగా ముఖంపెట్టి విసుగ్గా చిరునవ్వు చిందించాడు.

'విజయా! నీ కేమయినా మతిగాని పోతూందేమిటి' మన డాక్టరుగారు మంచి వైద్యుడే గాని కొన్నివిషయాల్లో మాత్రం పట్టి చాదస్తం మనిషి! సరోజ ఒకసారి వచ్చి చూడగానే అమాంతంగా రోగం నయమయిపోతుందేమిటి?'

'పోనీ, ఆ సంధి తగ్గి పరిస్థితి కొంచెం బాగుపడితే చాలదూ?'

'ఆ మాత్రం బాగుపడుతుందని నమ్మక మేమిటి!'

'పోనీ డాక్టరు గారు బాగుపడుతుందన్నారుగా ! ఆయన మాట కొట్టి పారెయ్యడ మెందుకు ? ఆవిడ వచ్చి ఒకసారి చూస్తే ఆయన సంధి తగ్గిపోతుందేమో!'

విజయలక్ష్మి గొంతులో గద్గదిక తొణికిస లాడింది. అది గమనించి కృష్ణమూర్తి మరి కాదనలేక పోయాడు. కాని అంతలోనే తటపటాయించాడు.

'సరే, రాస్తేరాయిగాని. అటువంటి మనిషి మన గుమ్మంలో అడుగుపెట్టడం నా కిష్టంలేదుసుమా! ఆ పైన నీ యిష్టం'.

"ఎలాంటి మనిషిఅయితేనేం బావా ! అవసరం మనది కాదా!"

విజయలక్ష్మి ఎంతో ఆత్రంగా బ్రతిమాలుకుంది. కృష్ణమూర్తి రాఘవద్వారా తెలిసిన ఆమె చిరునామా చెప్పాడు. సరోజ ఎలాగయినా ఒకసారి తప్పకుండా వచ్చేటట్టు చూడవలసినదని రాఘవపేర వేరొక ఉత్తరం రాయవలసిందని విజయలక్ష్మి తిరిగి కృష్ణమూర్తిని బ్రతిమాలుకుంది. మొట్టమొదట అతడు దానికంగీకరించలేదు గాని తిరిగి ప్రాధేయపడిన తరువాత మరి కాదనలేక పోయాడు. సరోజపేర వెంటనే టెలిగ్రాం పంపిస్తే మంచిదేమో అని విజయలక్ష్మికి స్ఫురించకపోలేదు. కాని వివరంగా ఉత్తరం రాయడంవల్లనే పరిస్థితులన్నీ అవగాహనచేసుకొని ఆమె రావచ్చునని ఆశించింది.

వారిద్దరు కాగితాలు తీసుకుని ఉత్తరాలు రాయడం మొదలుపెట్టారు. విజయలక్ష్మి తన లేఖ ముగించి కృష్ణమూర్తికి లేచి చదివి వినిపించింది.

"శ్రీమతి సౌభాగ్యవతి సరోజ అక్కగారికి:

విజయలక్ష్మి నమస్కారాలు. అక్కడ మీ కందరికి క్షేమమే అనుకుంటాను. చెన్నపట్టణంనించి వచ్చినప్పటినించి మావారికి జ్వరం బాగా ఎక్కువయింది. రెండు మూడు రోజులనుంచి సంధి కూడా ప్రారంభమయింది. చాలాసేపు మనలో ఉండడంలేదు. సంధిలో ప్రతిక్షణము మీ పేరే తలపెడుతున్నారు. మాటి మాటికి "సరోజ ఇంకా రాలేదా? రాలేదా? "అని అడుగుతున్నారు. శ్రమ అనుకోకుండా మీరొక్కసారి వచ్చి, ఆయన్ని చూసి పలకరిస్తే సంధి తగ్గి ప్రాణాపాయం తప్పిపోతుందని ఎంతో ఆశ పడుతున్నాను.

మీరు గనక మా ఇంటికి ఒకసారి వచ్చినప్పుడు మంచి చెడ ఆలోచించుకోకుండా ఎంతయినా అమర్యాద చేశాను. దానికి నన్ను మన్నించి ఎలాగో అలాగ వీలుచేసుకుని తప్పకుండా ఒక్కసారివచ్చి చూసి వెళ్ళవలసిందని ప్రాధేయపడుతున్నాను. కాదనక ఆపదలోవచ్చి ఆదుకుని ఈ చిన్న కోరిక చెల్లించగలరని ఆశ పడుతున్నాను. ఎల్లుండి మెయిలులో మీ రాకకోసం ఎదురుచూస్తూ ఉంటాను. వస్తున్నట్టు ముందుగా టెలిగ్రాం పంపించ ప్రార్థన. నా తప్పులేమయినా ఉంటే మన్నించవలసినదని తిరిగి ఇంకొకసారి కోరుతున్నాను. విశేషాలు లేవు. ఉంటాను.

ఇట్లు
మీ చెల్లెలు
విజయలక్ష్మి

ఆ లేఖలో రెండవపేరా చదువుతూంటే విజయలక్ష్మి చెక్కిళ్ళ మీద వేడి వేడి కన్నీరు ధారకట్టి ప్రవహించింది. మరి ధైర్యం చిక్కబట్టుకోలేక చీర చెరగుతో ముఖం కప్పుకొని తన ఏడుపు సవ్వడి రవంతయినా వినబడకుండా అయిదారు క్షణాల పాటు కుమిలి కుమిలి దుఃఖించింది. కాని అంతలోనే తిరిగి ధైర్యం తెచ్చుకుని ముఖం శుభ్రంగా తుడుచుకొని లేనిచిరునవ్వు తెచ్చిపెట్టుకుని ఆ ఉత్తరం కృష్ణమూర్తి చేతికందించింది.

సన్నని ఆమె ఏడుపు సవ్వడి విని కృష్ణమూర్తి అంతకు మునుపే తన ఉత్తరం రాయడం నిలిపివేశాడు. విజయలక్ష్మి దుస్సహయాతన గమనిస్తూంటే సరోజమీద అతని కెంతయినా కోపంవచ్చింది. కంటబడితే గొంతు నులిమి చంపివెయ్యాలన్నంత అక్కసు కలిగింది. కాని ఏమిచెయ్యగలడు? అంతటి దురాగ్రహంలోను విజయలక్ష్మి కోరిక మన్నించక తప్పలేదు! ఇంచుమించుగా ఆమెకురాసిన ధోరణిలోనే రాఘవపేర లేఖ ముగించి, విజయలక్ష్మికది చదివి వినిపించాడు. ఆమె సూచనలప్రకారం కొన్ని చిన్న మార్పులుచేసి బాగున్నదని అంగీకరించిన తరువాత వెంటనే బయలుదేరి వెళ్ళి ఆ రెండు ఉత్తరాలు కవర్లలో ఉంచి, చిరునామా రాసి పోస్టుచేశాడు. (సశేషం)

# ఆంధ్ర కేసరి

# టంగుటూరి ప్రకాశం



ఆంధ్ర కేసరిగా ప్రసిద్ధి పొందిన ప్రకాశం, కనపర్తి గ్రామంలో మేనమామ యింట్లో జన్మించాడు. తండ్రి గోపాలకృష్ణయ్య, తల్లి సుబ్బమ్మ. గోపాలకృష్ణయ్య వ్యవసాయం చేస్తూ ఉండేవాడు. తరవాత పదిరూపాయల నెల జీతం మీద పాదుపత్యందారు (రెవెన్యూ ఇన్‌స్పెక్టరు) ఉద్యోగం చేశాడు. చిన్ననాటి పల్లెటూరి జీవనలో, ఆనాడు మనుష్యులలో ఉండే ఆప్యాయత, ఆపేక్షలూ ప్రకాశం హృదయంమీద చెరగని ముద్రలువేశాయి. దేశంలో అధిక సంఖ్యాకులైన పల్లె ప్రజల క్షేమంకోసం పాటుపడడమూ, జనసామాన్యంలో ఐక్యమైపోయి వారి ప్రేమను చూరగొనడమూ బహుశా చిన్ననాటి జీవన ప్రభావమే ఏమో!

అక్షరాభ్యాసం వల్లూరులో, తరవాత తెలుగు చదువు పెద్ద బావగారి దగ్గర అద్దంకిలో, ఆ పిమ్మట ఇంగ్లీషు చదువు నాయుడు పేటలో. అక్షరాభ్యాసం నాటినుంచీ అల్లరే. ప్రతిఫలం బెత్తం దెబ్బలు, మొట్టికాయలు, తొడపాశాలూ! వ్యాయామమూ, కుస్తీలూ అంటే సరదా.

పన్నెండవ ఏట తండ్రి గతించాడు. బిడ్డలను తీసుకొని తల్లి ఒంగోలు చేరింది. సాహసించి పూటకూళ్ల యిల్లు పెట్టి కష్టపడి పిల్లలను చదివించింది. ప్రకాశానికి నాటకాలలో వేషాలు వేయడం అలవడింది. ఆ నాడు ఆ ఊళ్లో ఉపాధ్యాయునిగా పనిచేస్తూ ఉండిన ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారికి కూడా నాటకాలంటే విపరీతమైన పిచ్చి. ప్రకాశానికీ, నాయుడు గారికీ పరిచయం ఏర్పడింది. ప్రకాశం చదువు, బడి జీతాల విషయంలో కూడా ఆయన సహాయపడుతూ ఉండేవారు.

వేసవి సెలవులలో నాయుడుగారి స్వస్థలమైన రాజమండ్రికి ఆయనతోపాటు ప్రకాశం కూడా ప్రయాణం కట్టాడు. నాయుడు గారికి ఆ పట్టణంలోనే ఉద్యోగం దొరికింది. ఒంగోలు తిరిగి వెళ్లడానికి బయలుదేరాడు ప్రకాశం. పడవలు దాటిపోయాయి. తిరిగి నాయుడుగారి దగ్గరి వచ్చాడు. ఇక్కడే చదువుకోకూడదా అన్నాడు నాయుడుగారు. సరే అన్నాడు ప్రకాశం.

గురు శిష్యులిద్దరికీ నాటకాల పిచ్చేకదా. నాటకాల గొడవ వల్ల మెట్రిక్యులేషన్ పరీక్ష పోయింది ప్రకాశానికి. రౌడీలతో స్నేహాలూ, జట్టీలు కూడా వస్తూండేవి. నాయుడుగారు దేవుడులా ఉండి ప్రకాశం పతనం కాకుండా కాపాడుతూ ఉండేవారు. తరవాత మెట్రిక్యులేషన్ ప్రైవేటుగా పాసయ్యాడు ప్రకాశం. నాయుడుగారి దయవల్లా, ప్రోత్సాహం వల్లా ఎఫ్. ఏ. కూడా పాసయ్యాడు.

ఆ తరవాత నాయుడుగారే శ్రమపడి ధనసహాయం చేసి ప్రకాశాన్ని మదరాసులో ప్లీడరీ చదివించారు. ప్రాక్టీసు రాజమండ్రిలోనే ప్రారంభమయింది. కొద్ది మాసాలలోనే ఫైలు బాగా పెరిగింది. క్రమంగా ప్రకాశం మునిసిపల్ రాజకీయాలలో ప్రవేశించాడు. ముప్పయియేళ్లు నిండకుండానే చైర్మన్ అయ్యాడు. ఉదయం ఆరుగంటలకు గుర్రంమీద బయలుదేరి, పట్టణం నాలుగు మూలలూ పర్యవేక్షించేవాడు. స్నానాలరేవులు అపరిశుభ్రం చేయకుండా పోలీసు బందోబస్తు ఏర్పాటు చేయించాడు.

విశాలాకాశంలో విహారం చేసే విహంగం వంటి మనస్తత్త్వం ప్రకాశానిది. సెకండ్ గ్రేడ్ ప్లీడరీ, రాజమండ్రి

మ్యునిసిపాలిటీకి ఛేర్మన్ – ఈ పరిధి చాలా ఇరుకుగా అనిపించింది. బారిస్టర్ పరీక్షకు చదవడానికి ఇంగ్లండుకు ప్రయాణమయ్యాడు.

చిన్నప్పుడు బడికి పోవడానికే పెద్దవాళ్లను నానాపాట్లు పెట్టి అడ్డమైన రౌడీలతో స్నేహంచేసి, నాటకాల హడావిడిలోపడి మొదటిసారి మెట్రిక్ తప్పిన ప్రకాశమే లండన్‌లో కష్టపడి చదివి బారిస్టర్ పరీక్ష పాసయ్యాడు. పాసవ్వడమేకాదు 75 శాతం మార్కులు వస్తేనేకాని లభించని సర్టిఫికేట్ ఆఫ్ ఆనర్, దానితోపాటు 50 పౌనులు నగదు బహుమానమూ కూడా సంపాదించాడు. ఇంగ్లండులో ఉండినప్పుడు ఐజక్ రూఫస్ అనే ప్రముఖన్యాయవాది దగ్గర జూనియర్‌గా పనిచేశాడు కూడా. ఆ రూఫసే తరవాత లార్డ్ రెడింగ్ ఐ మనదేశానికి వైస్రాయిగా వచ్చాడు.

ఇంగ్లండులో ఉండినప్పుడే ప్రకాశానికి రాజకీయాలలో అభినివేశం కలిగింది. లండన్ ఇండియన్ సొసైటీ అనే సంస్థలో మెంబరుగా ఉండి అక్కడి లైబ్రరీలోని అమూల్య గ్రంథాలు చదివాడు. ఆ సంస్థకు సంబంధించిన ప్రముఖులలో దాదాభాయి నౌరోజీ ఒకరు. ఆయన భారతదేశ దారిద్ర్యాన్ని గురించి వ్రాసిన గ్రంథం చదివి ప్రకాశం ఉద్దీపితుడయ్యాడు. నౌరోజీ బ్రిటిష్ పార్లమెంటుకు అభ్యర్థిగా నిలబడినప్పుడు, ఆయన కోసం ప్రకాశం ప్రచారం చేశాడు. కాంగ్రెస్ స్థాపకులు సర్ హెన్రీ కాటన్, సర్ విల్యమ్ వెడ్ బర్న్; భారతీయ ప్రముఖులు రమేశచంద్ర దత్తు, డబ్ల్యు. సీ. బెనర్జీల వంటి హేమాహేమీలతో పరిచయ భాగ్యం కూడా కలిగింది.

బారిస్టరు పాసయి మద్రాసు వచ్చాడు ప్రకాశం. భాష్యఅయ్యంగారు, కృష్ణస్వామి అయ్యరు, సుందరఅయ్యరు మొదలైన ఉద్దండుల మధ్య ధైర్యంతో నిలబడి న్యాయవాద వృత్తిని కొనసాగించాడు. న్యాయమూర్తులను కూడా లెక్కచేసే స్వభావం కాదు ప్రకాశానిది. ఉదాహరణకు నేపియర్ అనే దొర న్యాయమూర్తిగా ఉన్నప్పుడు ఒక కేసుకు సంబంధించిన వాదం పది నిమిషాలలో ముగించమన్నాడు. సాధ్యంకాదని ప్రకాశం అంటే దొర "చాలు, సోది కట్టిపెట్టండి." అన్నాడు. ఆ మాటలు ఉపసంహరించుకొనేవరకూ ఆర్గ్యుమెంట్ చెప్పనని భీష్మించాడు ప్రకాశం, దొరగారు కోపంతో లేచి వెళ్ళిపోయాడు. బారిష్టరు సంఘం తీవ్రమైన ఆక్షేపణ తెలపగా దొర క్షమాప చేప్పుకోవలసి వచ్చింది.

పధ్నాలుగేళ్లు ప్రాక్టీసు చేసి లక్షల ఆస్తి సంపాదించాడు ప్రకాశం. గంధీజీ సహాయనిరాకరణోద్యమం ప్రారంభించాడు. స్యమంతకమణి లాంటి ప్లీడరీని విసిరి పారవేశాడు ప్రకాశం. ప్రకాశం జీవితాన్ని ప్రకాశింపజేసిన ఒక ఉజ్జ్వల ఘట్టం స్వరాజ్య పత్రికా నిర్వహణం. లక్షల ధనాన్ని కర్పూరంలాగా వెలిగించి స్వరాజ్య నీరాజనం పట్టాడు దేశమాతకు. సహాయనిరాకరణ 'సందేశాన్ని ప్రజలకు అందిచ్చే సాహసం అనాడు ఏ పత్రికకూ లేకపోయింది. ఆ లోటు తీర్చడానికే 'స్వరాజ్య పత్రిక స్థాపించబడింది. అందులో శిక్షణ పొందిన ఎందరో యువకులు ఆ తరువాత పత్రికా రచయితలుగా, సంపాదకులుగా అఖిల భారత ప్రసిద్ధి పొందారు.

మనదేశంలో పర్యటించి పరిశీలించి మనదేశం స్వపరిపాలనకు ఎంతవరకూ సమర్థమైవుందో నిర్ణయించడానికి సీమనుంచి సైమన్ కమిషన్ వచ్చింది. కాంగ్రెసు ఆ సంఘాన్ని బహిష్కరించాలని తీర్మానించింది. ప్రజలను ఉత్సాహ పరచి సైమన్ సంఘానికి నిరసనగా ప్రదర్శనలు ఏర్పాటు చేశాడు ప్రకాశం. ఆ సందర్భంలో ఆయన చూపిన ధైర్య సహసాలకు ప్రజలు ముగ్ధులై ఆంధ్రకేసరికి జయజయ నినాదాలు చేశారు. చొక్కాను తొలగించి గుండెను చూపి కాల్చండి చూద్దాం అని సైనికులను ఎదిరించిన సాహస మూర్తి ఆయన. ఉప్పు సత్యాగ్రహంలో కూడా ఆయన చూపిన పరాక్రమం ప్రసిద్ధమైనదే.

స్వరాజ్య సమర యోధునిగానే కాక ఆయన పరిపాలనా దక్షునిగా కూడా ప్రఖ్యాతిగడించాడు. మదరాసు రాష్ట్రంలో రాజాజీ మంత్రి వర్గంలో రెవెన్యూ మంత్రిగానూ, ఆ తరువాత ముఖ్యమంత్రిగానూ, ఆంధ్రకు ప్రత్యేక రాష్ట్రం ఏర్పడిన తరువాత ఆ రాష్ట్రానికి ప్రథమ ముఖ్యమంత్రిగానూ ఉండి గ్రామోద్ధరణకూ, ప్రజాసేవకూ అంకితమైన అసమాన దేశభక్తుడు ఆంధ్రకేసరి.

ప్రకాశం చిన్నప్పుడు స్ఫురద్రూపి, రౌడీతనం ఎంతఉన్నా రసార్ద్రమైన కోమల హృదయం అతనిది. అందువల్లనే కరుణ, వీరరసాలను అద్భుతంగా పోషించేవాడు నాటకరంగం మీద. సత్యభామ, దమయంతి, ద్రౌపది, చిత్రరేఖ, కౌసల్య మొదలైన వివిధ పాత్రలు ధరించేవాడు. అర్జునవేశం ధరించి కృష్ణునిమీదికి బాణం ఎక్కుపెట్టినప్పుడు నిజంగా కొడతాడేమోఅని ప్రేక్షకులు భయపడి "ఆగు, ఆగు, కొట్టకు" అని కేక వేసేవారట. అంత సహజంగా ఉండేది ఆయన నటన.

తాను సరిఅయినదని నమ్మిన విషయంలో హరి బ్రహ్మాదులనైనా సరే ధిక్కరించే శక్తి ఆయనది. 1946లో రాజాజీ మదరాసు ముఖ్యమంత్రిగా ఉండాలని గాంధీజీ అభిలషించారు. ప్రజాస్వామ్యం అంటే ప్రజాస్వామ్యమేననీ, ఎంతటి మహావ్యక్తి అయినాసరే అడ్డం రాకూడదనీ వాదించి గాంధీజీని, కాంగ్రెసు అధిష్ఠానవర్గాన్ని ధిక్కరించి ప్రజాబలంతో ముఖ్యమంత్రిఐన నిజమైన ప్రజానాయకుడు, నిజమైన ప్రజాస్వామ్యవాది ప్రకాశం.

అమాయికులైన ప్రజలమీద ఎంత అభిమానమో, దురహంకారులైన అధికారులమీద అంత అసహ్యం. ఆయన ఢిల్లీ కేంద్ర శాసన సభలో సభ్యుడుగా ఉన్నరోజుల్లో, ఆనాటి హోమ్ మెంబరు కాంగ్రెసు సభ్యులనుంచి రహస్యాలు తెలుసుకోడానికి ప్రయత్నం చేస్తూ ఉండేవాడు. ఒకనాడు ప్రకాశానికి ఫోనుచేసి టీకి ఆహ్వానించగా ఆయన ఆ దొరకు నోరుముయ్యి అని సమాధానం చెప్పాడు.

రెవెన్యూమంత్రిగా ఉన్నప్పుడు జరిగిన ఒక ఉదంతం. రెవెన్యూబోర్డు మొదటి మెంబరుగాఉన్న హాల్ అనే ఆంగ్లేయుని రమ్మనమని కబురుచేస్తే దొర తన కార్యదర్శిని పంపించాడు. "నిన్నెవరు రమ్మన్నారు, వాణ్ణి రమ్మను" అని అతనిని తిరిగి పంపించాడు. హాల్‌వచ్చి చీటీపంపిన పావుగంటకు అతనిని పిలిచారు మంత్రిగారు. బోర్డుమెంబరు తనను పిలిచిన పని ఏమిటో

చెప్పవలసినదని తొందరచేయగా ప్రకాశం అన్నమాటలు " నీ సైము కంటె నా మంత్రి సైము ఎక్కువ విలువైనద్ది కాదా?" అని.

ఆపద కలిగిన చోటికి, అపాయం ఉన్నచోటికి పోవడం ప్రకాశం స్వభావం. తెవెన్యూమంత్రిగా ఉన్నప్పుడే గుంటూరులో కలరా వచ్చింది. కలెక్టరును అడిగితే హెల్త్ ఆఫీసరు వెడుతున్నాడనీ, హెల్త్ ఆఫీసరును అడిగితే తన ఉద్యోగులు వెడుతున్నారనీ సమాధానం వచ్చింది. వారి నందరినీ చీవాట్లు పెట్టి తాను స్వయంగా ఆ ప్రాంతంలో పర్యటించి ఇంటింటికి వెళ్ళి ప్రజలను ఓదార్చి ఆదరించిన కరుణామయుడు ప్రకాశం. రాయలసీమలో కరువు వచ్చినప్పుడు స్వయంగా వెళ్ళి కరువు పనులను ఏర్పాటు చేసిన కార్యసాధకుడు ప్రకాశం. హైదరాబాద్ రజాకారుల అల్లరులు కల్లోలంగా ఉన్న సందర్భంలో పులిగుహలో జొరబడినట్లు రజాకార్ల శిబిరంలో ప్రవేశించి అమాయక ప్రజలను హింసించడం అమానుషమని హెచ్చరించగలిగిన సాహసమూర్తి ప్రకాశం.

మంత్రిఐనా, మంత్రికాకపోయినా ప్రకాశం ఎప్పుడూ ప్రజల మనిషి. 1951 జూలైలో ప్రజలు విజయవాడలో తమనాయకుని కంచువిగ్రహం ఆవిష్కరించుకొని మహోత్సవం జరపుకున్నారు. ఎటుచూచినా ఒకమైలు మేరకు జన సమూహం. అది ఆనంద సముద్రం. ఉప్పొంగిన ఉత్సాహం. 22, 23 తేదీలు ప్రకాశ పర్వంగా గడచిపోయాయి.

1957 జూన్ 20 వ తేదీ, ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరంలో ఆంధ్రకేసరి అస్తమయంతో 85 ఏళ్ళ వీరయాత్ర సమాప్తమైంది. టంగుటూరి ప్రకాశం భౌతిక దేహం పంచ భూతాలలో కలిసిపోయింది. ఆ భౌతికదేహానికి ప్రతిరూపమైన విగ్రహం హైదరాబాదులోకూడా వెలిసింది. వాతావరణంలో లీనమైపోయిన ఆంధ్రకేసరి త్యాగపరిమళం మనం కలకాలమూ ఆఘ్రాణిస్తూనే ఉంటాం.

—యం. పద్మావతి

---

# అమరజీవి
# షోయబ్ ఉల్లాఖాన్

భారత యూనియన్‌లో హైదరాబాదు రాష్ట్రం విలీనీకరణ కొరకు ప్రాణాలర్పించిన "ఇమ్రోజ్" పత్రికా సంపాదకుడు శ్రీ షోయబ్‌ఉల్లాఖాన్ 21 వ వర్ధంతి 1969 ఆగష్టు 22వ తేదీన జరిగింది. పోలీసు చర్యకు ముందు 1948 ఆగష్టు 22వ తేదీన ఆయన హత్య గావింపబడ్డారు.

"తమకై ఐశ్వర్యాన్నీ, అవకాశాలనూ పొందడానికి ప్రయత్నించే వ్యక్తులను మనం సులభంగా మరచిపోతాము. ఒక ఉన్నతాదర్శానికై జీవితంతోసహా తన సర్వస్వాన్నీ ధారపోసే వారిని కలకాలం స్మరించుకుంటాము వారు గతించి చాలా కాలమైనప్పటికీ వారికి భావితరం చాలా ఋణపడివుంటుంది. షోయబ్ ఉల్లాఖాన్ వీరిలో రెండవ వర్గానికి చెందినవారు" అని స్వర్గీయ శ్రీ ఖాసా సుబ్బారావుగారు 1952 సంవత్సరంలో హైదరాబాదులో షోయబ్‌ఉల్లాఖాన్ స్మారక ప్రసంగం చేస్తూ అన్నారు.

ఈ మాటలు నిత్య సత్యమైనవి. షోయబ్‌ఉల్లాఖాన్ వంటి వ్యక్తులు చాలా అరుదుగా జన్మిస్తారు. అయితే వారి చర్యలు భావి సంతతి వారికి మార్గదర్శకమవుతాయి. పత్రికా స్వాతంత్ర్యాన్ని పరిరక్షించే పవిత్ర ప్రయత్నంలో షోయబ్ అసువులు బాశారు. శాశ్వత విలువలకొరకు అత్యధిక మూల్యం చెల్లించిన షోయబ్‌ఉల్లాఖాన్ వంటి వ్యక్తులకు, పాలరాతి ప్రతిమలు, కాంస్య విగ్రహాలవంటివేవీ సరిఅయిన స్మారక చిహ్నాలు కాజాలవు. సుస్థిరమైన పునాదిపై పత్రికా స్వాతంత్ర్యాన్ని ప్రతిష్ఠించడమే ఆయనకు సరిఅయిన స్మారక చిహ్నమవుతుంది. ఇట్టి స్వాతంత్ర్యమే పత్రికా రచయితలకు అడుగడుగునా ఉత్తేజం కలిగించగలుగుతుంది. ప్రజలకు అది దారి చూప గలుగుతుంది.

## దృఢ సంకల్పం

నేడు శ్రీ షోయబ్‌ఉల్లాఖాన్ జీవించివుంటే ఆయనకు 50 సంవత్సరాల వయస్సు వచ్చేది. 1920 అక్టోబరు 12 వ తేదీన ఆయన జన్మించారు. హత్య చేయబడనాటికి ఆయనకు మూడు పదుల వయస్సన్నా నిండలేదు. షోయబ్ ఉస్మానియా పట్టభద్రులు. చిన్న వయస్సులోనే ఆయనను జర్నలిజం ఆకర్షించింది. "తాజ్" అనే వారపత్రికలో చేరడంతో పత్రికా రచయితగా ఆయన జీవితం ప్రారంభమైంది ఆయన శాంత స్వభావులు, మృదుభాషి, అయితే దృఢ సంకల్పం కలిగినవారు

రిజ్వీ నాయకత్వం క్రింద ఇత్తెహాదుల్ ముసల్మీన్లు సాగిస్తున్న కార్యకలాపాలతో సంబంధం పెట్టుకున్నందుకుగాను నిజాంను విమర్శిస్తూ షోయబ్ వ్రాసిన వ్యాసాన్ని ప్రచురించినందుకు "తాజ్" వారపత్రికను నిషేధించారు. అందుచేత ఆయన మాజీ మంత్రి

శ్రీ ఎం. నరసింగరావు సంపాదకత్వాన వెలువడుతున్న "రయ్యత్" పత్రికలో చేరారు. కాని "రయ్యత్" ను కూడా నిషేధించారు. అయితే ఈ పరిస్థితులవల్ల అధైర్యపడకుండా షోయబ్, శ్రీ బి. రామకృష్ణరావుగారి వంటి కొంతమంది మిత్రుల సహాయంతో "ఇమ్రోజ్" అనే స్వంత పత్రికను స్వయంగా స్థాపించారు. శ్రీ రామకృష్ణరావుగారి ఇంట్లోనే ఈ పత్రికా కార్యాలయం వుండేది. "ఇమ్రోజ్" పత్రికా సంపాదకుడుగా అప్పటి నిజాం ప్రభుత్వాన్ని హడలెత్తించాడాయన. రజాకార్లయొక్క, వారి నాయకుడు కాశిం రజ్వీయొక్క మత విద్వేష విధానాలను, ఫాసిస్టు విధానాలను షోయబ్ నిర్దాక్షిణ్యంగా విమర్శించారు.

హైదరాబాదు, భారత యూనియన్‌లో విలీనం కావాలని ఆయన హుందాతనవుట్టిపడే శక్తివంతమైన భాషలో నొక్కి వక్కాణించారు. అవధులులేని ఆయన పత్రికా వ్యాసంగం రజాకార్లకు కంటకప్రాయంగా పరిణమించింది. తమనూ, తమ విధానాలనూ విమర్శించడం మానుకోకపోతే తీవ్ర పరిణామాలు కలుగుతాయని వారు ఆయనను బెదిరించారు. అయితే ఆయన అటువంటి బెదిరింపులకు లొంగే మనిషి కాదు. తన అంతరాత్మ ప్రబోధించిన సిద్ధాంతాలనూ, విధానాలనూ అనుసరించడం ఆయన మానలేదు. ఆయన రచనలో అతిశయోక్తులు ఎంత మాత్రం వుండేవి కావు. తనకు ప్రియమైన లక్ష్యాలను ప్రచారం చేయడానికి ఆయన తన కలాన్ని వినియోగించారు.

1948 ఆగస్టు 21వ తేదీనాడు శ్రీ షోయబ్ తన కార్యాలయంనుండి తిరిగి వస్తుండగా రజాకార్ దుండగీండ్లు ఆయనను కాల్చి, చేతులు నరకివేశారు. అటువంటి పరిస్థితులలోకూడ ధైర్యాన్ని కోల్పోక, గుండెదిక్కబట్టుకుని తన ఇంటివరకూ వచ్చి యింటికి కొన్నిగజాల దూరంలో స్పృహకోల్పోయారు. ఆతర్వాత తన ఆప్తులనూ, అభిమానులనూ దుఃఖ సముద్రంలో ముంచి దివంగతుడైనారు. రజాకార్ల విధానాలతో ఏకీభవించని మహమ్మదీయుల జీవితాలకు కూడా ప్రమాదం ఏర్పడడం, షోయబ్‌ఉల్లా హత్య జరగడం 'పోలీసు చర్య'ను త్వరితం చేసినట్లు చెప్పవచ్చును.

## గాంధీజీకి ప్రతీక

షోయబ్ తన తల్లిదండ్రులకు పదకొండవ సంతానం. చివరకు అతనొక్కడే మిగిలాడు. యవ్వనప్రాయంలోనే ఆయన దారుణంగా హత్యచేయబడడంతో ఆయన తల్లిదండ్రులకు కలిగిన దుఃఖం వర్ణనాతీతం. అయినా వారు ఎంతో గుండెనిబ్బరంతో వ్యవహరించారు. హత్యజరిగిన రాత్రి ఆయన భౌతిక కాయాన్ని గృహానికి తీసుకువచ్చినప్పుడు ఎక్కడా ఏడ్పుచప్పుడు వినిపించనీయలేదు. షోయబ్‌ఉల్లాను "గాంధీషోయబుల్లా" అని వ్యవహరిస్తూ ఉండడం ఆసక్తి కలిగిస్తుంది. గాంధీజీ వరంగల్లు జిల్లా మహబూబాబాదు మార్గంగా విజయవాడ వెడుతున్న రోజున షోయబు జన్మించారు. పోలీసులో పనిచేస్తున్న షోయబుతండ్రి, రైలుస్టేషన్‌లో ఏర్పాట్లు చేయడానికి నియమించబడినాడు. గాంధీ దర్శనం ఆయనను ప్రభావితునిచేసింది. గాంధీజీ దివ్యవిగ్రహం ఆయన నయనాలలో నిలిచిపోయింది. ఆయన గృహానికి వెళ్లగానే కొత్తగాపుట్టిన కొడుకును చూపారు. కుమారుని తలనిమురుతూ "అరే! ఇతను గాంధీలాగా ఉన్నాడు" అంటూ వర్ణించాడు. అందువల్ల ఆబాలుని షోయబుగాంధీ అనే పిలిచేవారు.

గాంధీ హత్యగావింపబడిన సమయంలో షోయబ్‌ఉల్లా ఖాన్ విపరీతంగా దుఃఖించాడు. తనయుని కన్నీరు చూచి "ఎందుకు విలపిస్తావు, గాంధీజీ మరణం వీరోచితమైనదని" అతనితల్లి అన్నది. "అమ్మా! నాకు కూడ అటువంటి మరణమే సంభవిస్తే నీవు కన్నీరు పెట్టవద్దు" అని షోయబు సమాధానమిచ్చాడు. అటువంటి మనస్తత్వం అతనిది. ఆయన జీవితం, జర్నలిస్టులకే గాక ప్రజలందరికి ఒక దృష్టాంతం అయింది.

ప్రభుత్వం ఆయన భార్యకు ఒక గృహాన్ని యివ్వడమేగాక పెన్షన్‌కూడ ఏర్పాటుచేసింది. ఆయన యిద్దరు కూతుళ్లు యిప్పుడు వివాహితలు. అటువంటి త్యాగమూర్తుల కుటుంబాలు సంతోషంగా జీవనం గడిపేవిధంగా చేసేబాధ్యత సమాజంపై ఉంది. ఏ ప్రభుత్వంగానీ, సమాజంగానీ షోయబ్‌ఉల్లా ఖాన్ వంటి అమర వీరునికి యేమిచేసినా ఋణంతీరదు.

## మహాత్ముల జీవితాలు మనకు ఆదర్శాలు

## పండుగలూ పర్వదినాలూ

# గణేశ చతుర్థి

—ఇవటూరి కామేశ్వరరావు

సద్బుద్ధిని ప్రసాదించి అజ్ఞానాన్ని హరించడానికి, సంపదల్నివ్వడానికీ, సర్వ విఘ్నాలను నాశనంచేసి సకల కార్యాల్ని సిద్ధింపజేయడానికీ, అనంత శక్తి సమన్వితుడైన శ్రీ మహా గణాధిపతి భారత జాతీయ జీవితంలో అనేక శతాబ్దాల తరబడి ఆరాధ్య దైవంగా భాసిస్తున్నాడు.

సంఘ జీవితంలో ప్రతి ఒక్కరూ ఆయన భక్తులే. గణపతి సర్వ సిద్ధి ప్రదుడై ఏ పని ప్రారంభించినా అది నిర్విఘ్నంగా కొనసాగేందుకు గణాధిపతిని పూజిస్తున్నాం.

ప్రతి యేడూ భాద్రపద శుద్ధ చవితికి ప్రతి యిల్లూ కళ కళలాడుతూంటుంది. వినాయకుడు మన నిత్య జీవితంలో పెనవేసికొనిపోయిన పవిత్ర మూర్తి. ప్రతి బాలుడు, ప్రతి బాలిక నోట్లో ఈ క్రింది పద్యం వినబడుతూనే ఉంటుంది.

"తుండము నేక దంతమును తోరపు బొజ్జయు
వామ హస్తమున్
మెండుగ మ్రోయు గజ్జలును మెల్లని చూపులు
మందహాసమున్
కొండొక గుజ్జు రూపమున కోరిన విద్యల కెల్ల నొజ్జయై
యుండెడి పార్వతీ తనయ యోయి గణాధిప
నీకు మ్రొక్కెదన్."

మన ప్రబంధాల్లో, కావ్యాల్లో ప్రతి కవీ గణాధిపతికి అంజలి ఘటించి మరీ ఉపక్రమిస్తారు. ఆయన ఆశీర్వాద బలం అంత అమోఘమయింది. ఇలాగే పిల్లలు సంగీతం నేర్చుకునే ముందు హంసధ్వని రాగంలో వాతాపి గణపతిని ఎంతో శ్రవణపేయంగా ఆలాపిస్తారు.

దసరా పండుగ దినాల్లో చూర్ణికలు, పాటలు గణపతిమీద పాడతారు.

"శ్రీగణాధీశాయ శివకుమారాయ
నాగముఖ తుండాయ సృష్టి కర్తాయ
శ్రీకంఠ తనయాయ శివకుమారాయ
మాకు శుభములనిమ్ము మహిత విఘ్నేశ
జయ విజయీభవ దిగ్విజయీభవ."

విఘ్నేశ్వరుని పుట్టుకను గురించిన గాథ మనకు సుపరిచితమే. కైలాసంలో పార్వతీదేవి అభ్యంగన స్నానంచేస్తూ నలుగ పిండితో ఒక బొమ్మనుచేసి దానికి ప్రాణంపోసి వాకిలివద్ద కావలి ఉంచిందట. ఇంతలో మహా శివుడు పార్వతిదేవికోసం అక్కడకు రాగా వినాయకుడు లోనికి వెళ్ళవద్దని అడ్డగిస్తాడు. శివుడు క్రోధోద్రిక్తుడై త్రిశూలంతో ఆ పసిబాలుని శిరస్సు ఖండిస్తాడు. పార్వతి ఈ సంగతి తెలిసికొని చాలా విచారిస్తుంది. ఆ బాలుణ్ణి బ్రతికించవలసిందిగా ప్రాధేయపడుతుంది. శివుడు సమ్మతించి ఉత్తర దిక్కుగా తలఉంచి నిద్రపోతున్న ఏ ప్రాణి శిరస్సునైనా తెచ్చి ఈ పిండి బొమ్మకు అతికించవలసిందిగా ఆజ్ఞాపిస్తాడు. ఆలాగున ఒక ఏనుగు కనిపిస్తే దాని శిరస్సు ఖండించి తెచ్చి ఈ పిండి బొమ్మకు అతికిస్తారు. అప్పుడు శివుడు ప్రాణం పోస్తాడు అప్పటినుంచి వినాయకుడు గజాననుడయ్యాడు. వినాయకుని జన్మదినంగా భావిస్తున్న ఈ చవితినాడే మనం పూజచేసుకుంటున్నాం.

ఈ పండుగ వర్షాకాలంలో వస్తుంది. యింకా బాగా వర్షాలు పడుతుంటాయి. ప్రకృతి రమణీయంగా పసిమి పచ్చని పట్టుచీర కట్టుకున్నట్లుంటుంది. పండుగరోజున పిల్లల సంరంభం ఎక్కువగా ఉంటుంది. వినాయకుని విగ్రహాలు వేనకు వేలు మూర్తీభవించిన తేజోరాసులా అనేక వర్ణాకృతులతో మనకు సాక్షాత్కరిస్తాయి. యివి అనేక తరహాల్లో ఉంటాయి. చిన్న చిన్న విగ్రహాలనుంచి నిలువెత్తున విలసిల్లుతూ నేత్ర పర్వంగా భాసిస్తాయి. ఈ పండుగ పేరు చెప్పి వినాయకుని మూర్తులను తయారుచేసి వాటికి రంగులు వేసి విక్రయించుకునే వాండ్లది పైచేయిగా ఉంటుంది. ఫల పుష్ప పత్రాదులను ఏర్చి కూర్చి కుప్పలుగా పోసి అమ్మేవారి హడావుడి మరీ ఎక్కువగా ఉంటుంది. గ్రామ పరిసరాల్లోనివారు గణపతికి ఇష్టమైన 21 పత్రాలు ప్రోగుచేసి సమకూర్చుకుంటారు. చవితి మొదలు తొమ్మిది రోజులు అనుదినం వినాయకుని పూజించడం ఆచారమైంది. వీటినే గణపతి నవరాత్రులంటారు. ప్రసిద్ధ దేశ నాయకులు కీ॥ శే॥ లోకమాన్య బాల గంగాధర తిలక్, గణపతి ఉత్సవాలకు ఒక ప్రత్యేకతనూ, ప్రాముఖ్యాన్నీ కల్పించారు.

*నగరంలో ....*

# పౌరసమస్యల పరిష్కారానికి చీటీపద్ధతి

సమస్యల పరిష్కారానికై సుదీర్ఘమైన దరఖాస్తుల వ్రాయ నక్కరలేదు. మున్సిపల్ కార్పొరేషన్ చుట్టూ ప్రదక్షిణలు చేయ నక్కరలేదు బస్సుటికెట్ అంత చిన్నచీటీ నింపితేచాలు. మీతరపున పని జరిగిపోతుంది!

సీతాఫల్‌మండీ కౌన్సిలర్ శ్రీ దశరథ్‌జీ తమవార్డు ప్రజల సమస్యల సత్వర పరిష్కారానికి యీ కొత్త పద్ధతిని కనిపెట్టారు.

చూడగానే సూచన ప్రాయంగా సమస్య అర్థమయ్యే విధంగా శ్రీ దశరథ్‌జీ తొమ్మిది చిహ్నాలు తయారుచేశారు. ఈ చిహ్నాలు సర్వసాధారణమైన పౌర సమస్యలను సూచిస్తూఉంటాయి. ఎన్నికల గుర్తులలాగ ఇవి నిరక్షరాస్యులకు, స్త్రీలకు, పిల్లలకుకూడా అర్థమౌతూ ఉంటాయి.

ఉదాహరణకు మంచినీటి కుళాయిసమస్యకు కుళాయిబొమ్మ చిహ్నం. బల్బుబొమ్మ విద్యుచ్ఛక్తి ఆగిపోవడాన్ని తెలియజేస్తుంది.

దినదినాభివృద్ధి చెందుతున్న హైదరాబాదువంటి సువిశాల నగరంలో వివిధ కార్యాలకు వెళ్ళి పౌర సమస్యలను పరిష్కరించుకోవడం ఎవరికైనా కష్టమే. పైగా ఎంతో ధన వ్యయప్రయాసలకు లోను కావలసి రావడమే కాక కాలయాపన కూడా. పైగా వివిధ ప్రాంతాలలోని పౌరులు వ్రాసే దరఖాస్తులన్నీ చదివే తీరికకూడా అధికారులకు ఉండదు.

శ్రీ దశరథ్‌జీ రూపొందించి కొత్త పద్ధతిలో పైన పేర్కొన్న చిహ్నాలు గల చీటీలు ఉంటాయి దానిపై మీ ఇంటి నంబరు, ప్రాంతం, తేదీ వ్రాస్తేచాలు. మీరు పేరు వ్రాయనవసరంలేదు. సంతకంకూడ అక్కరలేదు.

సీతాఫల్‌మండి కమ్యూనిటీ హాలులో ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన పెట్టెలో యీ చీటీని పడవేయాలి శ్రీ దశరథ్‌జీ ప్రతిరోజు ఉదయం వెళ్ళి ఆ చీటీలన్ని తీసికొని వెంటనే తగుచర్యలకు ఉపక్రమిస్తారు.

కమ్యూనిటీహాలులో 12_10 వార్డు, 11_2 వార్డు పటాలను అమర్చారు ఇందులో ఏ నంబరుగల ఇల్లు ఎక్కడ ఉన్నది. స్పష్టంగా తెలుస్తున్నది. ఒక బ్లాక్‌బోర్డు కూడా అమర్చారు. దానిపై కూడా ఫిర్యాదులు వ్రాయవచ్చు. పూర్తి మరమ్మత్తులు జరిగే వరకు యీ ఫిర్యాదులను చెరపకుండా అలాగే ఉంచుతారు

మురుగునీటిపారుదల, పాయిఖానాలు, దోమలబెడద, వీధి దీపాలు, మంచినీటి సరఫరా, విద్యుత్ సరఫరా, టీకాలు, డ్రైనేజి వంటి సమస్యలను ఈ చీటీద్వారా తెలియజేయవచ్చును

ఈ క్రొత్త పద్ధతిని ప్రశంసిస్తూ రిపబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ ఇనిస్టిట్యూషన్ వంటి సంస్థలు లేఖలు వ్రాశాయి.

గత జనవరి 14 నుండి యీ పద్ధతి ప్రవేశపెట్టిన 3 నెలలలో శ్రీ దశరథ్‌జీకు 200 పైగా చీటీలు వచ్చాయి. అన్ని ఫిర్యాదుల విషయంలో 24 గంటలలోగా మరమ్మత్తులు చేశారు.

ప్రతి వార్డులో యీ పద్ధతి ప్రవేశ పెడితే పౌరసమస్య లెక్కడుంటాయి?

*

# నగర వార్తలు

## ఆంధ్ర మహిళా సభలో జాతీయ పతాకావిష్కరణ

ఆగస్టు 15 వ తేదీన హైదరాబాదులోని ఆంధ్ర మహిళా సభలో ఆంధ్రప్రదేశ్ ఉపముఖ్యమంత్రి శ్రీ జె. వి. నరసింగరావు జాతీయ పతాకం ఆవిష్కరించారు. గాంధీ శత జయంత్యుత్సవ సంవత్సర సందర్భంగా గాంధీజీ చిత్రపటాన్ని కూడా ఉప ముఖ్యమంత్రి ఆవిష్కరించారు.

ఈ సందర్భంగా మాట్లాడుతూ, తెలంగాణాలో విద్యాసంస్థల మూసివేత యింకా కొనసాగినట్లయితే విద్యార్థుల భవిష్యత్తుకు యీ పరిస్థితి భంగకరంగా పరిణమించగలదని ఆయన హెచ్చరించారు. ఇంకా ఆలశ్యం జరుగకముందే దీనికి సంబంధించిన అందరూ శ్రేయస్కరమైన మార్గాన్ని ఆలోచించి అనుసరించగలరనే ఆశాభావాన్ని శ్రీ నరసింగరావు వెలిబుచ్చారు.



ఆంధ్రమహిళా సభలో గాంధీజీ చిత్రపటాన్ని ఆవిష్కరించిన ఉప ముఖ్య మంత్రి శ్రీ జె. వి. నరసింగరావు

## సంక్షేమ కార్యక్రమాలను రాజకీయాలతో ముడిపెట్టరాదు



సాంఘిక సంక్షేమ మండలివారు తమకు జరిపిన సన్మానానికి సమాధాన మిస్తున్న మహిళా సంక్షేమశాఖా మంత్రి శ్రీమతి రోడామిస్త్రి

ఈనాడు మన రాష్ట్రంలోవున్న రాజకీయ పరిస్థితులతో సంక్షేమ కార్యక్రమాలను ముడిపెట్టనవసరం లేదనీ, ఈ సంక్షేమ కార్యక్రమాలు ఏమాత్రం కుంటుపడకుండా కొనసాగేట్లు చూడవలసిన అవసరం ఎంతయినా వున్నదనీ మహిళా సంక్షేమం, యాత్రా విషయాల మంత్రి శ్రీమతి రోడామిస్త్రి, ఆగస్టు 5 వ తేదీన రాష్ట్ర సాంఘిక సంక్షేమ మండలిలో తన గౌరవార్థం జరిగిన సన్మాన సభలో తెలియజేశారు.

రాష్ట్ర సాంఘిక సంక్షేమ మండలి, స్వచ్ఛంద సేవా సంస్థలు, ప్రభుత్వ శాఖల మధ్య మరింత సహకారం, సమన్వయం వుండవలసిన అవసరాన్ని గూర్చి మంత్రి తెలియజేశారు.

సాంఘిక సంక్షేమ మండలితో తనకుగల చిరకాల సాన్నిహిత్యాన్ని గూర్చి ఆమె తెలియజేస్తూ, యీ మండలిలోని తన సహచరులంతా తమ సహకారాన్ని అందజేయ వలసిందిగా, వారికి విజ్ఞప్తి చేశారు.

పనుల తీరులో ఆలస్యాన్ని తొలగించాలనీ, చాలా వరకు సమస్యలను వ్యక్తులతో నేరుగా కలుసుకుని మాట్లాడడం ద్వారా పరిష్కరించుకోవచ్చుననీ ఆమె అన్నారు.

ముందుగా సంక్షేమ మండలి అధ్యక్షులు శ్రీమతి బ్రహ్మ, మహిళా సంక్షేమ మంత్రికి స్వాగతం చెప్తూ, సాంఘిక సంక్షేమ రంగంలో శ్రీమతి రోడామిస్త్రి చేసిన గణనీయమైన సేవనుగూర్చి ప్రస్తుతించారు.

## పాఠ్య గ్రంథాల ఆవిష్కరణ

రెండేండ్ల ఇంటర్మీడియేట్ కోర్సులో మొదటి సంవత్సరానికి నిర్ణయించబడిన 12 పాఠ్య గ్రంథాలను ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ఆగస్టు 29 వ తేదీన హైదరాబాదులో ఆవిష్కరించారు ఈ గ్రంథాలను తెలుగు అకాడమీవారు ప్రకటించారు

ఈ సందర్భంలో మాట్లాడుతూ, దక్షిణాది రాష్ట్రాలలో ఇంటర్మీడియేట్ కోర్సుకు ప్రాంతీయ భాషలో పాఠ్య గ్రంథాలను ప్రకటించడంలోనూ, జూనియర్ కళాశాలలో విద్యాబోధన ప్రాంతీయ భాషలో జరిపించడంలోనూ ఆంధ్రప్రదేశ్ దే అగ్రతాంబూలమని ముఖ్యమంత్రి పేర్కొన్నారు.

ఆవిష్కరణోత్సవ సభకు అధ్యక్షత వహించిన విద్యాశాఖ మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు మాట్లాడుతూ 24 పాఠ్య గ్రంథాలలో యిప్పటికి 12 ప్రకటించబడినవనీ, మిగిలినవి త్వరలోనే ప్రచురించడం జరుగుతుందనీ అన్నారు.

పాఠ్య గ్రంథాలను కళాశాలల ద్వారా విక్రయిస్తారు.

## సర్వీసుల ఏకీకరణ
### కేంద్ర సలహా సంఘం సమావేశాలు

భారత ప్రభుత్వంచే నియమించబడిన కేంద్ర సలహా సంఘంవారు జూలై 26, 28 వ తేదీలలో హైదరాబాదులో సమావేశమై వాణిజ్య పన్నులు, మునిసిపల్ పరిపాలన, రెవెన్యూ, కార్మిక శాఖలకు చెందిన ఆంధ్ర, తెలంగాణా ప్రాంతీయులైన అధికార్ల బృందాలకూ, సర్వీసు సంఘాల ప్రతినిధులకూ ఇంటర్వ్యూలిచ్చారు.

ఈ సందర్భంలో కేంద్ర సలహా సంఘంవారిని హైద్రాబాదు సర్వీసెస్ అసోసియేషన్ ప్రతినిధులు, తెలంగాణా ప్రాంతానికి చెందిన సివిల్ అసిస్టెంట్ సర్జన్ల సంఘం ప్రతినిధులు కూడా కలుసుకున్నారు

రాష్ట్ర సలహా సంఘంవారు జూలై 21 వ తేదీ మొదలుకొని 26 వ తేదీ వరకు సమావేశాలు జరిపి నాన్‌గెజిటెడ్ ఉద్యోగులు సమర్పించుకున్న 259 విజ్ఞాపనలను పరిశీలించి పరిష్కరించారు. వ్యక్తిగతంగా వాఙ్మూలం యివ్వదలచిన ఉద్యోగులకు ఈ సంఘంవారు ఇంటర్వ్యూలిచ్చారు.

## భావ సమైక్యత

రాష్ట్రంలో భావసమైక్యతకు ప్రయత్నం చేయడం ద్వారా తెలుగు ప్రజల ఐక్యతను కాపాడాలని సమాచార, పౌరసంబంధ శాఖ మంత్రి శ్రీ ఎ. వాసుదేవరావు ప్రజలకూ, పత్రికల వారికీ విజ్ఞప్తి చేశారు. జులై 27 వ తేదీన ఆంధ్రప్రదేశ్ వర్కింగ్ జర్నలిస్టుల యూనియన్ వారు హైదరాబాదులోని ప్రెస్‌క్లబ్‌లో తమకుచేసిన సన్మానానికి సమాధానమిస్తూ, రాష్ట్ర ఐక్యత పరిరక్షించబడనట్లయితే దేశం మొత్తంమీద వేర్పాటు ధోరణులు ప్రబలే అవకాశం వున్నదని మంత్రి హెచ్చరించారు.



ప్రెస్ రిపోర్టర్స్ గిల్డ్ వారు ఆగస్టు 1 న తమకు జరిపిన సన్మానసభలో ప్రసంగిస్తున్న రాష్ట్ర సమాచార, పౌరసంబంధ శాఖా మంత్రి శ్రీ అక్కిరాజు వాసుదేవరావు

భావసమైక్యత ప్రచారానికి సమాచార శాఖలో ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటుచేసే ఆలోచన వున్నదని మంత్రి వెల్లడి చేశారు. భావ సమైక్యతను కాపాడడంలో పత్రికలవారు ముఖ్యమైన పాత్ర నిర్వహించవలసి వుంటుందని ఆయన పేర్కొన్నారు. తాము పత్రికా స్వాతంత్ర్యంలో గట్టి విశ్వాసం కలవారమనీ ప్రజా స్వామ్యమూ, పత్రికా స్వాతంత్ర్యమూ జంట పదవుల వంటివనీ ఆయన అన్నారు.

భారత్ వర్కింగ్ జర్నలిస్టుల ఫెడరేషన్ ఉపాధ్యక్షులు శ్రీ బి. నాగేశ్వరరావు, యూనియన్ కార్యకలాపాలను సమీక్షించారు.

యూనియన్ అధ్యక్షులు శ్రీ హనుమంతరావు వందన సమర్పణ చేశారు.



ఆంధ్రప్రదేశ్ వర్కింగ్ జర్నలిస్టుల యూనియన్ వారు జూలై 27న తమకు చేసిన సన్మానానికి కృతజ్ఞతలు తెలుపుతున్న సమాచార, పౌర సంబంధశాఖా మంత్రి

# జిల్లాలనుండి

## గాంధీ శతజయంతి పాఠశాల

నెల్లూరు జిల్లాలోని వాకాడులో ఆగస్టు 6 వ తేదీన గాంధీ శతజయంతి పాఠశాల భవనానికి పౌరసరఫరాల శాఖా మంత్రి శ్రీ ఆనం సంజీవరెడ్డి ప్రారంభోత్సవం చేశారు

## హనుమకొండ సమితిలో కుటుంబ నియంత్రణ

వరంగల్లు జిల్లాలోని హనుమకొండ పంచాయతీ సమితిలో 1967–68 లో 1110 స్టెరిలైజేషన్ శస్త్రచికిత్సలు జరిగాయి. 105 లూప్‌లను అమర్చడం జరిగింది. ఈ జిల్లాలో యీ విషయంలో హనుమకొండ సమితిదే అగ్రస్థానం రాష్ట్ర కుటుంబ నియంత్రణ మండలి వారు యీ సమితికి రూ. 250 నగదునూ, ఒక ట్రోఫీనీ బహూకరించారు.



భువనగిరిలో పాలశీతల కేంద్రం ఏర్పాటు_ నల్గొండ జిల్లా కలెక్టరు రూ. 10,000ల చెక్కును అందుకుంటున్న దృశ్యం

## యాత్రా కేంద్రంగా విశాఖపట్నం

విశాఖ పట్టణాన్ని యాత్రా కేంద్రముగా చేయడానికిగాను విశాఖపట్నంలోనూ, దాని పరిసరాలలోనూ, వున్న పర్యాటక ప్రాంతాలను అభివృద్ధి పరచడం జరుగుతుందని రాష్ట్ర యాత్రా విషయాల మంత్రి శ్రీమతి రోడామిస్త్రీ విశాఖ పట్నంలో యిటీవల తెలియ జేశారు. విశాఖపట్టణం స్వతహాగా ప్రకృతిశోభకు ఆలవాల మైన ప్రాంతమని ఆమె తెలియజేశారు. హిందుస్థాన్ నౌకాశ్రయం వారు యాత్రావిషయాల శాఖ ఆధ్వర్యంలో ఒక బోటును వుంచగల రన్న ఆశాభావాన్ని శ్రీమతి రోడామిస్త్రీ వ్యక్తంచేశారు.

## మహబూబ్‌నగర్‌కు స్టేడియం

మహబూబ్‌నగర్‌కు త్వరలోనే బహుళ ప్రయోజన కారి అయిన స్టేడియం ఏర్పడనున్నది. దీనికి రూ. 3 లక్షలు ఖర్చవు తుంది. ఆర్ట్సు అండ్ సైన్స్ కళాశాలకు ఆనుకొనివున్న స్థలంలో యీ స్టేడియం నిర్మాణం త్వరలోనే చేపట్టడం జరుగుతుంది.

## తిరుపతిలో విమానాశ్రయం

చతుర్థ పంచవర్ష ప్రణాళికలో చేపట్టనున్న పథకాలలో తిరుపతిలో ఒక విమానాశ్రయాన్ని నిర్మించే పథకాన్ని కూడా చేర్చాలని పౌర విమానయాన శాఖ సిఫారసుచేసింది. రాష్ట్ర ప్రభుత్వం ఈ విమానాశ్రయానికి స్థలం అందజేసింది. దీనికి రూ 33 లక్షలు ఖర్చవుతాయని అంచనా. తిరుపతి దేవస్థానం రూ. 15 లక్షల విరాళాన్ని యివ్వడానికి అంగీకరించింది. ఇది 1970 నాటికి పూర్తవుతుంది.



ఖమ్మం జిల్లాకలెక్టరు ఆగస్టు 6 న రూ. 2,250 నగదు బహుమతిని జిల్లాపరిషత్తు కార్యదర్శికి అందజేస్తున్న దృశ్యం

## నెహ్రూస్మారక బ్లాకుకు ప్రారంభోత్సవం

పాలకొల్లులోని ఎ.ఎస్.ఎన్. మూర్తి ప్రభుత్వ కళాశాలలో నెహ్రూస్మారక బ్లాకుకు ఆగస్టు 31న సాంఘిక సంక్షేమమంత్రి శ్రీ డి. పెరుమాళ్ళు ప్రారంభోత్సవం చేశారు.

## మహబూబ్‌నగర్ జిల్లాలో శానిటోరియం

మహబూబ్‌నగర్ జిల్లాలోని అప్పనపల్లి గ్రామంలో ఆధునిక పద్ధతిలో ఒక శానిటోరియంను నిర్మించాలని ఉద్దేశించారు. ఆంధ్రప్రదేశ్ సంక్షేమమండలి తొలిదఫాగా యిందుకు రూ. 1.5 లక్షలు మంజూరు చేసింది.

## నడికోడు-సికింద్రాబాదులమధ్య రైల్వే మార్గం

నల్గొండ జిల్లాలోని నడికోడు నుంచి వాడపల్లి, మిర్యాల గూడెం, తిప్పర్తి, నల్గొండ, నార్కెట్‌పల్లి, చిట్యాల, రామన్న పేట, భువనగిరి లేక బీబీనగర్‌ల మార్గంగా సికింద్రాబాదు వరకు రైలు మార్గం నిర్మించడానికి ప్రతి పాదించబడింది

దక్షిణ మధ్యరైల్వే ఇంజనీర్ ఇంఛార్జి (సర్వే) శ్రీ పి. వి. రాఘవరావు సర్వేపని పూర్తి చేశారు. ఈ విషయంలో నిర్ణయం తీసుకునే నిమిత్తం రైల్వే బోర్డుకు ఈ సంవత్సరాంతం నాటికి నివేదిక పంపుతారు.

శ్రీ రాఘవరావు నల్గొండ జిల్లా కలెక్టరు శ్రీ ఆర్. గోపివర్‌తో చర్చలు జరిపారు. హుజూర్‌నగర్, కోదాడులను కూడా ఆ ప్రాంతాలకు గల వనరులదృష్ట్యా ప్రతిపాదిత రైలు మార్గంలో చేర్చాలని శ్రీ గోపివర్, రైల్వే ఇంజనీర్లకు చెప్పారు. గనులు, భూగర్భపరిశోధనల శాఖ కూడా ఈ ప్రాంతంలో సర్వే జరిపింది. ఈ ప్రాంతంలో లభించే సున్నపురాళ్లలో 95 మొదలు 98 శాతం మేరకు కాల్సియం కార్బొనేటు పదార్థం వుంటుందని ఈ శాఖ పేర్కొన్నది. సిమెంటు ఫ్యాక్టరీని నెలకొల్పడానికి గల అవకాశాలను కూడా పరిశీలిస్తున్నారు.

జిల్లా కలెక్టరు, రైల్వే ఇంజనీర్లు ప్రతిపాదిత నల్గొండ యార్డునూ, ప్రత్యామ్నాయ స్థలాలను చూచారు. మిర్యాలగూడెంలో సహకార బియ్యం మిల్లు వద్ద రైల్వేయార్డు కొరకు స్థలం సేకరిస్తున్నారు.

## విశాఖపట్నంలో 400 వెసెక్టమీ శస్త్ర చికిత్సలు

విశాఖపట్నంలో జిల్లా కుటుంబనియంత్రణ సంస్థ తాలూకు శస్త్ర చికిత్సల సంచార విభాగంవారు విశాఖపట్నం మునిసిపల్ ప్రాంతంలో ఆగష్టు నెల మొదటి పక్షంలో 400 వెసెక్టమీ శస్త్ర చికిత్సలు జరిపారు. సంచార విభాగపు ఆరోగ్యాధికారి డా॥ రామనాథ్ అధ్వర్యం క్రింద శిబిరాలను నిర్వహించారు.



వరంగల్లు జిల్లాకలెక్టరు ఆగస్టు 1 న రూ. 2 ల నగదు బహుమతిని హనుమకొండ బి.డి.ఓ.కు అందజేస్తున్న దృశ్యం

## ఆదిలాబాదు జిల్లాలో 99 గ్రామాలకు విద్యుచ్ఛక్తి

ప్రస్తుత సంవత్సరంలో ఆదిలాబాదు జిల్లాలో తెలంగాణా ప్రత్యేక అభివృద్ధి నిధి క్రింద ఎన్నిక చేసిన 69 గ్రామాలతో సహా మొత్తం 99 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడానికి తలపెట్టారు. అభివృద్ధి నిధికి రు. 40 లక్షలు కేటాయించారు. మిగతా 30 గ్రామాలకు విద్యుచ్ఛక్తి శాఖ మామూలు నిధులతో విద్యుచ్ఛక్తి అందజేస్తారు.

# పొగాకు ఎగుమతి వస్తుమార్పిడి పద్ధతి

వస్తుమార్పిడి పద్ధతిని ప్రోత్సహించడానికి గల అవకాశాలను గూర్చి పరిశీలించడానికి స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ ప్రయత్నించిందనీ, తత్ఫలితంగా వస్తుమార్పిడి పద్ధతిలో రు. 4.5 కోట్ల విలువ గల పొగాకు ఎగుమతికి సూత్రప్రాయంగా ప్రతిపాదనలు ఉన్నాయనీ భారత ప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి తెలియజేసింది.

రాష్ట్రంలో తక్కువగ్రేడు పొగాకు నిల్వలు పెరిగి పోతున్నాయనీ, వీటిని ట్రేడింగ్ కార్పొరేషన్ కొనుగోలు చేయడానికి ప్రత్యేక ఏర్పాట్లు చేయాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కేంద్రాన్ని యిదివరకే కోరింది.

1968 లోను అంతకుముందు ఉత్పత్తి అయిన ఎఫ్. సి. వి తక్కువ గ్రేడు పొగాకుకు సంబంధించిన కనీసపు ఎగుమతి ధరను 20 శాతం నుండి 25 శాతానికి కేంద్ర ప్రభుత్వం తగ్గించింది. నికరంగా ఎగుమతి ఆర్డరు లభించిన నన్-క్యూర్, నాటు రకాల పొగాకును కనీసపు ఎగుమతి ధరకు తక్కువగా ఎగుమతి చేయడానికి కూడ అనుమతించబడింది.

ఈ చర్యల ద్వారా పొగాకు నిల్వలు తగినంతగా తగ్గిపోగలవని ఆశించబడుతున్నది. ఈ చర్యలను రాష్ట్ర ప్రభుత్వం జాగ్రత్తగా గమనిస్తున్నది. అవసరమైన చర్యలను ముమ్మందు తీసుకుంటుంది

*

PUBLISHED BY THE INFORMATION AND PUBLIC RELATIONS DEPARTMENT, ANDHRA PRADESH AND PRINTED BY THE DIRECTOR OF PRI
GOVT. OF ANDHRA PRADESH, AT THE GOVERNMENT CENTRAL PRESS.

